# అపరాధ పరిశోధన

రూ. 6 | ఫిబ్రవరి '85 |



అపరాధ పరిశోధన అనుబంధం—134

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## చావు నోటీసు

రచన : కాశీభట్ల భానుమూర్తి

## విష వలయం

రచన : టెంపోరావ్

## దెయ్యాల ప్రతీకారం

రచన : స్వరూప్

## మంత్రి కూతురు

రచన : మిస్ కె. మధుబాల

అగ్ని కిరీటం - ఆరవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్ —134
ఫిబ్రవరి, 1985
వెల: రు. 6-00
ఏడాది చందా: 72 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. పి. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# చావు నోటీసు!

కాశీభట్ట భానుమూర్తి

"ఏమిటి! అందరూ విచారంగా కూర్చున్నారు" అన్నాడు అప్పుడే ఆ గదిలోకి వచ్చిన చిరంజీవి.

"అసలు సమాచారం తెలిస్తే నువ్వూ విచార సముద్రంలోకి మునుగుతావు" అన్నాడు పురుషోత్తం చిరాగ్గా.

"ఈ చిరంజీవికి విచారమా! అపచారము. ఇంతకీ అసలు స మా చా ర ం ఏమిటి?" అని ప్రశ్నించాడు చిరంజీవి.

"ఇదిగో ఈ లెటర్ చదువు. అంతా నీకే అర్థం అవుతుంది" అని ఒక కాగితం తీసి చిరంజీవికి అందించాడు శంకర్రావ్.

ఆనందంగా కాగితం తీసుకొని, ఆతృతగా చదివి, ఆముదం తాగినవాడిలా ముఖం పెట్టాడు చిరంజీవి.

"ఒరే జగదీష్!

మా కుటుంబాన్ని సర్వనాశనం చేసిన మీ నలుగురిమీదా పగ తీర్చుకుంటా. మీ నలుగుర్నీ

చిత్రవధ చేసి చంపుతాను. మొదటి బోణీ నీదే. నిన్ను వారంరోజుల లోపుగా చంపుతాను. చేత నయితే, చేవ వుంటే నీ ప్రాణాన్ని కాపాడుకో!

షెల్లు,

హంతకులకు హంతకుడు"

అని వుంది.

"ఇప్పుడు ఎలా! వాడెవడో తెలియదు. ఎప్పుడు, యెలా, యెక్కడ చంపుతాడో తెలియదు. యేమిటి చేయటం?" అన్నాడు చిరంజీవి.

"పోనీ పోలీసు రిపోర్టు ఇస్తే" అన్నాడు శంకర్రావ్.

"ఇన్నాళ్ళు నీకు కాస్త బుర్ర వుందనుకొనేవాడిని. ఇప్పుడు అది నీకు లేదని నిరూపించుకొన్నావు. పోలీసు రిపోర్టు యేమని ఇస్తాం. మనం యే కుటుంబాన్ని సర్వ నాశనం చేశామో, వాళ్ళకి చెప్పాలి. అప్పుడు ముందు మనల్నే అరెస్టు చేస్తారు" అన్నాడు పురుషోత్తం.

"మన నలుగురి సంగతీ తెలిసివుండి, వాడిలా బెదిరించాడంటే, వాడేదో చాలా పెద్ద ప్లానులోనే వుండి వుంటాడు. అలాంటి వాడిని తేలిగ్గా అంచనా వేయకూడదు. వాడు వారంరోజుల లోపుగా జగదీష్‌ని చంపుతానన్నాడు. అంటే జగదీష్ చనిపోతేగాని వాడు మిగిలిన ముగ్గురి జోలికీ రాడు. జగదీష్ ఇల్లు కదలకుండా వుండి, మిగిలిన ముగ్గురం జాగ్రత్తగా జగదీష్ యింటిమీద కన్నేసి వుంచితే, వాడు తేలిగ్గా పట్టుపడిపోతాడు" అన్నాడు శంకర్రావ్.

"బెంగుళూరునించి రాగానే మా ఆవిడ చెప్పింది, మీ దగ్గరనుంచి ఫోన్ వచ్చినట్టు. యేదన్నా పార్టీ

అరేంజి చేసారేమో అని యెలా వున్న వాడ్ని అలాగే పరిగెత్తుకువచ్చా. తీరా చూస్తే—చావు నోటీసు!" అని గొణుక్కున్నాడు చిరంజీవి.

"ఎవరికీ అనుమానం కలక్కుండా పని పూర్తయిందా?" అని ప్రశ్నించాడు పురుషోత్తం.

"నేనిప్పటికి బెంగుళూరు లక్షసార్లు వెళ్ళి లక్షణంగా మార్చుకొచ్చా. జగదీష్ యెంత అందంగా దొంగనోట్లు ప్రింట్ చేయగలడో, నేనంత కంటే నేర్పుగా మార్చుకొని రాగలను. మార్చుకొచ్చిన అసలు నోట్లు రేపు లెక్కలు చూసుకుందాం" అన్నాడు చిరంజీవి.

"సరే, దానికేమిటి, యెప్పుడూ వుండేదే. నా సంగతేం చేశారు" అన్నాడు జగదీష్ విచారంగా.

"నువ్వేం భయపడకు. మన వృత్తిలో మనకందరూ శత్రువులే. యెవడో ఒకడు అలా బెదిరిస్తూ వుంటాడు. అలాంటి వాళ్ళనందరినీ పట్టించుకుంటే మన వృత్తిలో మనం ముందుకు సాగలేం. నీకేం భయంలేదు. ఎవడో వెధవ యాభై పైసలు చేతి చమురు వదిలించుకొని ఆ లెటర్ పోస్టు చేశాడు. వాడ్ని పట్టించుకోకు. మేం ముగ్గురం నీకు అండగా వుంటాం" అని అభయం ఇచ్చాడు పురుషోత్తం.

పురుషోత్తం మాటలకి జగదీష్ కొంత తేరుకున్నాడు. అదే అదనుగా భావించి అలమారులోంచి మందు సీసాలు, పకోడీల పొట్లాలు తీసి టేబిల్ మీద పెట్టాడు చిరంజీవి.

ఇక ఆ నలుగురికీ ప్రపంచంతో సంబంధంలేదు. తింటూ తాగటంలో మునిగిపోయారు ఆ నలుగురూ.

# 2

"బాసు! ఈ డిటెక్టివ్ వృత్తిని నమ్ముకొనేకంటే, ముగ్గురం ఒక కిళ్ళీ కొట్టు పెట్టుకోవటం ఉత్తమమని నా అభిప్రాయం" అన్నాడు ఓంకారం.

"నిజమే బాసు. అప్పుడే ఈ వృత్తి ప్రారంభించి రెండేళ్ళు అవుతున్నా, మనకొక పేరూలేదు, డబ్బూ లేదు. నెలకొక కేసు రావటంకూడా గగనమైపోతోంది. ఆ మధ్య ఐదు నెలలు కేసులులేక అజ్ఞాతవాసంలో రాముడిలా కష్టాలుపడ్డాం" అన్నాడు శ్రీకారం.

"అజ్ఞాతవాసం చేసింది రాముడు కాదు, లక్ష్మణుడు" అని సవరించాడు ఓంకారం.

"మీ బొంద. రాముడూ కాదు, లక్ష్మణుడూ కాదు" అన్నాడు పరిశోధనరావు విసుగ్గా.

"సీతా?" అని ప్రశ్నించాడు శ్రీకారం.

"నా బొంద. అజ్ఞాతవాసం చేసింది పాండవులు. ఆ కేసులులేని ఐదు నెలలూ మీకు రామాయణ, భారతాలు చదివి వినిపించినా బాగుండేది" అన్నాడు పరిశోధన రావు.

"జరిగిన వాటిని గురించి ఆలోచించి ప్రయోజనం లేదు. జరగని వాటిని గురించి, అసలు ఆలోచించకు అన్నారు జ్ఞానానందస్వామి వారు. కాబట్టి యిప్పుడు రామాయణ, భారతాల్ని గురించి ఆలోచించేకన్నా, మనకి కేసులు ఎందుకు దొరకట్లేదు. అన్నదానిని గురించి ఆలోచిస్తే మంచిదని నా అభిప్రాయం" అన్నాడు శ్రీకారం.

ఇంతలో తలుపు చప్పుడు అయింది.

"ఆ జ్ఞానానందస్వామీ! వచ్చావా" అని భక్తిగా

కళ్ళు మూసుకొని గాలిలోకి నమస్కార బాణాలు వేయ సాగాడు శ్రీకారం.

"శ్రీకారం ఇప్పట్లో తేరుకోడుగాని నువ్వు వెళ్ళి ఆ తలుపుతీయి" అన్నాడు పరిశోధనరావు, ఓంకారంతో.

ఓంకారం వెళ్ళి తలుపులు తీసి ఒక పాతికేళ్ళ కుర్ర వాడ్ని వెంట బెట్టుకొని వచ్చాడు.

వచ్చింది జ్ఞానానందస్వామి కాదని తెలిశాక, కళ్ళు తెరిచి ఆ కుర్రాడివైపు దృష్టిసారించాడు శ్రీకారం.

"నమస్కారం సార్. నా పేరు వెంకట్. మీ పరిశోధనలు 'అపరాధ పరిశోధన'లో చదివి మీనుంచి ఒక సహాయం పొందుదామని వచ్చాను" అన్నాడు వెంకట్.

"చెప్పండి. నాకు చేతనయినంత సహాయం చేస్తాను. అసలు అందుకేగా మేం యిక్కడ వున్నది" అన్నాడు పరిశోధనరావు.

వెంకట్ ఏం చెబుతాడా అని ఓంకారం, శ్రీకారం చూడసాగారు.

"మా నాన్నగారి పేరు సూర్యనారాయణగారు. పది హేనేళ్ళ క్రితం, అంటే నా పదేళ్ళప్పుడు మా నాన్న గారు హైదరాబాదులో ఒక ఫ్యాక్టరీలో పనిచేసేవారు ఆ ఫ్యాక్టరీకి నలుగురు ప్రొప్రయిటర్లు వుండేవారు. జగదీష్, పురుషోత్తం, శంకర్రావ్, చిరంజీవి. వీళ్ళు నలుగురూ కలసి ఆ ఫ్యాక్టరీ స్థాపించారు. అయితే ఆ ఫ్యాక్టరీ వ్యవహారాలు పురుషోత్తం చూసుకొనేవాడు. జగదీష్ దొంగనోట్లు ముద్రించేవాడు. చిరంజీవి వాటిని మార్చి అసలు నోట్లు తెచ్చేవాడు. శంకర్రావ్ గొప్పింటి పిల్లల రహస్యాలు తెలుసుకొని వాళ్ళని బ్లాక్ మెయిల్

చేసేవాడు. వచ్చిన మొత్తం డబ్బుని ఈ దుష్టచతుష్టయం సమానంగా పంచుకొనేవారు. ఈ విషయాలన్నీ నాకు మొన్ననే తెలిసాయి.

ఒకరోజు మా నాన్నగారు పనిచేస్తుండగా ప్రమాదవశాత్తు పైనుంచి పట్టుతప్పి తిరుగుతున్న మిషన్ మీద పడ్డారు. బలమైన దెబ్బలు తగిలాయి. బ్రతకటం కష్టం అన్నారు డాక్టర్లు. ఫ్యాక్టరీలో పనిచేస్తూ, ప్రమాదవశాత్తు యేదన్నా జరిగితే, ఆ వర్కర్ కి చాలా హెచ్చు మొత్తంలో నష్టపరిహారం ఇచ్చుకోవాలి!

అందుకని మా నాన్నగారిలో వున్న ఆ కాస్త ప్రాణాన్ని గుటుక్కు మనిపించి, తప్పతాగి పనిలోకి వచ్చి, మిషన్ లలో తల పెట్టి ఆత్మహత్య చేసుకున్నాడని సర్టిఫికెట్లు సంపాదించాడు పురుషోత్తం.

తమ కుటుంబంలో యెవరికీ తాగుడు అలవాటు లేదని తన భర్త ఆ రోజు తాగి పనిలోకి వెళ్ళలేదని, కోర్టులో ఎలుగెత్తి అరిచిన మా అమ్మమీద నుంచి లారీ దూసుకొని వెళ్ళిపోయింది. ఆ లారీ శంకర్రావ్ ది.

ఈ కేసులూ, గొడవలూ లేకుండా చేస్తే లక్ష రూపాయలు ఇస్తానని పురుషోత్తం పెట్టిన షరతుకి, కుటుంబ సర్దుబాటు నిమిత్తం, ఏమీ ఆలోచించకుండా మా అన్నయ్య ఒప్పుకొని, పురుషోత్తంవైపు సాక్ష్యం చెప్పి, పురుషోత్తాన్ని కేసులోంచి బయటపడేశాడు.

పురుషోత్తం మా అన్నయ్యకి లక్షరూపాయలు ఇచ్చాడు. అవి తీసుకొని, మా భావి జీవితాలకి ఏ లోటూ లేదని ఆనందిస్తూ ఇంటికి వచ్చిన అన్నయ్యని పోలీసులు పట్టుకున్నారు దొంగనోట్ల వ్యాపారం చేస్తున్నందుకు. లక్ష రూపాయల దొంగనోట్లు యిచ్చి, మా అన్నయ్యని

జైలుకి పంపించి తన నీచ బుద్ధిని బయట పెట్టుకున్నాడు పురుషోత్తం. పరువుకి ప్రాణం పెట్టే అన్నయ్య, జైలు లోనే ఆత్మహత్య చేసుకొని చనిపోయాడు.

ఒంటరిగా వున్న మమ్మల్ని చేరదీస్తానని, మా అక్కయ్యకి ఉద్యోగం ఇస్తానని చెప్పి, నమ్మించి మా అక్కయ్యని తీసుకొని వెళ్ళిన శంకర్రావ్, మళ్ళీ కని పించలేదు. నేను వెళ్ళి ఆ నలుగుర్నీ అమాయకంగా అడిగితే పరిహాసం చేసి పంపించారు.

అప్పటినుంచి, పెట్టిన వాళ్ళింట్లో తిని, చేసిన వాళ్ళింట్లో పనిచేసి, వారాలబ్బాయిగా వుండి నా బి.ఎ. డిగ్రీ పూర్తిచేశాను" అని ఆపాడు వెంకట్. అతని కళ్లు ఎర్రగా వున్నాయి.

"మరి ఈ విషయాలన్నీ మీకెలా తెలిశాయి. ఇప్పుడు మేం ఏం చేయాలి?" అని ప్రశ్నించాడు పరిశోధనరావు.

"ఆ నలుగురి పాపం పండబట్టి ఈ విషయాలు నాకు తెలిశాయి. ఒకనాడు నేను ఒక బ్రోతల్ గృహానికి వెళ్లాను. అక్కడ వున్న ఆ ఆడపిల్లల వ్యాపారి ఎవరో కాదు. స్వయానా నా అక్క. నన్ను చూసి ఆమె గుర్తించకపోయినా, నేనే ఆమెని గుర్తించాను. నన్ను గుర్తుపట్టాక మా అక్క బావురుమన్నది.

ఉద్యోగం ఇస్తానని, నమ్మించి తనతో తీసుకొని వెళ్ళిన శంకర్రావ్, నిర్దాక్షిణ్యంగా మా అక్క శీలాన్ని హరించి, ఆ తరువాత మిగిలిన ఆ ముగ్గురు వెధవలకి బహు మతిగా ఇచ్చాడట. వాళ్ళు ఆమెని వాడుకొన్నంత కాలం వాడుకొని, ఒక సానికొంపలో అమ్మేసారట. అక్కడ జీవచ్ఛవంలా బ్రతుకుతున్న మా అక్క, ఆ సానికొంప యజమానురాలు చనిపోవటంతో, తానే ఆ

కొంపని నడుపుతున్నదట" అని పిడికిలి బిగించి టేబిల్ మీద కొట్టాడు వెంకటే్‌ —

"మిస్టర్ వెంకటే్. ప్లీజ్ ఆవేశపడొద్దు. జరిగింది యెలానూ జరిగింది. ఆవేశపడి ప్రయోజనం లేదు. ఇప్పుడు మేం యేం చేయాలో చెప్పండి" అన్నాడు పరిశోధనరావు.

"మా అక్క నాకు మొత్తం సంగతులన్నీ చెప్పింది. ఆ దుర్మార్గుల అంతం చూడమని. తాను ఎన్నో ఏళ్ళుగా కూడబెడుతున్న డబ్బంతా నా చేతుల్లో పెట్టింది. నాకు భోజనం తెచ్చి పెడతానని లోపలికి వెళ్ళి, ఇక నా మొహం చూడలేక కామోసు ఆత్మహత్య చేసుకొని చని పోయింది.

ఇక నాకు నా అనేవారెవరూ లేరు. నాకున్నది పగ. నేను చేయవలసింది ప్రతీకారం. నా కుటుంబాన్ని రాక్షసంగా, క్రూరంగా హింసించి, వాళ్ళ చావుకి కారణ మయిన ఆ దుష్టచతుష్టయాన్ని నేను వదలను. నేను చంపాలనుకొంటే ఆ నలుగుర్నీ చంపటానికి పది నిమి షాలు పట్టదు. కాని అలాంటి పాపపు పని నేను చేయను.

వాళ్ళని చట్టానికి అప్పగించి, వాళ్ళ నేరాలు ఋజు వులతో సహా నిరూపించి, వాళ్ళకి ఉరిశిక్ష పడేటట్టు చేయాలి. వాళ్ళు ఇలాంటివే చాలా నేరాలు చేశారు. అందుకే పోలీసులకి, నాలాంటి వాళ్ళకి పట్టుబడకుండా, తణుకులో వుంటూ, హైద్రాబాదు, బెంగుళూరులాంటి పెద్ద పెద్ద నగరాలలో వాళ్ళ వ్యాపారాలు సాగిస్తు న్నారు.

మీరు వాళ్ళమీద నిఘా వేయండి. వాళ్ళు చేసే పని గమనించి, వాళ్ళు చేస్తున్న దొంగ పనికి సాక్ష్యాలు సేకరించి, పోలీసులకి ఇవ్వండి, వాళ్ళ నలుగురికీ ఉరిశిక్ష

పడటమే నాకు కావాలి. అందుకు మీకు ఫీజు ఎంతైనా ఇచ్చుకొంటాను. మీ ఫీజుగా యెంత కావాలో అడగండి" అన్నాడు వెంకట్.

"ఫీజుగా ఇప్పుడేమీ వద్దు. వాళ్ళు అసలు నేరస్థులే అని నేను నిర్ధారించుకొన్నాక అడుగుతాను" అన్నాడు పరిశోధనరావు.

"ఖర్చులకి ఉంచండి" అని వెయ్యి రూపాయలు జేబులోంచి తీసి టేబిల్ మీద పెట్టాడు వెంకట్.

"వాళ్ళ అడ్రస్సులు చెబుతారా?" అని అడిగాడు శ్రీకారం పుస్తకం, పెన్సిలూ తీసుకొని.

"వాళ్ళ నలుగురికీ వేరే వేరే యిళ్ళు వున్నప్పటికీ, వాళ్ళు నలుగురూ కలసి ఒక రూమ్ తీసుకొన్నారు. వాళ్ళ దుష్టకార్యకలాపాలన్నీ ఆ రూమ్‌లోనే జరుగుతాయి" అని చెప్పి, ఆ నలుగురి యిళ్ళ అడ్రస్సులూ, ఆ రూమ్ అడ్రస్సూ ఒక కాగితంమీద వ్రాసి శ్రీకారానికి ఇచ్చాడు వెంకట్.

"మరి నేను వెళ్ళొస్తా" అని వెంకట్ లేచాడు.

"మీ అడ్రస్సు చెబుతారా" అన్నాడు ఓంకారం.

"ఓ మరచిపోయా" అని తను వుండే లాడ్జి పేరూ, రూమ్ నెంబర్, ఫోన్ నెంబరూ చెప్పాడు వెంకట్.

ముగ్గురుకీ నమస్కారం చెప్పి బయటకి నడిచాడు వెంకట్.

టేబిల్ మీద వున్న వెయ్యి రూపాయల్ని జేబులో కుక్కుకున్నాడు పరిశోధనరావు.

"బాసు ఈ కేసు రేపు పంశోధించుకోవచ్చు. ఈ రోజు 'కాంచన గంగ' సినిమాకి వెడదామా" అన్నాడు శ్రీకారం.

"ఫస్టు వర్క్, నెక్స్టు పిక్చర్" అని బయటకి దారి తీశాడు పరిశోధనరావు. చేసేదిలేక రూమ్‌కి తాళం వేసి, పరిశోధనరావుని అనుసరించారు ఓంకారం, శ్రీకారంలు.

# 3

"ఘోరం జరిగిపోయింది. నువ్వు విన్నావా?" అంటూ పరిగెత్తుకు వచ్చాడు చిరంజీవి. అతని మొహం వడలి పోయి వుంది.

"నేనందుకే చెప్పాను జగదీష్‌ని బయటకి వెళ్ళొద్దని. అనవసరంగా బయటకి వెళ్ళి, ఘోరంగా చనిపోయాడు జగదీష్" అన్నాడు పురుషోత్తం విచారంగా.

"అసలు శంకర్రావ్ చెప్పినట్టు పోలీసులకి ఒక రిపోర్టు ఇస్తే, జగదీష్ మనకి దక్కేవాడు" అన్నాడు చిరంజీవి.

"తెలివి లేకుండా మాట్లాడకు. ఈ విషయంలో పోలీసులు మాత్రం ఏమి చేస్తారు. ఆ హంతకుడు కారు బ్రేకులు తీసేశాడు. మనవాడిది అసలే రాష్ డ్రయివింగ్. బ్రేకులు లేవని తెలిసి, ఆ ఖంగారులో ఎదురుగా వస్తున్న లారీని గుద్దేశాడు. కారు పప్పు పప్పు అయిపోయింది. జగదీష్ ప్రాణాలు వెంటనే పోయాయి. ఈ విషయం పోలీసులకి రిపోర్టు చేసినా, డిటెక్టివ్‌లకి రిపోర్టు చేసినా వాళ్ళు చేయగలిగింది ఏమీ లేదు" అన్నాడు పురుషోత్తం.

"నువ్వలా వేదాంతాలు వల్లిస్తూ కూర్చో, నేను కూడా 'హరీ' మంటాను" అంటూ విసురుగా గదిలోకి వచ్చాడు శంకర్రావ్.

"ఏం! నీకేమయింది" అన్నాడు పురుషోత్తం.

"ఏమీ కాలేదు. కాని ఏదో అవుతుంది. ఇదిగో ఈ 'చావు నోటీసు' చూడు" అంటూ ఒక లెటర్ పురుషోత్తం మీదకి గిరవాటు వేశాడు శంకర్రావ్ కోపంగా.

ఆ లెటర్ని పురుషోత్తం ఆత్రుతగా చదివి, చిరంజీవికి ఇచ్చాడు.

"ఒరే శంకర్రావ్!

నేను చెప్పాను. ఆ జగదీష్‌ని చంపుతానని. అలాగే చంపాను. మామూలుగా కాదు. ఏ పార్టు కాపార్టు ఊడి, ఏ కీలు కా కీలు విరిగి, దిక్కులేని దరిద్రపు చావు చచ్చాడు ఆ జగదీష్‌గాడు. ఆ తరువాత వంతు నీదే. అందర్నీ బ్లాకు మెయిల్ చేస్తూ బ్రతికావు. ఇక నీ జీవితం బ్లాంకే. చేతనయితే, చేవ వుంటే వారం రోజులలోపు యెదురయ్యే నీ మృత్యుదేవతని అడ్డుకో! ఇట్లు,

హంతకులకి, హంతకుడు."

"పోనీ వీడేదైనా డబ్బులు అడిగితే, ఇచ్చి ప్రాణాల్ని కాపాడుకోవచ్చు ననుకొంటే అలాంటిదేదీ అడగటం లేదు. పోనీ కాళ్ళో గడ్డమో పట్టుకొని బ్రతిమలాడదా మంటే, వాడి అడ్రస్సు తెలియదు. ఇక నా చావు తప్పదు" అని కుమిలిపోసాగాడు శంకర్రావ్.

"అలా అడదానిలా యేడవకు. ఇప్పుడే వెళ్ళి పోలీసు రిపోర్టు యిద్దాం. మన ముగ్గురి ప్రాణాలైనా కాపాడు కుందాం" అన్నాడు చిరంజీవి.

"సరే పదండి" అన్నాడు పురుషోత్తం చేసేదిలేక.

ముగ్గురూ రూమ్‌కి తాళం పెట్టి, పురుషోత్తం కారులో పోలీసుస్టేషన్‌లోకి వెళ్ళేటప్పటికి ఇన్‌స్పెక్టర్ శశికాంత్ యేదో వ్రాసుకుంటున్నాడు. పక్కనే వుండి ఎస్సై ముకుందరావు యేదో వివరిస్తున్నాడు.

వ్రాస్తున్న ఫైలు మూసేసి, ఈ ముగ్గురికీ సీట్లు చూపించాడు శశికాంత్. ముగ్గురూ కూర్చున్నారు.

"ఆ! ఇప్పుడు చెప్పండి. ఏం పనిమీద వచ్చారు" అన్నాడు ఇన్‌స్పెక్టర్ శశికాంత్.

శంకర్రావ్ జేబులోనుంచి లెటర్ తీసి, ఇన్‌స్పెక్టర్‌కి అందించాడు మౌనంగా.

ఆ లెటర్ పూర్తిగా చదివి 'షాక్' తిన్నాడు శశికాంత్.

"అయితే జగదీష్‌గారిని చంపింది ఇతనేనన్నమాట. మేం బ్రేకులు సడన్‌గా ఫెయిల్ అయి, ఆ యాక్సిడెంట్ జరిగిందనుకొంటున్నాం. చాలా ఘోరంగా జరిగింది ఆ సంఘటన. ఇంతకీ ఈ 'హంతకులకి హంతకుడు' మీమీద యెందుకు పగపట్టాడు. ఏదో బ్లాక్ మెయిల్ అంటున్నాడు అదేమిటి?" అని ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్ శశికాంత్.

"అది! ఆ....ఆ!" అని నీళ్ళు నమలసాగాడు శంకర్రావ్.

"మాలాంటి డబ్బున్న వాళ్ళమీద, పేదవాళ్ళకి సాధారణంగా పగ వుంటుంది కదా సార్. అసలు వీ డెవడో మాకు తెలియదు. బహుశా, యెప్పుడో యే ఉద్యోగమో, మరేదో అడిగి ఉంటాడు. యెంతమందికని ఉద్యోగాలు వేయించడం. లేదని చెప్పివుంటాం! అందుకని మామీద పగబట్టి యిలా చేస్తూ ఉండివుంటాడు. జగదీష్ చనిపోవటానికి ముందు జగదీష్‌కీ ఇలాంటి ఉత్తరమే వచ్చింది. దానిని మేం సీరియస్‌గా తీసుకోలేదు. కాని మా శంకర్రావ్ ఆ లెటర్‌ని సీరియస్‌గా తీసుకొని, ఆ హంతకుడి కోసం వేటాడాడు. అందుకనే 'బ్లాక మెయిల్' చేసేవాడిలా మా శంకర్రావుని పేర్కొన్నాడు" అని వివరించాడు పురుషోత్తం.

"అయితే జగదీష్‌గారు చనిపోవటానికి ముందు వారికి ఇలాంటి లెటర్ వచ్చిందా! అప్పుడే ఈ విషయం మాకు చెప్పివుంటే జగదీష్‌గారిని రక్షించే వాళ్ళము కదా! నిర్లక్ష్యంతో జగదీష్‌గారి ప్రాణాలు తీశారు. సరే ఇప్పటికైనా ఇక్కడికి వచ్చారు. సంతోషం. ఆ జగదీష్ గారికి వచ్చిన లెటర్ కూడా ఇవ్వండి" అన్నాడు ఇన్‌స్పెక్టర్ శశికాంత్.

జగదీష్‌కి వచ్చిన లెటర్ తీసి, ఇన్‌స్పెక్టర్ శశికాంత్‌కి అందించాడు పురుషోత్తం.

ఆ రెండు లెటర్స్‌ని పరిశీలనగా చూసి, "ఈ రెండిటిలోను దస్తూరి వేరేగా వుంది. ఈ రెండు లెటర్స్ వ్రాసినది ఒకరు కాదు. మీకు తెలుసున్న విరోధులెవరిదన్నా నా ఈ దస్తూరి?" అని ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్ శశికాంత్.

ముగ్గురూ అడ్డంగా తలాడించారు.

"ఈ మధ్యకాలంలో మీ నలుగురూ కాని, మీ నలుగురిలో ఏ ఒక్కరైనా గాని, ఎవరితోనన్నా గొడవ పడ్డారా. బాగా జ్ఞాపకం చేసుకొని చెప్పండి" అన్నాడు ఇన్‌స్పెక్టర్ శశికాంత్.

"చెప్పాముకదా సార్. ఎవరికైనా ఉద్యోగం ఇవ్వనందుకైనా, లేకపోతే మరే సంస్థకన్నా విరాళం ఇవ్వకపోతేనన్నా జరిగి వుండొచ్చుగాని, మరేవిధమైన గొడవలూ, మేం నలుగురం పెట్టుకోలేదు" అన్నాడు పురుషోత్తం.

"ఆల్‌రైట్. కంప్లయింట్ వ్రాసి యివ్వండి. శంకర్రావ్ గారి ఇంటిదగ్గర బందోబస్తు ఏర్పాటు చేస్తాను. మీ ముగ్గురుకూడా కాస్త ఆ హంతకుడు పట్టుపడేదాకా

జాగ్రత్తగా వుండండి. సాధ్యమయినంతవరకు ఇల్లు వదిలి బయటకి వెళ్ళకండి" అన్నాడు ఇన్స్పెక్టర్ శశికాంత్.

"మాకు తెలియదా సార్. మీరుకూడా ఆ హంతకుడ్ని త్వరగా పట్టుకొని, మా గుండెలమీద భారాన్ని తొలగించండి" అని కంప్లయింట్ వ్రాసి ఇచ్చాడు శంకర్రావ్.

ముగ్గురూకూడా ఇన్స్పెక్టర్ గారికి మరోకసారి చెప్పి బయటకు నడిచారు.

"ఉహూ! వున్న కేసులతో చస్తుంటే, కొత్త కేసు లొకటి" అన్నాడు ముకుందరావు చిరాగ్గా.

"ఏవేవో నేరాలు చేసేస్తారు. ఎవడో పగబట్టి ఏదో బెదిరించగానే, మన దగ్గరకి వచ్చి మన ప్రాణాలు తీసేస్తారు. విరోధు లెవరో చెప్పరు. గతంలో వాళ్లు చేసిన పాపపు పని యేమిటో చెప్పరు. ఏమీ లేకుండా వాళ్ళ మాత్రం యెందుకు పగబడతారు" అన్నాడు ఇన్స్పెక్టర్ శశికాంత్.

"సరే ఏం చేస్తాం. తప్పదు" అన్నాడు ముకుందరావు.

## 4

"కూర్చోండి" అన్నాడు పరిశోధనరావు విచారంగా.

"మీరు విన్నారా. అసలు విషయం" అన్నాడు వెంకట్.

"ఆ! జగదీష్ చనిపోవటమేనా! చాలా సడన్ గా జరిగింది. అప్పటిదాకా మేం ఆ రూమ్ దగ్గర, ఆ నలుగురి ఇళ్ళ దగ్గర తిరిగాం. సరిగ్గా ఆ జగదీష్ ఇంటి దగ్గరికి వచ్చేసరికి, అప్పుడే కారులో ఎక్కడికో బయలుదేరాడు జగదీష్. సరే అని మేం ఆఫీసుకి తిరిగివచ్చాక తెలిసింది, ఆ జగదీష్ కారు యాక్సిడెంట్ లో చనిపోయాడని. అసలు అంత ఘోరం జరుగుతుందని మాకు ఆ క్షణంలో

అనిపించలేదు" అన్నాడు పరిశోధనరావు.

"పాపం చేసిన ఒక దుర్మార్గుడ్ని దేవుడే శిక్షించాడు. ఇక ముగ్గురు ఉన్నారు దుష్టత్రయం" అన్నాడు వెంకట్ కసిగా.

"అసలు ఆ జగదీష్ కారు బ్రేకులు ఫెయిల్ అయి చనిపోయాడనగానే మా అనుమానం మీ మీదికి తిరిగింది. కాని మాకు కేసు అప్పగించాక మీరు అలాంటి పనులు చేయరని ఆలోచించి ఆ అనుమానాన్ని విరమించుకొన్నాం" అన్నాడు పరిశోధనరావు.

"అసలు వాళ్ళు నలుగుర్నీ నేనే చంపుదామనుకొన్నాను. చెప్పాను కదా. అందుకనే ఆ జగదీష్‌గాడికి లెటర్ వ్రాసాను. కాని నేను ఆ కారు బ్రేకులు తీయలేదు. నలుగురిలో కాస్త అర్భకుడు అమాయకంగా వుండేవాడు ఆ జగదీష్‌గాడు ఒక్కడే. అందుకని ముందుగా ఆ జగదీష్‌కి లెటర్ వ్రాసాను. కాని ఆ తరువాత అనవసరంగా ఆ వెధవల్ని చంపి నా భావి జీవితాన్ని నాశనం చేసుకోవటం వేస్టు అనిపించింది. అందుకే మీ ద్వారా వాళ్ళకి ఉరిశిక్ష పడేటట్టు చేద్దామని ఆ కేసు మీకు అప్పగించాను" అన్నాడు వెంకట్ నెమ్మదిగా.

"కాని మీరు ఆ లెటర్ వ్రాయకుండా వుండాల్సింది. అది గాని పోలీసుల చేతుల్లో పడితే మీరు చాలా ప్రమాదంలో పడతారు. హత్యానేరం మీద మిమ్మల్ని అరెస్టు చేయవచ్చు" అన్నాడు ఓంకారం.

"నేను ఆ హత్య చేయలేదుగా" అన్నాడు వెంకట్.

"చేయకపోయినా చేస్తానని బెదిరించడం నేరం. అయినా మీరేం భయపడకండి. అంతా సవ్యంగా చక్క

బెట్టే బాధ్యత మాది" అన్నాడు పరిశోధనరావు.

"ఆ ముగ్గురూ ఇప్పట్లో నేరాలు చేయరు. ఎందుకంటే భయపడి చస్తూంటారు" అన్నాడు వెంకట్.

"అందుకనే వాళ్ళు ముగ్గురూ పోలీసుస్టేషన్‌కి వెళ్ళారు" అన్నాడు పరిశోధనరావు.

"పోలీసు స్టేషన్‌కా?" అన్నాడు వెంకట్.

"అవును. అక్కడ ఒక గంటసేపు వున్నారు. ఏం జరిగిందో మాకు తెలియదుగాని, వాళ్ళ మొహాలు వడలిపోయి వున్నాయి. నేననుకోవడమేమంటే, మీరు లెటర్ వ్రాశారు. ఆ లెటర్లోలాగానే జగదీష్ చనిపోయాడు. అందుకని వాళ్ళు ముగ్గురూ భయపడి పోలీసుస్టేషన్‌కి వెళ్ళి ఆ లెటర్ పోలీసులకి చూపించి పోలీసు రక్షణ కోరి వుంటారు" అన్నాడు పరిశోధనరావు.

"నేను అనవసరంగా ఆ లెటర్ వ్రాశాను. మధ్య నేను ఇరుక్కుంటానేమో" అన్నాడు వెంకట్ విచారంగా.

"మీ కుటుంబాన్ని సర్వనాశనం చేసినందుకు ఆ జగదీష్ చనిపోయాడు. అయితే మా ద్వారా చట్టానికి చిక్కి చక్కగా చావవలసినవాడు, రోడ్డుమీద దిక్కులేని చావు చచ్చాడు. దీని గురించి ఆలోచించకండి. ఆ ముగ్గుర్ని మాత్రం చట్టానికి పట్టిచ్చే బాధ్యత మాది. పోలీసు స్టేషన్‌కి వెళ్ళి ఆ ఇన్‌స్పెక్టర్ శశికాంత్‌ని కలిసి కాస్త సమాచారం సేకరించి వస్తాం" అని లేచాడు పరిశోధనరావు.

వెంకట్ బయటకి నడిచాడు.

రూమ్‌కి తాళంపెట్టి పరిశోధనరావు బయటికి నడిచాడు.

పరిశోధనరావుని అనుసరించారు ఓంకారం, శ్రీకారంలు.

# 5

"హు! ఇక్కడ" అంది లక్ష్మి నెమ్మదిగా.

"అమ్మ దొంగా, ఇక్కడ కూర్చున్నావా. నేను ఆ పొదలన్నీ గాలించి వస్తున్నాను" అన్నాడు ఆనంద్.

"ప్రతిరోజూ ఒక్కచోటే కూర్చుంటే థ్రిల్ ఏమిటి. అది సరేగాని ఈ రోజు ఇంత లేటు చేసారేమిటి దొరవారు" అన్నది లక్ష్మి.

"దేవిగారి దర్శనానికి ఇంకా గంట టయిముంది కదా అని ఒక డిటెక్టివ్ పుస్తకం పట్టుకొన్నాను. తన్మయత్వంగా అది చదివి తలెత్తి చూసేసరికి ఐదు దాటింది. అంతే. ఆదరా బాదరాగా పరిగెత్తుకొని వచ్చాను" అన్నాడు ఆనంద్.

"కాస్త నెమ్మదిగా మాట్లాడండి. మనం ఇంకా లైసెన్సు రాని ప్రేమికులం. చాలా సైలెంట్ గా ఉండాలి. నెమ్మదిగా ప్రేమించుకోవాలి. అరవకూడదు" అన్నది లక్ష్మి.

"మహా మహా కార్లకి లారీలకే గంటా, రెండు గంటల్లో లైసెన్సులు వచ్చేస్తుంటే, మనకి మీ నాన్న లైసెన్సు ఇవ్వడేమిటి. అసలు నువ్వు మీ నాన్నగారిని అడిగావా, లేదా?" అన్నాడు ఆనంద్.

"నాన్నా చాక్లెట్ కావాలి, నాన్నా సినిమా చూస్తాను—అని అడిగినట్లు ప్రేమ విషయాలు యెలా అడగను" అంది లక్ష్మి.

"నాకు ముద్దులిచ్చే, ముద్దొచ్చే ఈ నోటితో అడుగు. మీ నాన్న పచ్చజెండా ఊపుతాడు" అని లక్ష్మి నోటి

మీద మృదువుగా వేలితో రాసాడు ఆనంద్.

"చాల్లే ఊరుకో. పచ్చ జెండా ఊపుతానో, ఎఱ్ఱ జెండాతో ఆపుతానో తెలియటంలేదు. ఈ మధ్య మా నాన్నగారి మూడ్ అసలే బావుండటం లేదు" అంది లక్ష్మి.

"ఏం! మీ నాన్నగారుకూడా యెవరినైనా పేడా మడా ప్రేమించి పారేస్తున్నారా?" అని అడిగాడు ఆనంద్.

"చాల్లే వెళాకోళం. మా నాన్నగారి వయస్సు ఎంతో తెలుసా. యాభై ఏళ్ళు" అందిలక్ష్మి చిరుకోపంగా.

"ఏం తెలుగు సినిమాల్లో చూడటంలేదు. అరవై ఏళ్ళ ముసలివాడు, పదిహేనేళ్ళ పడుచు పిల్లతో స్టెప్స్ వేసి, ఘోరంగా ప్రేమించేయటంలేదు" అన్నాడు ఆంద.

"అదేం కాదు. ఈ మధ్య మా నాన్నగారి ఫ్రెండ్ జగదీష్ గారు, ఒక కారు యాక్సిడెంట్ లో ఘోరంగా చనిపోయారు. మా నాన్నగారి మరొక ఫ్రెండ్ శంకర్రావ్ గారికి కూడా యేదో బెదిరింపు ఉత్తరం వచ్చిందట. అప్పటినుంచి మా నాన్నగారి మనస్సు, మనస్సులో లేదు. చాలా భయపడుతున్నారు" అంది విచారంగా.

"ఏమిటి? బెదిరింపు ఉత్తరమా!" అన్నాడు ఆనంద్.

"అవును. దానిని తీసుకొని పోలీసు స్టేషన్ కి వెళ్లారు మా నాన్నగారు. శంకర్రావుగారి ఇంటికి పోలీసు బందోబస్తు యేర్పాటు చేశారు. మా నాన్నగారు, మా నాన్నగారి మరొక ఫ్రెండు చిరంజీవిగారు ఈ విషయంలో చాలా భయపడుతున్నారు. ఇలాంటి సమయంలో యెలా

అడగటం అని సందేహిస్తున్నాను" అంది లక్ష్మి.

"ఈ తణుకులో కూడా నేరాలు మోడ్రన్ పద్ధతుల్లో జరుగుతున్నాయన్నమాట. హంతకుడు బెదిరింపు ఉత్తరాలు వ్రాసి మరీ చంపుతున్నాడంటే. వాడెవడో గట్టి పిండం అయి వుండాలి. వాడిని వదలకూడదు. పదేళ్ళబట్టీ రోజుకి పావలా అద్దె ఇచ్చి నేను చదివిన డిటెక్టివ్ పుస్తకాల్లోని సారం అంతటినీ ఉపయోగించి, ఆ లెటర్ వ్రాసిన వాడిని పట్టుకుంటాను" అన్నాడు ఆనంద్.

"వద్దు ఆనంద్. అలాంటి విషయాల్లో అనవసరంగా నువ్వు చిక్కుకోవద్దు. మా నాన్నగారే చూసుకుంటారు. నువ్వు కల్పించుకొంటే వాళ్ళకి కోపం రావచ్చు" అంది లక్ష్మి.

"హు! వీరనారీ! కాబోయే వీరపత్నీ. నీ ప్రియుడ్ని ధైర్యంగా పంపు. తప్పదు హంతకులకు ముప్పు. నేను ఈ కేసు తీసుకోవటం ఖాయం. అంత కష్టపడి డిటెక్టివ్ పుస్తకాలు చదివింది, ఇందుకోసమే" అన్నాడు ఆనంద్.

"నాకిష్టంలేదు. నువ్వు ప్రమాదాల్లో పడతావని నాకు భయం" అంది లక్ష్మి.

ఆనంద్ నవ్వాడు.

కాసేపయ్యాక యిద్దరూ ఇంటికి బయల్దేరారు.

లక్ష్మి పార్కు గేటు దాటేదాకా టాటా చెప్పి, నెమ్మదిగా ఇంటివైపు నడిచాడు ఆనంద్.

సాయంత్రం ఐదున్నరకి వచ్చి, యేడింటిదాకా మాట్లాడుతూ వుండిపోయిన ఆనంద్, ఆ చీకట్లో నడుస్తున్నాడు.

చలికాలం కావటం మూలాన ఆ సందంతా నిర్మానుష్యంగా వుంది. సందు చివరికి చేరాడు ఆనంద్.

ఇంతలో ఆనంద్ పక్కకి ఒక కారు వచ్చి ఆగింది, రెండు బలమైన చేతులు ఆనంద్ ని కారులోకి లాక్కున్నాయి. మరొక చేయి ఆనంద్ నోటిని మూసేసింది. తిరిగి కారు కదిలి గమ్యం కేసి సాగిపోయింది.

# 6

"రండి! రండి! చిరకాల దర్శనం" అని పరిశోధన రావు బృందాన్ని ఆహ్వానించాడు ఇన్ స్పెక్టర్ శశికాంత్.

నవ్వుతూ వచ్చి ఇన్ స్పెక్టర్ శశికాంత్ కి యెదురుగా వున్న సీట్లలో కూర్చున్నారు పరిశోధనరావు, ఓంకారం, [illegible]కారం.

"ఏమిటి ఇలా వచ్చారు. ఏదన్నా కేసు విషయమా" అని ప్రశ్నించాడు ఎస్సై ముకుందరావు.

"అబ్బే. కేసు లెక్కడివి. కేసులు ఈ మధ్య ఎక్కువగా రావటంలేదు. పనేం లేక, పోనీ మిమ్మల్నైనా ఒకసారి చూసిపోదామని వచ్చాం" అన్నాడు పరిశోధన రావు.

"మీకు కేసులు లేవు. మాకు కేసులు యెక్కువై చస్తున్నాం. ఉంటే అతివృష్టి, లేకుంటే అనావృష్టి" అన్నాడు శశికాంత్.

"ఏం, అన్నీ కూడా కష్టమైన కేసులా, లేక క్లిష్టమైన కేసులా?" అని ప్రశ్నించాడు పరిశోధనరావు.

"అన్నీ కాదు. ఓ కేసుమాత్రం మా ప్రాణాలు తీసేస్తోంది" అన్నాడు ఇన్ స్పెక్టర్ శశికాంత్.

"ఏమిటా కేసు?" అని ఆత్రుతగా ప్రశ్నించాడు ఓంకారం.

"అదో విచిత్రమైన కేసు. పురుషోత్తం, శంకర్రావ్, చిరంజీవి, జగదీష్ అని నలుగురు స్నేహితులున్నారు.

హైదరాబాద్‌లో వారికి ఏదో ఫ్యాక్టరీకూడా వుంది. ఆ మధ్య జగదీష్‌కి యెవడో 'హంతకులకి హంతకుడు' బెదిరింపు ఉత్తరం రాశాడు 'నిన్ను చంపుతాను' అని. అదేవిధంగా అతన్ని చంపేశాడు. దాంతో మిగిలిన ముగ్గురూ ఇక్కడికి పరిగెత్తుకొని వచ్చారు. ఆ ముగ్గురిలో శంకర్రావ్‌కికూడా ఆ బెదిరింపు ఉత్తరం వచ్చింది. మా రక్షణ అడిగారు. శంకర్రావ్ గారింటికి పోలీసు బందోబస్తు యేర్పాటు చేశాం. ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే వాళ్ళకి విరోధు లెవరో వాళ్ళకే తెలియదు. పైగా మేం ఆ లెటర్ వ్రాసిన వాడిని యిప్పటివరకూ పట్టుకోలేదని ఒకటే ఫోనులో పెడబొబ్బలు" అన్నాడు ఇన్‌స్పెక్టర్ శశికాంత్ విసుగ్గా.

శంకర్రావ్‌కి కూడా బెదిరింపు ఉత్తరం వచ్చిందని వినగానే పరిశోధనరావు 'షాక్'తిన్నాడు—జగదీష్‌కి బెదిరింపు ఉత్తరం వ్రాసింది ఎవరు? అని ఆశ్చర్యపడుతూ ఓంకారం, శ్రీకారంల మొహాలవైపు ప్రశ్నార్థకంగా చూశాడు పరిశోధనరావు.

ఓంకారం, శ్రీకారంలు కూడా ఆశ్చరప్యడి, తిరిగి ప్రశ్నార్థకంగా పరిశోధనరావు మొహంలోకి చూడసాగారు.

వీళ్ళ ముగ్గురి తత్తరపాటుని గమనించి, "ఈ కేసు గురించి వింటేనే మాకు ఇలా వుంది. పరిశోధిస్తున్న నాకు ఇంకెలా వుంటుందో చెప్పండి, పరిశోధనరావు గారూ!" అన్నాడు ఇన్‌స్పెక్టర్ శశికాంత్.

ఇంతలో టేబిల్ మీద ఉన్న ఫోన్ మ్రోగింది.

"చూశారా! ఇది యిప్పటికి డజ్రైఅరో ఫోన్. వెధవ ఫోన్ పీకించి పడేస్తే పీడా పోతుంది" అని విసుగ్గా

రిసీవర్ ఎత్తాడు.

గాభరాగా ఫోనులో మాట్లాడుతున్న ఇన్ స్పెక్టర్ శశికాంత్ ని చూసి, పై అధికారి యెవరన్నా మాట్లాడు తున్నారనుకొని అతన్నే చూడసాగారు పరిశోధనరావు, ఓంకారం, శ్రీకారంలు.

రిసీవర్ పెట్టేసి, మొహానికి పట్టిన చెమటని కేబు రుమాలుతో తుడుచుకోసాగాడు ఇన్ స్పెక్టర్ శశికాంత్.

"ఎవరు మాట్లాడింది? ఆ శంకర్రావేనా" అని అడి గాడు ఎస్సై ముకుందరావు.

"మాట్లాడటానికి ఆ శంకర్రావెక్కడున్నాడయ్యా, అరగంట క్రితమే 'హరీ'మన్నాడు. మనం ఇప్పుడు అర్జంటుగా అక్కడికి వెళ్ళాలి. నువ్వు పోలీసు డాక్టర్ని, వేలిముద్రల నిపుణున్ని, ఫొటోగ్రాఫర్ ని తీసుకొని ఆ శంకర్రావ్ ఇంటికి వచ్చేయి. నేను పరిశోధనరావుగారిని తీసుకొని ముందుగా అక్కడికి వెడతాను" అని ముకుంద రావుకి చెప్పి, చకచక జీపు యెక్కి కూర్చున్నాడు శశికాంత్.

శంకర్రావ్ పోయాడన్న 'షాక్'నుంచి తేరుకొని, గబగబ జీపు యెక్కి కూర్చున్నారు పరిశోధనరావు, ఓంకారం, శ్రీకారంలు.

జీపు శంకర్రావ్ ఇంటివైపు వేగంగా బయలుదేరింది.

## 7

"హు! ఇదా మీ సమర్థత. రెండు రోజులముందు మీ సహాయం కోరాం. ఇంతమంది పోలీసులు కాపలాగా వున్నారు. అయినా మా శంకర్రావ్ చనిపోయాడు. అందుకే మీ పోలీసు డిపార్టుమెంటుని ప్రజలు వేలెత్తి చూపుతున్నారు" అన్నాడు చిరంజీవి ఆవేశంగా.

"మిస్టర్ చిరంజీవి, ఆవేశపడకండి. ఇది మనుషులు చేసిన పని అయితే తప్పకుండా ఆ హంతకులు దొరికే వారు. కాని ఒక పాము శంకర్రావుగారిని చంపింది. దీంట్లో మేం ఏమీ చేయలేం" అన్నాడు ఇన్స్పెక్టర్ శశికాంత్.

ఇన్స్పెక్టర్ శశికాంత్, పరిశోధనరావు బృందం వచ్చేసరికే శంకర్రావ్ ఇల్లంతా కోలాహలంగా వుంది.

బయట పోలీసులు వున్నారు. పట్టపగలు శంకర్రావ్ యేదో నవల చదువుతూ మంచంమీద పడుకున్నాడు.

అంతకు పావుగంటముందే, అప్పటిదాకా పురుషోత్తం శంకర్రావుతో మాట్లాడుతూనే గడిపాడు. పురుషోత్తం బయటకి వచ్చిన కాసేపటికే యేదో విష జంతువు శంకర్రావును పొట్టన పెట్టుకుంది.

శంకర్రావ్ కాలిమీద పాముకాటు గుర్తులు స్పష్టంగా కనిపిస్తున్నాయి. పాము మాత్రం ఆ పరిసరాల్లో ఎక్కడా కనిపించలేదు. నోట్లో నురగతో వున్న శంకర్రావుని చూసి, శంకర్రావ్ భార్య పెద్దగా కేక పెట్టింది. కాపలాగా వున్న పోలీసులు వచ్చి చూసేసరికే శంకర్రావ్ చనిపోయి వున్నాడు.

శంకర్రావ్ శవాన్ని ఆస్పత్రికి తరలించేశారు.

"మొన్న జగదీష్, ఈ రోజు శంకర్రావ్. రేపెవరు? ఇలా ఆ హంతకులకి ఆహారంగా మారవలసిందేనా మేము. ఇంతమంది పోలీసులున్నారు. ఏం లాభం?" అన్నాడు చిరంజీవి.

అతనికి చాలా బాధగా వుంది. తమ ప్రాణ స్నేహితులిద్దరు చనిపోవటంతో అతనికి కూడా తెలియని భయం పట్టుకుంది.

"ఒక హత్య నాకు తెలియకుండా జరిగిపోయింది. ఒక హత్య నాకు తెలిసి, అనుకోకుండా జరిగిపోయింది. అయినా మీరు కూడా యేదో దాస్తున్నారు. అసలు మీ నలుగురికీ కలిసి యెవరో విరోధి ఉండివుంటాడు. అతన్ని గురించి మీరు పూర్తి వివరాలు చెబితే మేం సాధ్యమైనంత త్వరలో అతన్ని పట్టుకోగలం" అన్నాడు శశికాంత్.

"మాకెవరు విరోధులు లేరు, అంటే నమ్మరేం! మాకు తెలిసి ఎవరూ లేరు. తెలియకుండా మామీద విరోధం పెంచుకొని యెవడన్నా ఉండివుంటాడు" అన్నాడు పురుషోత్తం.

"ఆల్ రైట్. మీరిక మీ ఇళ్ళకి వెళ్ళండి. నేను మీ ఇద్దరి ఇళ్ళకీ వచ్చి తగువిధంగా పోలీసు రక్షణ కల్పిస్తాను" అని చెప్పాడు ఇన్ స్పెక్టర్ శశికాంత్.

జీవచ్ఛవాల్లా అక్కడనుంచి బయలుదేరారు మిగిలివున్న దుష్టద్వయం పురుషోత్తం, చిరంజీవులు.

"అయితే మేం చేసేదేం వుంది. మేం వెళ్ళిపోతాం" అని ఇన్ స్పెక్టర్ శశికాంత్ తో చెప్పి బయటకి వచ్చాడు పరిశోధనరావు. ప రి శో ధ న రా వు ని అనుసరించారు ఓంకారం, శ్రీకారం.

డిటెక్టివ్ లు ముగ్గురూ నడుచుకుంటూ తమ రూమ్ వైపు బయలుదేరారు.

ముగ్గురూ రూమ్ కి వెళ్ళేసరికి అక్కడ మెట్లమీద వెంకట్ కూర్చొని ఉన్నాడు.

ఓంకారం తాళంతీసి రూమ్ లోకి నడిచాడు. మిగిలిన వాళ్ళందరూ అతన్ని అనుసరించారు.

"అయితే ఈ విషయం మీకుకూడా తెలిసిందన్న

మాట" అన్నాడు పరిశోధనరావు రూమ్‌లో కూర్చున్న తరువాత.

"ఇందాక లాడ్జిలోంచి బయటకి వచ్చి 'శ్రీదేవి' హోటల్లో భోజనం చేద్దామని వెడుతుంటే యెవరో అన్నారు, శంకర్రావ్ గారు పాముకాటుకి గురి అయ్యారని. నేను నమ్మలేదు. భోంచేసి తిరిగి వస్తుంటే కిళ్ళీకొట్టు దగ్గర ఎవరో మాట్లాడుకుంటున్నారు 'శంకర్రావ్ గారు పోయారని'. వెంటనే ఆదరాబాదరాగా ఇక్కడికి పరిగెత్తుకొని వచ్చాను" అన్నాడు వెంకట్.

"మేం ఇన్‌స్పెక్టర్ శశికాంత్‌ని కలుసుకుందామని పోలీసుస్టేషన్‌కి వెళ్ళాం. అక్కడ ఉండగానే ఫోన్ వచ్చింది. అక్కడనుంచి అటే వెళ్ళాం. మేం వెళ్ళేసరికి శంకర్రావ్ చనిపోయి వున్నాడు" అన్నాడు పరిశోధనరావు వివరిస్తూ. తర్వాత శంకర్రావ్‌కు వచ్చిన బెదిరింపు ఉత్తరం విషయం చెప్పగా, అది తాను వ్రాయలేదని చెప్పాడు వెంకట్.

"ఇంతకీ ఎలా పోయాడు. పాము కాటువల్లనేనా?" అని ప్రశ్నించాడు వెంకట్.

"ఆ! పాము కాటువల్లనే. అప్పటికప్పుడే చనిపోయాడు. కాలిమీద పాముకాటు గుర్తులున్నాయి" అన్నాడు శ్రీకారం.

"ఇది యెవరో కావాలని చేస్తున్నారో, కాకతాళీయంగా జరుగుతున్నాయో తెలియటంలేదు" అన్నాడు వెంకట్.

"ఎవరు చేసినా, వాటికవే జరిగినా అనుమానం మాత్రం మీమీద తప్పకుండా వస్తుంది. ఆ ఇన్‌స్పెక్టర్ శశికాంత్ అసలే సామాన్యుడు కాదు. పైగా మీరు

జగదీష్‌కి వ్రాసిన బెదిరింపు ఈ తరం ఇప్పుడు ఇన్‌స్పెక్టర్ శశికాంత్ దగ్గర వుంది. మనం ఇప్పుడు ఏమాత్రం రాంగ్ స్టెప్ వేసినా మిమ్మల్ని ఇరికించేస్తాడా ఇన్‌స్పెక్టర్" అన్నాడు పరిశోధనరావు.

"నన్ను ఇరికించినా పరవాలేదు. ఎందుకంటే ఆ నలుగుర్నీ చంపి జైలుకెడదామనుకొన్నాను మొదట్లో. కాని ఇప్పుడు వాళ్ళని చంపకుండా వాళ్ళ చావుకి నేను జైలుకెళ్ళవలసివస్తే, మిగిలిన ఆ ఇద్దఱు హంతకులనైనా చట్టానికి అప్పగించండి" అన్నాడు వెంకట్.

"పురుషోత్తాన్ని, చిరంజీవిని చట్టానికి అప్పగించటమే కాదు. ఆ శంకర్రావ్‌ని, జగదీష్‌ని చంపిందెవరో కూడా తెలుసుకొని వాళ్ళని కూడా చట్టానికి అప్పగించేవరకు విశ్రమించను" అన్నాడు పరిశోధనరావు గంభీరంగా.

"మరి నేను వెళ్తొస్తా. ఈ విషయం కనుక్కుందామనే వచ్చాను" అని చెప్పి బయటకి నడిచాడు వెంకట్.

"బాసు! ఈ వెంకట్ వరస చూస్తుంటే నాకేదో అనుమానంగా వుంది. తనకి నలుగురు శత్రువులు ఉన్నారని చెప్పాడు. వాళ్ళు చావటానికి ముందు ఒకసారి, చచ్చాక ఒకసారి మనల్ని కలుసుకొంటున్నాడు. ఇలా మనల్ని ఎనిమిదిసార్లు కలుసుకొని, ఈ లోపున తన కార్యక్రమం ముగించుకొని జండా యెత్తేస్తాడేమో, అని నా అనుమానం" అన్నాడు ఓంకారం.

"అవును బాసు! నాకూ అదే అనుమానంగా వుంది. అసలు మనం వాడి మీద ఒక కన్ను వేసి ఉంచితే మంచిదని నా అభిప్రాయం" అన్నాడు శ్రీకారం.

"నిజంగా వాడే హంతకుడయితే, వాడు యెక్కడికి పోతాడు. వాడంతటవాడే మనకి చిక్కుతాడు. కాని

ఈ రెండు చావుల్లోనూ వాడి హస్తం వుందనుకోవటం లేదు. మొత్తానికి వాడిలో ఏదో గూడుపుఠాని వుంది" అని ఆలోచనలో పడ్డాడు పరిశోధనరావు.

పరిశోధనరావు ఆలోచనలో వుండగా ఓంకారం, శ్రీకారంలు చిన్నగా బయటకి జారుకున్నారు.

# 8

"రండి! ఏమిటి ఒక్కరే వచ్చారు. ఎప్పుడూ ముగ్గురూ కలసి వచ్చేవారుగా" అని అడిగాడు పరిశోధనరావుని ఒక్కడ్నే చూసిన ఇన్‌స్పెక్టర్ శశికాంత్.

"ఓం, శ్రీ యొక్కడికో నాకు చెప్పకుండా వెళ్లారు. సరె ఆ కేసు గురించి ఇంకా యేమన్నా విశేషాలు తెలిసాయేమో, కనుక్కుందామని వచ్చాను" అన్నాడు పరిశోధనరావు సీట్లో కూర్చుంటూ.

"ఎక్కడ వేసిన గొంగళి అక్కడే వున్నట్టుంది. ఏమాత్రం ముందుకి సాగటంలేదు" అన్నాడు శశికాంత్ నిరాశగా.

"మళ్ళీ ఆ ఇద్దరిలో యెవరికో ఒకరికి బెదిరింపు ఉత్తరం వచ్చేదాకా మనం ఏమీ చేయలేం" అన్నాడు పరిశోధనరావు.

"అసలు నన్నడుగుతే ఆ నలుగురిలోనే వుంది మిష్టరీ. వాళ్ళు నలుగురూ కాని, వాళ్ళ నలుగురిలో ఏ ఒక్కడో గని యేదో వెధవ పని చేశాడు. యేదో కుటుంబాన్ని నాశనం చేశారు. దాంతో వాళ్ళు తాలూకు వాళ్ళెవరో పగపట్టారు. ఆ బ్యాక్‌గ్రౌండ్ స్టోరీ చెప్పరు. ఇక మనం ఎలా తెలుసుకుంటాం" అన్నాడు ఇన్‌స్పెక్టర్ శశికాంత్.

"శంకర్రావ్ గురించి ఏమన్నా తెలిసిందా. ఆ పాము కాటువల్లే చనిపోయాడా?" అని అడిగాడు పరిశోధన

రావు.

"ఆ! నిక్షేపంగా. పాము కాలిమీద కాటువేసింది. విషం వెంటనే శరీరం అంతా పాకిపోయింది. చాలా దారుణంగా చచ్చిపోయాడు" అన్నాడు ఇన్‌స్పెక్టర్ శశికాంత్.

"సార్! ఇన్‌స్పెక్టర్ గారూ!" అంటూ పరిగెత్తుకుంటూ వచ్చాడు చిరంజీవి. ఆ వెనకనే లోపలికి వచ్చాడు పురుషోత్తం.

"ఏం! మళ్ళీ ఏమయింది?" అని విసుగ్గా ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్ శశికాంత్.

"ఏం అవుతుంది. ఏం అవకూడదో, అదే అయింది. నాకు కూడా వచ్చింది ఆ చావు నోటీసు" అని జేబులోంచి ఆ ఉత్తరాన్ని తీసి ఇన్‌స్పెక్టర్ శశికాంత్‌కి ఇచ్చాడు చిరంజీవి.

ఇన్‌స్పెక్టర్ శశికాంత్ ఆ ఉత్తరాన్ని చదివి, పరిశోధనరావుకి ఇచ్చాడు.

అందులో—

"ఒరే చిరంజీవి!

ఆడితప్పటం మా వంశాచారం కాదు. ఇప్పుడు నీ పాపం పండింది. వారం రోజులు గడువు. ఈ వారం రోజులూ నీ ఇష్టదైవాన్ని ప్రార్థించుకో. నీ చావు తప్పదు. చేసిన పాపాలకి మా కుటుంబం తరఫున నేవేసే శిక్ష అందుకో. ఏ పోలీసులూ నిన్ను రక్షించలేరు....

ఇట్లు,

హంతకులకు హంతకుడు."

అని వుంది.

పరిశోధనరావు ఆ చావు హెచ్చరిక ఉత్తరాన్ని

ఇన్‌స్పెక్టర్ శశికాంత్‌కి అందిచ్చాడు.

ఇన్‌స్పెక్టర్ శశికాంత్ ఇదివరకు తన దగ్గర వున్న ఉత్తరాలోటి పోల్చిచూసి, "శంకర్రావుగారికి, చిరంజీవి గారికి వ్రాసిన ఉత్తరాలలోని దస్తూరి ఒకటే. కాని జగదీష్‌గారికి వ్రాసిన ఉత్తరంలోని దస్తూరి మాత్రం వేరొకటి. ఈ మిష్టరీ నాకు బోధపడటంలేదు. సాధారణంగా హంతకుడు ఒకడే అయినప్పుడు, రెండు వేరు వేరు దస్తూరీలు రావటం విచిత్రంగా వుంది" అన్నాడు చిరంజీవి వంక జాలిగా చూసి, పురుషోత్తంతో.

"హంతకుడు ఒకడు కానీయండి. యాభైమంది కానివ్వండి. నాకు అనవసరం. నన్నయినా బ్రతకమంటూరా, ఆ హంతకులకి బలికామంటూరా. చెప్పండి" అన్నాడు చిరంజీవి కోపంగా.

"ఆవేశపడకండి, చిరంజీవిగారూ, ప్రయత్నిస్తూనే వున్నాం కదా, ఆ హంతకుడి కోసం" అన్నాడు ఇన్‌స్పెక్టర్ శశికాంత్.

"ఏం ప్రయత్నిస్తున్నారండి, నా బొంద. జగదీష్‌కి ఆ ఉత్తరం వచ్చినప్పుడు, మేం నిర్లక్ష్యం చేశాం. చంపేశాడు. దాంతో భయపడి మేం, శంకర్రావుకి ఉత్తరం రాగానే మీ దగ్గరకి వచ్చాం. కాని ప్రయోజనం లేకపోయింది. శంకర్రావ్ చనిపోయాడు. ఇప్పుడు నాకు ఆ ఉత్తరం వచ్చింది. మీరింకా ప్రయత్నిస్తునే వున్నారు. వాడు రేపు నన్నూ చంపుతాడు. అప్పటికి మీరింకా ప్రయత్నిస్తునే వుంటారు. ఎల్లుండి పురుషోత్తానికి ఆ ఉత్తరం వస్తుంది. మీ ప్రయత్నాలు కొనసాగుతూనే వుంటాయి. ఆ తరువాత పురుషోత్తం చనిపోతాడు. దాంతో మీరు కేసు క్లోజ్ చేస్తారు. అంతేనా ఇన్

స్పెక్టర్?" అని ప్రశ్నించాడు చిరంజీవి ఆవేశంగా.

ఇన్ స్పెక్టర్ శశికాంత్ ఏమీ చెప్పలేక నీళ్ళు నమల సాగాడు.

"అది కాదు ఇన్ స్పెక్టర్ గారూ! మా బాధ అర్థం చేసుకోండి. చిరంజీవినైనా కాపాడండి ఇన్ స్పెక్టర్. మిమ్మల్ని నేనింకేమీ కోరను" అన్నాడు పురుషోత్తం దీనంగా.

"పురుషోత్తంగారూ! బాధ పడకండి. ఇన్ స్పెక్టర్ గారు చాలా గట్టిగా ప్రయత్నిస్తున్నారు ఆ హంతకుడి కోసం. వారితో పాటు నేను కూడా ఆ హంతకుడి వేట కొనసాగిస్తున్నాను" అన్నాడు పరిశోధనరావు తీవ్రంగా.

చిరంజీవి, పరిశోధనరావువంక నిర్లిప్తంగా చూశాడు.

"ఆ! అన్నట్టు మరచిపోయాను. మీ అమ్మాయి పేరు లక్ష్మి కదా" అన్నాడు ఇన్ స్పెక్టర్ శశికాంత్, పురుషోత్తంవంక చూస్తూ.

"ఆ! అవును. దానికి, ఇప్పుడు చిరంజీవికి బెదిరింపు ఉత్తరం రావటానికి సంబంధమేమిటి?" అన్నాడు పురుషోత్తం.

"అబ్బే. ఇది వేరే కేసు. ఇందాక పతంజలిగారు వచ్చారు. ఆయన యిక్కడ యేదో కొట్లో గుమాస్తాగా పనిచేస్తున్నారట. వారి అబ్బాయి పేరు ఆనంద్. ఆ ఆనంద్ మీ అమ్మాయి లక్ష్మిని ప్రేమిస్తున్నాడట. 'పెద్దవారితో సంబంధం మనకెందుకురా' అంటే ఆనంద్ వినలేదట. అతను మొన్న మీ అమ్మాయి లక్ష్మిని కలుసుకోవటానికి పార్కుకి వెళ్ళాడట. అప్పటినుంచీ ఆనంద్ కనపట్టంలేదని, పతంజలిగారు నాకు రిపోర్టు యిచ్చారు. అందుకని అడిగాను" అన్నాడు ఇన్ స్పెక్టర్ శశికాంత్.

"చూడండి ఇన్‌స్పెక్టర్ గారూ! మా అమ్మాయి లక్ష్మి గురించి నాకు బాగా తెలుసు. ఆనంద్‌లాంటి లోఫర్ గాళ్ళని మా అమ్మాయి ప్రేమించదు. మీరు అనవసర మైన అపోహాలు పెట్టుకోకండి. యిక పోతే మీరు శాయశక్తులా ప్రయత్నించి, మా చిరంజీవి ప్రాణాలు కాపాడటానికి చూడండి" అని చెప్పి కోపంగా బయటకి నడిచాడు పురుషోత్తం.

"సార్! ఇన్‌స్పెక్టర్ గారూ, మీరు యెలా అయినా ప్రయత్నించి ఆ హంతకుడ్ని పట్టుకోండి సార్. వాడు నన్ను చంపకపోయినా, ఆ భయంలోనే ప్రాణాలు విడుస్తానేమో కూడా తెలియటంలేదు" అన్నాడు చిరంజీవి.

"మీరేం దిగులు పడకండి. మీ ప్రాణాలు కాపాడే బాధ్యత నాది. ఇప్పుడే మీ ఇంటికి పోలీసు బందోబస్తు పంపిస్తాను" అన్నాడు యిన్‌స్పెక్టర్ శశికాంత్.

ఇన్‌స్పెక్టర్ శశికాంత్‌కి చెప్పి పరిశోధనరావు కూడా బయటికి నడిచాడు.

చిరంజీవి యింటికి పోలీసులని పంపే యేర్పాట్లలో మునిగిపోయాడు యిన్‌స్పెక్టర్ శశికాంత్.

## 9

దట్టంగా పరుచుకున్న చీకట్లలోంచి దూరంగా కన పడుతున్న వెలుగువైపు చూశాడు వెంకట్.

ఆ వెలుగు పురుషోత్తంగాడి కొంపలోంచి వస్తోందని పసిగట్టాడు వెంకట్.

"ఇంత అర్ధ రాత్రివేళ, ఈ పురుషోత్తంచేసే రాచ కార్యాలు ఏమున్నాయి. ఒకవేళ ఏమన్నా చేస్తున్నా డంటే అది తప్పకుండా చట్ట వ్యతిరేకమయిన పనే

అయి వుంటుంది. ఇప్పుడే వెళ్ళి సాధ్యమయితే సాక్ష్యాలతో సహా పట్టుకోవాలి" అని నిశ్చయించుకొని ముందుకి అడుగు వేశాడు వెంకట్.

పురుషోత్తం యింటి ముందు యిద్దరు వాచ్‌మన్‌లు గేటుకి అటు ఒకడు యిటు ఒకడు నిలబడి చాలా సీరియస్‌గా ఆ భవంతిని కాపలా కాసేస్తున్నారు.

సరే, వెనకవైపు నుంచి 'ట్రై' చేద్దామని ఆ భవంతికి వెనకవైపుకి బయలుదేరాడు వెంకట్.

వెనకాల చాలా చీకటిగా వుంది. చెట్లు, పుట్టలు విరివిగా వున్నాయి వెనకవైపున. ఒక చిన్న సైజు అడవిలా వుంది.

ప్రహరీ గోడ చాలా ఎత్తుగా వుంది. గోడ పట్టుకొని యెక్కటం చాలా కష్టమయిన పని అని గ్రహించాడు వెంకట్.

అటూ, ఇటూ చూస్తుంటే గోడకి పక్కనే వున్న ఒక, చెట్టు కనిపించింది. వెంటనే ఆ చెట్టుని యెక్కి, నెమ్మదిగా గోడమీద కాలుపెట్టాడు వెంకట్. అతని కాలు, ఆ గోడమీద కాపడం చేసిన గాజుపెంకులమీద పడింది. అతని కాలికి బూట్లు వుండటంవలన కాలికి ఏమీ కాలేదు కాని, గాజు పెంకులు విరగటంతో బేలన్స్ తప్పి, పురుషోత్తం పెరట్లోకి పడ్డాడు వెంకట్.

అతని నడుం పట్టేసింది. లేచి నెమ్మదిగా నడుము సవరించుకొని, భవంతి దగ్గరకి చేరుకున్నాడు వెంకట్.

వెంకట్ లోపలికి దూకాక రెండు ఆకారాలు గోడ మీద గుసగుసలు ఆడుకున్నాయి. ఆ రెండు ఆకారాలు వెంకట్‌ని అనుసరించే అప్పటిదాకా వచ్చాయి. యేదో నిశ్చయించుకున్న ఆ ఆకారాలు నెమ్మదిగా గోడమీద

నుంచి మాకి కిందకు చేరుకున్నాయి. ఆ తరువాత ఆ ఆకారాలు భవంతి దగ్గరకి చేరుకున్నాయి.

పైకప్పులో లైట్లు వెలగటం మానిన వెంకట్ పైపు ద్వారా పైన వున్న బాల్కనీ దగ్గరకి చేరాడు. ఆ బాల్కనీలోంచి ఒక గది దగ్గరకి వెళ్ళేసరికి యేవో మాటలు వినపడి ఆగాడు.

వెంకట్ పైకి వెళ్ళిన వెనకనే అదే పైపుద్వారా ఆ ఆకారాలు కూడా నెమ్మదిగా ఒకదాని వెనక మరొకటి బాల్కనీలో ప్రవేశించాయి. ఆ ఆకారాలకి దూరంగా వెంకట్ కనిపించాడు.

"మిష్టర్ ఆనంద్! ఇప్పటిదాకా మర్యాదగా చెప్పి చూశా. నువ్వు వినలేదు. నా గురించి నీకు తెలియదు. మహా మహా కోటీశ్వరులే వాళ్ళ వాళ్ళ అబ్బాయిల్ని నా కూతురికి యివ్వటానికి ముందుకి వస్తున్నారు. అలాంటిది, ఒక గుమస్తాగాడి కొడుకువి. ఈడ్చి తంతే చిల్లియేగాణి ఆసి లేనివాడివి, నీకు నా కూతుర్ని యెలా యిస్తానని అనుకొన్నావు. మర్యాదగా నా కూతుర్ని ప్రేమించటం మానేసి బుద్ధిగా నడుచుకో. నీ ప్రాణాలు కాపాడుకో!" అన్నాడు పురుషోత్తం కోపంగా.

"ప్రేమించటం, ప్రాణాలకి భయపడి మానేయటానికి కాదు. అయినా ముందు మీ అమ్మాయిని నేను ప్రేమించ లేదు. మీ అమ్మాయే నన్ను ప్రేమించింది. కావాలంటే మీ అమ్మాయిని పిలిపించి అడగండి. నిజం తెలుస్తుంది" అన్నాడు ఆనంద్.

"నిజాలు నాకు తెలియవలసిన పనిలేదు. అది చిన్న పిల్ల. తెలియక ప్రేమించిందనుకో, నువ్వు ప్రేమించేయట మేనా?" అన్నాడు పురుషోత్తం కోపంగా.

ఆనంద్ కట్లు విడిపించుకోవాలని ప్రయత్నించ
సాగాడు.

బయటనుంచి వింటున్న వెంకట్ శరీరంలోని రక్తం సలసల మరగసాగింది. పురుషోత్తంమీద ఉధృతమైన కోపం వచ్చింది.

'నా కుటుంబంలా, మరొక కుటుంబం ఈ పురుషోత్తంగాడి దుర్మార్గాలకి బలి అవ్వకూడదు' అని ఆలోచించి వెనకా ముందు ఆలోచించకుండా ఆ గదిలోకి ఉరికాడు వెంకట్.

ఆకస్మాత్తుగా గదిలోకి వచ్చిన ఆ ఆగంతకుని వంక ఆశ్చర్యంగా చూశారు ఆ గదిలోని వారంతా.

"మిష్టర్, పురుషోత్తం! నీ ఆటలు యిక సాగవు. అమాయకుల్ని చంపి, వారి జీవితాలతో ఆటలు ఆడుకొనే నీకు బుద్ధి చెప్పే సమయం వచ్చింది" అంటూ పురుషోత్తం మీదకి దూకాడు వెంకట్. వెంటనే పురుషోత్తం పక్కకి తప్పుకున్నాడు.

ఆ గదిలో వున్న పురుషోత్తం తాలూకు మనుషు లందరూ పురుషోత్తం కనుసన్న చేయగానే వెంకట్ మీదికి దూకారు.

నిరాయుధుడైన వెంకట్‌ని క్షణంలో బంధించి తాళ్ళతో కట్టి పడేశారు ఆ కిరాయి గుండాలు.

"ఒరే! వీడు యిక్కడికి ఒక్కడే వచ్చాడో బయట యెవరన్నా వున్నారో చూడండి. నేను వెళ్ళి మిగిలిన ఆ కాస్త పని పూర్తి చేసుకొని వస్తాను" అని ఆ కిరాయి గుండాలకి చెప్పి, వెంకట్ వంక, ఆనంద్ వంకా ఒకసారి చూసి బయటకి నడిచాడు పురుషోత్తం.

ఆ ఆకారాల గుండెల్లో రాళ్ళుపడ్డాయి. కాసేపు

అక్కడే వుంటే పురుషోత్తం తాలూకు మనుషులు వచ్చి తమకి ఘనంగా సన్మానం చేస్తారని భయపడి, దాక్కుందామని అటూ, యిటూ చూశాయి. ఆ ప్రదేశంలో అప్పటికప్పుడు దాక్కోటానికి యే చోటూ కనపడ లేదు ఆ ఆకారాలకి.

వెంటనే పక్కనే వున్న గదిలో తలుపు తీసుకొని చటుక్కున లోపలికి ప్రవేశించి, తలుపు గడియ వేశాయి.

"ఎవరు మీరు?" అని భయంగా ప్రశ్నించింది ఏదో పుస్తకం చదువుకుంటున్న లక్ష్మి.

"మీరేం ఖంగారు పడకండి. నా పేరు ఓంకారం, యితని పేరు శ్రీకారం. మేం ప్రఖ్యాత డిటెక్టివ్ పరిశోధనరావుగారి అసిస్టెంట్లం" అన్నాడు ఓంకారం, తమని పరిచయం చేసుకుంటూ.

"అయితే మాత్రం, ఇలా గదిలోకి వచ్చేయటమేనా! అసలు బయట వున్న కాపలా మనుష్యుల్ని దాటుకొని యెలా వచ్చారు మీరు?" అని ఆశ్చర్యంగా ప్రశ్నించింది లక్ష్మి.

"మాకిలా రావటం మామూలేగాని, బయట అంత గొడవ జరుగుతున్నా మీకు వినపడటంలేదా?" అని ప్రశ్నించాడు శ్రీకారం.

"ఇది సౌండు ప్రూఫ్ గది. బయట వారి మాటలు వినపడవు. అది సరే, మీరు వచ్చిన పనేమిటి?" అని ప్రశ్నించింది లక్ష్మి.

"మీరు అతి గాఢంగా ప్రేమించిన ప్రియుడు, త్వరలో అతన్నే వివాహం చేసుకోవాలని మీరు అనుకుంటున్న ఆనంద్‌ని, మీ నాన్నగారు బంధించి, పక్క

గదిలో పడేశారు. అతన్ని విడిపించుకొని వెడదామని మేం వచ్చాం!" అని అబద్ధమాడాడు ఓంకారం.

"ఆ! ఆనంద్ ని యిక్కడ బంధించారా! ఎందుకు?" అని ఆశ్చర్యంతో కూడిన భయంతో ప్రశ్నించింది లక్ష్మి.

"ఎందుకేమిటి! మిమ్మల్ని ప్రేమించిన నేరానికి. ఆస్తిలో మీ కాలి గోటికికూడా రాని ఆనంద్ ని తనకి అల్లుడిగా చేసుకోవటం యిష్టంలేక మీ నాన్నగారు అతన్ని బంధించి నయానా, భయానా నచ్చచెప్పటానికి చూశారు. మేం అతన్ని విడిపించటానికి చూశాం. మీ కిరాయి గుండాలు మా వెనకపడ్డారు. మేం ఈ గదిలోకి వచ్చి పడ్డాం. వాళ్ళు యిప్పుడు మీ గదిలోకి వచ్చి మమ్మల్ని గురించి అడగొచ్చు" అన్నాడు శ్రీకారం.

ఇంతలో తలుపు చప్పుడయింది. వెంటనే ఓంకారం, శ్రీకారంలు మంచం కిందకి దూరారు.

లక్ష్మి వెళ్ళి తలుపు తీసింది.

"మేడమ్! ఈ గదిలోకి ఎవరైనా వచ్చారా?" అని ప్రశ్నించాడు ఒకడు లోపలికి వచ్చి.

"ఎవరూ రాలేదు" అని బదులిచ్చింది లక్ష్మి.

గదినంతా ఒకమారు కలయచూసి వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడు ఆ ఆగంతకుడు. కాస్సేపు ఆగి ఓంకారం, శ్రీకారం బయటకు వచ్చారు.

"లక్ష్మిగారూ! మేం ఇప్పుడు అర్జంటుగా ఒకచోటుకి వెళ్ళాలి. మీ పక్క గదిలో మీ ఆనంద్, మరొకతను బంధించబడి వున్నారు. మీరు వాళ్ళ ప్రాణాలకి ప్రమాదం రాకుండా చూసుకోండి" అని చెప్పి నెమ్మదిగా గది బయటకి వచ్చాడు ఓంకారం. అతన్ని అనుసరించాడు

శ్రీకారం.

తమకోసం వెతుకుతున్న ఆ కిరాయి గుండాలకి కన పడకుండా ఓంకారం, శ్రీకారంలు చీకట్లో కలసిపోయి, తమ భవనాన్ని దాటటం చూసి తృప్తిగా నిట్టూర్చి, ఆనంద్ ని బంధించిన గదివైపు నడిచింది లక్ష్మి.

# 10

"ఆ రేమిటి? ఇంత అర్థరాత్రిపూట వచ్చావు" అని సందేహంగా అడిగాడు చిరంజీవి.

"కొన్ని కొన్ని పనులకి అర్థరాత్రుళ్లే మంచివి. నీలాంటి ప్రాణస్నేహితుల ప్రాణాలు తీయటానికి కూడా అర్థ రాత్రుళ్లే మంచివి" అని వికటంగా నవ్వాడు పురుషోత్తం. అతని చేతిలో కత్తి తళతళ మెరుస్తోంది.

"నా ప్రాణాలా! ఎందుకు? అయినా ఆ బెదిరింపు ఉత్తరాల్లోనే చస్తుంటే పైగా నీ జోక్ లొకటా!" అన్నాడు చిరంజీవి, అతని కత్తిని ఆశ్చర్యంగా చూస్తూ.

"నావి జోక్ లు కావు. పచ్చి నిజాలు. ఆ జగదీష్ గాడికి యెవడో బెదిరింపు ఉత్తరం వ్రాయగానే నాకు ఒక ఆలోచన వచ్చింది. మిమ్మల్ని నేనే యెందుకు చంప కూడదూ అని. మీరు చస్తే మొత్తం మన నలుగురి పేరుతో ఉన్న వ్యాపారాలన్నీ నా స్వంతం అవుతాయి. నేను కుబేరుణ్ని అవుతాను. అందుకే కారుకు బ్రేకులు తీసేశాను. సహజంగా రాష్ గా డ్రైవ్ చేసే జగదీష్ బ్రేకులు లేకపోవటంతో లారీని గుద్దేసి దారుణంగా చని పోయాడు. ఆ వెంటనే శంకర్రావ్ గాడికి లెటర్ వ్రాశాను,

శంకర్రావ్‌ని పరామర్శించటానికి వెళ్ళినట్టు వెళ్ళి నేను తీసుకువెళ్ళిన చేతి సంచీలోని పాముద్వారా, శంకర్రావ్‌ని పరలోకానికి పంపి, నేను తప్పుకున్నాను.

ఇక నీ వంతు. నీకు బెదిరింపు ఉత్తరం వ్రాశాను. నిన్ను మట్టుపెడదామని వచ్చాను" అన్నాడు పురుషోత్తం.

వింటున్న చిరంజీవికి చెమట్లు పోయసాగాయి.

"మరి....మరి బయట పోలీసులున్నారు. వాళ్ళు నిన్ను పారిపోనివ్వరు. నిన్నుకూడా ఉరితీసేస్తారు" అని గొంతు పెకలించుకొని చెప్పాడు చిరంజీవి.

"అందుకనే పోలీసు రిపోర్టు ఇవ్వవద్దని అన్నాను. మీరు వినలేదు. అయినా మునిగిపోయింది ఏమీలేదు. నిన్ను నోరు మూసి, ఈ కత్తితో పరలోకానికి పంపి, ఆ కత్తిమీద వేలిముద్రలు తుడిచేస్తాను. ఇక ఈ కత్తి అంటావా, ఇది వెంకట్‌గాడిది. వెంకట్ ఎవరో నీకు తెలియదు కదూ! సూర్యనారాయణ కొడుకు. వాడి కుటుంబాన్ని మనం నలుగురం సర్వనాశనం చేశామని తెలిసి, మనమీద పగపట్టాడు. అసలు వాడే జగదీష్‌కి లెటర్ వ్రాశాడు. వాడిప్పుడు నా దగ్గర బందీగా వున్నాడు. వాడే ఈ మూడు హత్యలూ చేశాడని చెప్పి, నన్నుకూడా చంపటానికి వచ్చాడని, నేర్పుగా బంధించానని చెబుతాను. దాంతో సూర్యనారాయణ కుటుంబం అంతా ఫినిష్. మీ ముగ్గురూ ఫినిష్. ఈ ఆస్తంతా నాకే చెందుతుంది. బాగుంది కదూ నా ప్లాను" అన్నాడు పురుషోత్తం వికటంగా నవ్వుతూ.

చిరంజీవి లేని ఓపిక తెచ్చుకొని అరుద్దామని నోరు తెరవబోయాడు, ఆ సంగతి పసిగట్టి చప్పున చిరంజీవి

పోరుమూసి, కత్తి పైకెత్తాడు పురుషోత్తం.

"మిష్టర్ పురుషనీచం. ఆపు నీ వ్యర్థ ప్రయత్నం" అన్న అరుపు వినపడి తలెత్తి చూశాడు పురుషోత్తం.

ఊచలులేని కిటికీగుండా లోపలికి వచ్చాడు పరిశోధనరావు. అతని చేతిలో రివాల్వర్ వుంది.

"అన్యాయంగానో, అక్రమంగానో నీ స్నేహితుల ద్వారా యింత ఆస్తి సంపాదించావు. ఇప్పుడు అవసరం తీరిపోయింది కదా అని హరిని చంపుతావా. నిన్ను పోలీసులకి పట్టించటానికే యిందాకట్నించి ఆ కిటికీ దగ్గర కాపువేసి వున్నది" అని చెప్పి కొంచెం ముందుకి వచ్చాడు పరిశోధనరావు.

అదే అదనుగా భావించి, ఛెంగున లేచి పరిశోధనరావు చేతిలోని రివాల్వర్‌ని తన్నేశాడు పురుషోత్తం. వెంటనే ఊచలులేని కిటికీగుండా బయటపడదామని కిటికీ ఎక్కాడు పురుషోత్తం.

ఐతే, యెంత వేగంగా కిటికీ యెక్కాడో అంతే వేగంగా లోపలికి వచ్చి పడ్డాడు పురుషోత్తం. అతని చేతిలోని కత్తి క్రింద పడిపోయింది.

"నాయనా, నీలాంటి దుష్టుల్ని పుట్టించిన ఆ దేవుడే, మాలాంటి డిటెక్టివ్‌ల్ని కూడా పుట్టించాడు" అంటూ కిటికీలోంచి లోపలికి దూకాడు ఓంకారం. ఆ వెనకే శ్రీకారం దూకాడు.

ఆ గది తలుపుల్ని తోసుకొని బిలబిలమంటూ పోలీసులు ఆ గదిలోకి ప్రవేశించారు.

లోపలికి రావటంతోనే పురుషోత్తం దగ్గర నుంచి క్రిందపడిన కత్తిని, చిరంజీవి దగ్గర వున్న రివాల్వర్‌ని

స్వాధీనం చేసుకున్నాడు ఇన్స్పెక్టర్ శశికాంత్.

"మిస్టర్ పురుషోత్తం. నీ ఆటలు యిక సాగవు. మా కళ్ళల్లో కారంకొట్టి నీ ప్రాణ స్నేహితులయిన జగదీష్ని, శంకర్రావ్ని చంపావు. మాకు యేమాత్రం నీమీద అనుమానం కలగలేదు. ఇంటి దొంగని ఈశ్వరుడైనా పట్టలేడు. ఆస్తిలేని ఆనంద్ మీ అమ్మాయి లక్ష్మిని ప్రేమించాడని అతన్ని చంపటానికి కూడా వెనుకాడలేదు. ఇప్పుడు ఈ చిరంజీవిని కూడా చంపి, మొత్తం హత్యలన్నీ ఆ వెంకట్ మీద పెడదామనుకున్నావు. నీ పాపం పండింది. చిరంజీవి పేరు పెట్టుకున్నందుకు ఈ చిరంజీవి ప్రాణాలు నిలబడ్డాయి" అన్నాడు ఇన్స్పెక్టర్ శశికాంత్.

"ఏం నిలపడటం, దొంగనోట్ల నేరానికి, ఇంకా మిగిలిన పాపాలకి ఆ పురుషోత్తంతో పాటు, జైలుశిక్ష అనుభవించాలిగా ఈ చిరంజీవిగాడు" అన్నాడు శ్రీకారం కోపంగా.

ఇంతలో వెంకట్ని, ఆనంద్ని తీసుకొని యిద్దరు పోలీసులు లోపలికి ప్రవేశించారు.

"తన కుటుంబాన్ని సర్వనాశనం చేశారన్న కోపంతో జగదీష్కి బెదిరింపు ఉత్తరం వ్రాశాడు వెంకట్. అయితే ఆ తరువాత మిమ్మల్ని కలుసుకున్నాడు. అదే అవకాశంగా తీసుకొని జగదీష్ని, శంకర్రావ్ని చంపేశాడు పురుషోత్తం. చిరంజీవిని కూడా చంపటానికి వచ్చాడు. అందుకనే మొదటి వుత్తరానికి, మిగిలిన రెండు ఉత్తరాలకి దస్తూరిలో మార్పు వుంది. ఈ పురుషోత్తం 'హంతకులకి హంతకుడు' కాదు. హంతకులలో హంతకుడు" అన్నాడు పరిశోధనరావు.

# 43

"సన్మాన పత్రాలు, బహుమతులు ఇక్కడ ఎందుకు. పోలీసుస్టేషన్లో అయితే బావుంటుంది. నేను వాళ్ళని తీసుకొని వెడ్తాను. మీరు రేపు పోలీసుస్టేషన్ కి రండి. ఈ రాత్రికి విశ్రాంతి తీసుకోండి" అని చెప్పి చిరంజీవిని పురుషోత్తాన్ని తీసుకొని ఇన్ స్పెక్టర్ శశికాంత్ జీపు యెక్కి కూర్చున్నాడు. జీపు విజయగర్వంతో పోలీసు స్టేషన్ వైపు బయలుదేరింది.

—: అయిపోయింది :—

# విష వలయం

టెంపోరావ్

గోపాలం, సీత డైనింగ్ టేబుల్ దగ్గర కూర్చున్నారు.

ఆమె అతడి ప్లేట్లో పూరీలు వేసి, కాబేజి కూర వడ్డించింది.

"తినండి" అందామె నవ్వుతూ.

"నువ్వూ తిను!" అన్నాడతను.

"నేను తర్వాత మెల్లిగా తింటాను. మీరు తిని మరో ఊరు వెళ్ళాలి" అందామె.

"ఇద్దరం తింటూ మాట్లాడుకుందాం" అన్నాడతను.

ఆమెకూడా తినడం ప్రారంభించింది.

"ఈసారి ఫ్యాక్టరీలో చాలా పనుంది. నేను తిరిగి రాడానికి కనీసం వారం పడుతుంది."

"నన్నూ తీసుకెళ్ళండి!"

"ఫ్యాక్టరీ బిల్డింగ్స్ యిప్పుడే కడుతున్నారు. గెస్టు హౌస్ కట్టేసరికి సంవత్సరం దాటుతుంది. అటుపైనయితే నిన్ను తీసుకెళ్ళొచ్చు" అన్నాడతను.

"ఆ టౌన్‌లో హోటళ్ళు వుంటాయిగా?"

"అంత మంచి హోటళ్ళు లేవు. టౌన్‌కి ఆరు కిలో మీటర్ల దూరంలో మా ఫ్యాక్టరీ సైటుంది."

ఆమె తీయగా నవ్వింది.

"ఫ్యాక్టరీలో పనిచేసేవాళ్ళు యెక్కడ వుంటారు?"

"స్టాఫ్ క్వార్టర్సు కట్టిస్తున్నాం. అందరూ ఫాక్టరీ సమీపంలోనే వుంటారు."

"మద్రాసు వదిలి మనం కూడా అక్కడకు పోదాం" అంది సీత.

అతడామె నడుం చుట్టూ చెయ్యిని పోనిచ్చాడు. ఎర్రటి ఆమె పెదిమలను ముద్దెట్టుకున్నాడు.

"మీరు నన్ను తిన్నివ్వరు!" అందామె కళ్లు చిట్లిస్తూ.

అతడామె కళ్ళలోకి సూటిగా చూశాడు.

"నువ్వు తినడంలేదు. నీ కళ్ళు ఏదో కావాలంటున్నాయి. కావలసింది యిచ్చాను!" అన్నాడతను.

"మీరు అలా వూహించుకున్నారు" అందామె అతడిని వెక్కిరిస్తూ.

అతడు కాఫీ తాగేశాడు. కుర్చీలోంచి లేచాడు. యిద్దరూ పక్కనున్న పడగ్గదిలోకి నడిచారు. అతడు టైమ్ చూశాడు.

"మూడయింది" అన్నాడతను.

"మీ ట్రెయిన్‌కు చాలా టైముంది."

"ఒకసారి మా ఆఫీసుకు వెళ్ళాలి. మేనేజింగ్ డైరక్టర్‌తో మాట్లాడాలి. అక్కడ యెంత టైము పడ్తుందో తెలియదు. అక్కడనుంచి స్టేషన్‌కి వెళ్తాను."

"కాస్సేపు విశ్రాంతి తీసుకోండి. ఫరవాలేదు" అందామె.

"నువ్వే చెప్పింది కాదంటానా!" అని అతడు పరుపు మీద పడుకున్నాడు.

ఆమె హాల్లోనుంచి ముందు వరండా మీదకు వెళ్ళి చూసింది. జీవన్ మందార చెట్టుకింద రాలిన ఆకులను తుడుస్తున్నాడు.

"జీవన్, యెవరేనా వస్తే అయ్యగారు నిద్రపోతున్నారని చెప్పు" అని ఆమె లోపలకు నడిచి ముందు తలుపు మూసింది.

ఇరవై ఏళ్ళ వయస్సులో వున్న జీవన్ ఆమెవంక నవ్వుతూ చూసి, "అలాగేనమ్మా" అన్నాడు.

ఆమె పడగ్గదిలోకి నడిచింది. భర్త పక్కనే పడుకుంది. అతడిమీద చెయ్యేసి దగ్గరకు లాక్కుంది.

"మీరు లేకుండా నేనుండలేను!" అందామె.

అతడు యేదేనా చెప్పేలోపల ఆమె పెదిమలతో అతడి పెదిమలను కప్పేసింది.

ఇద్దరూ లోకాన్ని కొంతసేపు మర్చిపోయారు. అతడామెవైపు ప్రేమతో చూశాడు.

"మన పెళ్ళయి అప్పుడే పదేళ్ళు దాటిపోయింది! సంవత్సరాలు రేసు గుర్రాల్లా పరుగెడుతున్నాయి" అన్నాడతను.

పెళ్ళి సమయానికి సీత పద్దెనిమిదేళ్ళ యువతి. ఒక బస్టేండులో ఆమెతో అతడికి పరిచయమైంది. తర్వాత అతడు ఆమెను కలుసుకున్నాడు. ఆమెతో వెళ్ళి ఇంట్లోని పెద్దలతో మాట్లాడాడు. తనామెను పెళ్లాడ్తానని ఆమె తండ్రితో చెప్పాడు. తనకు పైసా కట్నం వద్దన్నాడు.

అటుపైన వాళ్ళ పెళ్ళి జరిగిపోయింది.

అతడు టైమ్ చూశాడు. మూడున్నర అయింది.

అతడు కిందకు దిగాడు.

"కంపెనీ కారు వస్తుంది" అన్నాడతను.

అతను దుస్తులు ధరించాడు. ఆమె అతడికి సహాయ పడింది. కారు హారన్ మ్రోగింది.

"కారు వచ్చి వుంటుంది!"

ఆమె హాల్లోకెళ్ళి ముందు తలుపు తెర్చింది. అంబాసిడర్ కారు లోపలకొచ్చి ఆగింది.

"అయ్యగారు వస్తున్నారు" అందామె డ్రయివర్ వైపు చూస్తూ.

జీవన్ వైపు చూసి ఆమె అతడిని లోపలకు రమ్మంది, కాస్సేపట్లో జీవన్ ఒక తోలుపెట్టె, ఏర్ బాగ్ తీసుకొచ్చి కారు డిక్కీలో పెట్టాడు.

బ్రీఫ్‌కేసు పట్టుకొని గోపాలం ముందు వరండామీద కొచ్చి ఆప్యాయంగా సీత వంక చూశాడు.

"ఫోన్ చేసి నీతో రోజూ మాట్లాడుతూ వుంటాలే" అన్నాడతను.

"వెళ్ళగానే ఫోన్ చెయ్యండి."

"చేస్తానులే" అని అతడు కారులో కూర్చున్నాడు.

"డ్రయివర్, ఆఫీసుకు పద" అన్నాడతను.

కారు వెనక్కు కదిలింది. ఆమెవైపు గోపాలం ప్రేమతో చూస్తూ చెయ్యి వూపాడు.

రోడ్డుమీద యెడంవైపుకు తిరిగి కారు ఆఫీసువైపు దూసుకు పోయింది.

## 2

గోపాలం ఎక్స్‌ప్రెస్ ట్రెయిన్‌లో కూర్చుని సాయంత్రం వచ్చే దినపత్రిక పేజీలను విప్పి చూస్తున్నాడు.

తను కూర్చున్న కంపార్టుమెంటంతా ప్రయాణీకులతో నిండి వుంది. మరో ఐదు నిమిషాల్లో ఎక్స్‌ప్రెస్ బయ లేరుతుంది.

ఇద్దరు కూలీలు ఒక క్రపెట్టెను మోసుకొచ్చి అతడి కాళ్ళముందు, సీటు కింద పెట్టారు. నల్లటి క్రపెట్టె పైన తెల్లటి అక్షరాలిలా వున్నాయి. "మ్యూజికల్. యింస్ట్రుమెంట్, హేండిల్ విత్ కేర్."

కూలీలు వెళ్ళిపోయారు. పెట్టె పూర్తిగా సీటుకిందకు వెళ్ళలేదు. అతడి కాళ్ళకు పెట్టె తగుల్తోంది. ఆ పెట్టె ఎవరిది? ఎక్స్‌ప్రెస్ కదిలే లోపల ఎవరో వస్తారేమో!

ఆలోచిస్తూ గోపాలం సిగరెట్ వెలిగించాడు. సీత అతడికి జ్ఞప్తికొస్తోంది. చాలాసేపు అతడు ఆమెను గురించే ఆలోచించసాగాడు. అతడు తన వ్యూహాలోకం నుంచి మేల్కొని యిటూ, అటూ చూశాడు. ఇంతకు ముందు తను చూసినవాళ్లే వున్నారు కంపార్టుమెంటులో. కొత్తవాళ్ళెవరూ రాలేదు. ట్రెయిన్ ధ్వనిచేస్తూ సాగి పోతోంది.

గోపాలం పెట్టెవేపు పరీక్షగా చూశాడు. ఈ పెట్టె ఓనర్ మరో కంపార్టుమెంటులో కూర్చున్నాడేమో! ఇంతకీ ఆ పెట్టెను గురించి తనెందుకు వర్రీ అవాలి?

కిటికీలోంచి అతడు బయటకు చూస్తూ కూర్చున్నాడు. చల్లటి గాలి వీస్తోంది. ఎక్స్‌ప్రెస్ వేగంగా వెళ్తోంది.

తన భార్య సీతను గురించి అతడు తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. మంచి గుణాలతోపాటు దేవుడు ఆమెకు అందాన్ని కూడా యిచ్చాడు. ఆమె ఎస్.ఎస్.ఎల్.సి. దాకా చదివింది. తర్వాత పరిస్థితుల వలన ఆమె చదువు మానేసింది.

పెళ్ళయి పదేళ్ళయినా వాళ్ళకు పిల్లలు లేరు. పిల్లలంటే వాళ్ళిద్దర్కీ యెంతో యిష్టం.

"కొంతమందికి పెళ్ళయి సంవత్సరం తిరిగేలోపల పాపలు పుట్టేస్తారు. మనకెందుకలా కాలేదో!" అందామె ఒకసారి.

"సీతా, మా కుటుంబంలో పిల్లలు ఆలస్యంగా పుడ్తారు. అమ్మకూ నాన్నకూ పెళ్ళయిన పన్నెండేళ్ళ తర్వాత నేను పుట్టాను. తనకీ జన్మలో పిల్లలుండరని అమ్మ యెంతో బాధపడేది. నా తర్వాత యిద్దరు ఆడపిల్లల్ని కూడా ఆమె కన్నది. అలాగే మనకూ పిల్లలు పుట్టొచ్చు" అన్నాడతను.

"మీ మాటలు విన్నాక నాలో యింకా ఆశ మెదులుతోంది" అందామె.

మరోసారి ఆమె అతడితో తన జీవితాన్ని గురించి చెప్తుతుంది.

"మీరు సివిల్ యింజనీరు. కంపెనీ పనిమీద ఎక్కడెక్కడికో వెళ్ళి వస్తూంటారు. ఒక్కొక్కసారి పదిరోజుల దాకా మీరు తిరిగిరారు. నేను ఒంటరిగా యింట్లో వుండాలి. ఆ సమయంలో పిల్లలుంటే ఎంతో ఆనందంగా వుంటుందని నాకనిపిస్తుంది" అందామె.

"టికెట్ ప్లీజ్!" అన్నారెవరో.

అతడు వులిక్కిపడి లేచాడు. యెదురుగా నిలబడి వున్నాడు టికెట్ ఎగ్జామినర్.

గోపాలం తన టికెట్ చూపించాడు. అది చూసి తిరిగిచ్చేసి, కిందనున్న పాడుగాటి కర్ర పెట్టె వైపు చూశాడతను.

"ఆ పెట్టె మీదా?" అడిగాడతను.

"నాది కాదు" అన్నాడు గోపాలం.

"ఎవరిది?" అని అతడు నలువైపులా చూశాడు. ఆ పెట్టె ఎవరిదో యెవరికీ తెలియదు!

"జోలార్ పేట వెళ్ళాక తేలుంది" అని టికెట్ ఎగ్జామినర్ ముందుకు కదిలాడు.

గోపాల్ సిగరెట్ పొగ పీల్చి వదుల్తూ కిటికీలోంచి బయటకు చూస్తూ కూర్చున్నాడు.

ఇళ్ళల్లో దీపాలు వెలుతున్నాయి. చల్ల గాలికోసం కొందరు యిళ్ళముంగు కుర్చీల్లో, మంచాలమీద కూర్చుని వున్నారు. ఏవేవో పల్లెటూర్లను దాటిపోతోంది ఎక్స్ప్రెస్.

పెందరాళే భోజనంచేసి సీత యీపాటికి టి.వి. చూస్తూ వుంటుందేమో! ఒక్కతే వున్నపుడు కంటంటే ఆమె బదకిస్తుంది. ఆ పూరీలు మిగిలినవి తినేసి ఈపాటి కామె గాఢ నిద్రలో వుండొచ్చు! అతడు తనలో తను నవ్వుకున్నాడు.

# 3

జోలార్ పేట ఎక్స్ప్రెస్ గమ్యస్థానం చేరుకుంది. అందరూ కిందకు దిగుతున్నారు. ఒకతను లోపలకొచ్చి గోపాలానికి నమస్కరించాడు:

"మీకోసం కారు తెచ్చాను, సార్" అన్నాడతను. తన పెట్టె, ఏర్ బాగ్ వైపు అతడు చూపించాడు.

"అవి పట్టుకెళ్ళి కారులో పెట్టు" అని గోపాలం బ్రీఫ్ కేసు పట్టుకొని కదిలాడు.

ప్లాట్ ఫామ్ మీదకు దిగాడు. కంపార్టుమెంటులో యెవ్వరూ లేరు. పాడుగాటి నల్ల పెట్టె అలాగే వుంది.

ఆ పెట్టె యెవరిదో!

ప్లాట్ ఫామ్‌మీద కొంతదూరం నడిచి వెనుదిరిగి అతడు చూశాడు. ఎవడో కూలీ ఆ కంపార్టుమెంటులోకి వెళ్తున్నాడు. ఆ పెట్టెకోసమేమో!

ఆ పెట్టెమీదకు తన మైండ్ ఎందుకలా పోతోంది? ఆ పెట్టె ఎవరిదైతే తనకెందుకు?

గోపాలం కారు వెనక సీటుమీద కూర్చుని సిగరెట్ వెలిగించాడు. తలుపు మూసి డ్రయివర్ తన సీటువైపు కదిలాడు. కారును పోనిచ్చాడు.

"ఇండియా లాడ్జిలో నాకు గది బుక్ చేశారా?" ప్రశ్నించాడతను.

"చేశారు, సార్" అన్నాడు డ్రయివర్.

ఇండియా లాడ్జి వైపు కారు దూసుకుపోయింది. ఫ్యాక్టరీ నిర్మాణంలో వున్నందువలన కొంతమంది స్టాఫ్‌తో ఒక ఆఫీసును టెంపరరీగా జోలార్ పేట టౌన్‌లో నడుపుతోంది అతడి కంపెనీ.

ఇండియాలాడ్జి కాంపౌండులో కారు ఆగింది.

"రూమ్ నంబర్ 9 సార్ మీది" అన్నాడు డ్రయివర్.

పెట్టె, ఎర్ బాగ్ మోసుకెళ్తూన్న డ్రయివర్ వెనకనే గోపాలం వెళ్ళాడు. డ్రయివర్ తాళం తెర్చి సామాను లోపల పెట్టాడు.

"మరేదేనా కావాలా, సార్?" అడిగాడు డ్రయివర్.

"ఏమీ వద్దు. నువ్వు వెళ్ళు" అన్నాడతను.

నమస్కరించి డ్రయివర్ వెళ్ళిపోయాడు. అతడు తలుపు మూశాడు. గదిలో పరుపు నీట్‌గా వుంది.

టేబుల్ మీద ఫోన్ వుంది.

అతడు రిసీవర్ని ఎత్తాడు.

"హలో సార్" అంది ఆపరేటర్ కంఠం.

"ఆపరేటర్, మద్రాసు నంబరు 812009కి ఎస్.టి.డి. కాల్ చేసి నాకు కనెక్షన్ యివ్వండి. నేను మాట్లాడిన టైమ్ నోట్ చేసుకొని బిల్ చేయండి" అన్నాడతను.

"అలాగే సార్" అన్నాడతను.

గోపాలం రిసీవర్ పెట్టేశాడు నిమిషాలు గడిచిపోతున్నాయి. పావుగంట దాటింది. గదిలోంచి ఫోన్ మ్రోగింది. గోపాలం రిసీవర్ ఎత్తాడు.

"సార్, మద్రాసు ఫోను రింగవుతోంది. కాని యెవ్వరూ ఎత్తడంలేదు" అన్నాడతను.

"షిట్! నా భార్య యింట్లో వుంది. రింగ్ చేసి చూడండి."

అతడు నంబరు తిప్పాడు. కోడ్ నంబరు తిప్పాక, మద్రాసులోని తనింట్లో ఫోన్ రింగవుతోంది. కాని యెవ్వరూ రిసీవర్ని తీయడంలేదు.

"ఆల్ రైట్, లీవిట్" అన్నాడు గోపాలం.

సోఫాలో కూర్చుని అతడు ఆలోచించసాగాడు. తన ఫోన్ రిపేరులో వుందేమో! ఇంత రాత్రివేళ సీత ఎక్కడకు వెళ్ళుంటుంది? ఇట్లో ఒంటరిగా కూర్చోడం బోర్ కొట్టి పక్కనున్న మాలతి యింటికి వెళ్ళి వుంటుందా?

మాలతీ, సీతా బాగా స్నేహితులు. మాలతి గంటల తరబడి తనింట్లో కూర్చోడం అతడికి తెలుసు. అతడు తన డైరీ తీసి చూశాడు.

మాలతి భర్త అడ్వొకేట్ రామాచారి. అతడి టెలి

ఫోన్ నంబరు కనిపించింది. గోపాలం ఆపరేటర్‌తో చెప్పాడు ఆ నంబరు కోసం ప్రయత్నించమని.

"అలాగే సార్" అన్నాడతను

కాస్సేపట్లో ఫోన్ మ్రోగింది. అతడు ఆత్రంగా రిసీవర్ ఎత్తాడు.

"హలో రామాచారి హియర్!"

"నేను గోపాలం, సీత భర్తని. జోలార్ పేట నుంచి మాట్లాడుతున్నాను. మా యింటికి ఫోన్ చేస్తే ఎవ్వరూ రిసీవర్ తీయడంలేదు. మిమ్మల్ని లేపినందుకు క్షమించి నా భార్య యేమయిందో చూసి చెప్తారా?"

"వుండండి."

మూడు నిమిషాల తర్వాత రామాచారి తిరిగివచ్చాడు.

"మీ యింటికి తాళం వేసివుంది. ఇంట్లో యెవ్వరూ లేరు. గట్టిగా పిల్చి కూడా చూశాను" అన్నాడతను.

"ఆశ్చర్యంగా వుంది" అన్నాడు గోపాలం.

"ఆమె ఎక్కడకు వెళ్ళుంటుంది?"

"నాకు తెలియదు. ఆమె మీ యింటికి తప్ప మరెక్కడికీ వెళ్ళదు. థాంక్స్. నేను తెలుసుకుంటానులెండి, గుడ్‌నైట్" అని గోపాలం రిసీవర్ పెట్టేశాడు.

మూడు దాటిందాకా అతడు గదిలో పచార్లు చేస్తూ, పరుపుమీద యిటూ ఆటూ దొర్లుతూ వుండిపోయాడు. నిద్ర రావడంలేదు. సీత యేమైందో తెలిస్తేగాని తన మనస్సుకు శాంతి లభించదు.

అప్పుడతనికి గుర్తుకొచ్చింది. సీత మేనత్త కూతురికి మద్రాస్ ఎర్‌పోర్టులో పనిచేసే ఒక యువకుడితో పెళ్ళయింది. ఆమె భర్తతోసహా ఒకసారి యింటికి వచ్చినట్లూ, తన్ని వాళ్ళ యింటికి రమ్మన్నట్లూ సీత

అతడితో చెప్పింది.

సీత వాళ్ళ యింటికెళ్ళిందేమో! అతడి యిల్లు మీనంబాకంలో వుంది. వాళ్ళ పేర్లు గోపాలానికి తెలియవు. వాళ్ళ యింటి అడ్రెసు తెలియదు. ఆమె అక్కడుందో లేదో ఎలా కనుక్కోడం?

మరో ఆలోచన అతడి మెదడులో తలెత్తింది.

“వెళ్ళగానే ఫోన్ చేయండి” అందామె తనతో.

తను తప్పక ఫోన్ చేస్తాడని ఆమెకు తెలుసు. తనతో ఫోన్ చేయమని చెప్పి ఆమె ఎక్కడికో వెళ్ళడం విరుద్ధంగా వుంది.

ఆలోచనలో తెల్లారిపోయింది. అతడు గదిలోంచి బయటకొచ్చి, తలుపు మూసి తాళం వేశాడు.

తను వెంటనే మద్రాసు వెళ్ళి ఏం జరిగిందో తెలుసుకోవాలి. సీత క్షేమంగా వుందని తెలిస్తేగాని తను యే పనీ చేయలేడు!

హోటల్ నడవమ్మట అతడు నడుస్తున్నాడు. తటాలున 6 నంబరు గదిలోంచి దేవరాజు రూపం అతడి ముందు ప్రత్యక్షమైంది.

పొద్దుటే యీ రాక్షసుడు తన కెదురైనందుకు గోపాలం లోలోపల విచారించాడు.

“మా బిల్స్ మీరు యింకా పాస్ చేయలేదు. పది లక్షలు పైన ఇరుక్కుపోయింది. మీరొస్తారని కనుక్కొని యిక్కడ గది తీసుకొని వుంటున్నాను” అన్నాడతను.

వేలికొక ఉంగరం, నల్లటి శరీరం, గిరిజాల జుత్తు, పంచ, ఖద్దర్ జుబ్బా. నుదురుమీద విభూది. అచ్చంగా అతడు పిశాచంలాగే వుంటాడు. ఫ్యాక్టరీ బిల్డింగ్స్, స్టాఫ్ క్వార్టర్స్ కట్టించే కంట్రాక్టర్ అతను! తొంద

రగా పని ముగించి డబ్బు చేసుకోవాలని అతడి ఆరాటం.

"మీ బిల్స్ నేను పాస్ చేయనని చెప్పానుగా! మీరు సబ్ స్టేండర్డ్ సిమెంట్ కొన్నారు. అంతా మోసం!" అన్నాడు గోపాలం.

"పుట్టావులే పెద్ద ధర్మరాజువి! నా బిల్స్ నువ్వు పాస్ చెయ్యకపోతే సీ.ఎమ్.డి. పాస్ చేస్తాడు. చూస్తాను యెలా ఆపుతావో!" అన్నాడతను కోపంగా.

అతడితో పోరాడ్డం యిష్టంలేక గోపాలం బయటకు వడివడిగా నడిచాడు.

## 4

గోపాలం జాగారం చేస్తున్న రాత్రి ఇన్‌స్పెక్టర్ శివన్ యింట్లోని టెలిఫోన్ మ్రోగింది. అతడి భార్య గోమతి రిసీవర్ ఎత్తి, "హలో!" అంది.

"పోలీస్ స్టేషన్ నుంచమ్మా. అయ్యగారితో మాట్లాడాలి" అన్నాడు హెడ్ కానిస్టేబులు అరవిందం.

"ఆయన సూపర్ మేన్ కాదు, మామూలు మనిషి. గాఢ నిద్రలో వున్నారు" అందామె.

"ఆయన్ని లేపాలమ్మా."

"లేపితే నన్ను వాయించుతారు."

"లేపకపోతే నన్ను తంతారమ్మా. ఇదొక హత్య కేసు."

"వుండు లేపుతాను."

భర్తను ఆమె తట్టి లేపింది.

"నన్ను పడుకోనివ్వవు! చంపుకు తింటావు!" అరిచాడతను విసుగ్గా.

"ఏదో శవం దొరికిందట!" అరిచిందామె.

అతను తృళ్ళిపడ్తూ లేచాడు. రిసీవర్ అందుకున్నాడు.

"హలో. యిన్‌స్పెక్టర్ శివన్!" అన్నాడు.

"నేను సార్ హెడ్‌ని."

"ఎవరు చచ్చారు?"

"రైల్వే స్టేషన్‌లో నల్లటి క్రపెట్టె దొరికింది, సార్. నేను వెళ్ళి చూశాను. పెట్లో అడదాని శవం వుంది. మీరు స్టేషన్‌కి రావాలి."

"ఎవరామె?"

"పేరు తెలియదు సార్."

"డాక్టర్ సుందరంకి ఫోన్ చేసి రమ్మను. నువ్వు మరో యిద్దరితో రైల్వేస్టేషన్‌కిరా. నేను అక్కడికొస్తున్నాను" అన్నాడు యిన్‌స్పెక్టర్.

"యస్సార్" అన్నాడు హెడ్.

జీప్‌లో యిన్‌స్పెక్టర్ శివన్ రైల్వేస్టేషన్‌కు చేరుకున్నాడు. హెడ్ కానిస్టేబులు అరవిందం ఆతడికి శల్యూట్ యిచ్చాడు.

"పద!" అన్నాడు యిన్‌స్పెక్టర్.

ఐదడుగులు పొడుగున్న నల్లటి క్రపెట్టె తెరచి వుంది. కాఫిన్‌లా వుందది. లోపల ఒక స్త్రీ శాశ్వత నిద్రలో వుంది. ఆమె శరీరం రంగు మారింది. ఆమె ముఖంలో ఏదో బాధ గోచరిస్తోంది.

"ఈ పెట్టె ప్లాట్‌ఫాంమీద దొరికిందా?" ఇన్‌స్పెక్టర్ అడిగాడు.

"జోలార్‌పేట ఎక్స్‌ప్రెస్‌లో వచ్చింది. ఎవ్వరూ ఈ పెట్టెను తీసుకుపోలేదు. అనుమానం వచ్చి కిందకు దింపారు. తాళం పగలగొట్టి చూస్తే ఈమె శవం వుంది" అన్నాడు హెడ్.

"ఎవరికొచ్చింది అనుమానం?"

"రైల్వే కానిస్టేబుల్ శెల్వానికి. స్టేషన్ మాష్టర్ సమక్షంలో పెట్టెను అతడు తెరాడు. శవాన్ని చూసి మనకు ఫోన్ చేశాడు. వెంటనే నేనొచ్చి చూశాను. మీకు ఫోన్ చేశాను."

"గుడ్" అన్నాడు యిన్‌స్పెక్టర్ శివన్.

ప్లాట్ ఫామ్‌మీద కొందరు మనుషులు గుమిగూడారు. శవాన్ని గురించి అందరూ మాట్లాడుకుంటున్నారు.

స్టేషన్ లైట్లు వెలుగుతున్నాయి. పోలీస్ డాక్టర్ సుందరం వచ్చాడు. శవాన్ని పరీక్షించాడు.

"ప్లీజ్, శవం దగ్గరగా ఎవ్వరూ రాకండి. ప్రమాదకరమైన ఎమ్.ఐ.సి. గాస్ పీల్చి ఈమె మరణించిందని నా అనుమానం" అన్నాడు డాక్టర్ సుందరం.

"ఎమ్.ఐ.సి. గాస్ అంటే?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"మిథిల్ ఐసో సైనేట్ గాస్! ఈ మధ్య భోపాల్ పట్నంలో వుండే పెస్టిసైడ్ ఫ్యాక్టరీ నుంచి యీ గాస్ బయటకు లీకయింది. కొన్ని వేలమంది లీకయిన గాస్ పీల్చి మరణించారు" అన్నాడు డాక్టర్ సుందరం.

మరికొన్ని పరీక్షలు సాగించి డాక్టర్ సుందరం ఇన్‌స్పెక్టర్ వంక చూశాడు.

"ఈమె నిన్న సాయంత్రం మరణించి వుండాలి."

"ఎన్నింటికి?"

"సరైన టైము చెప్పలేను. నాలుగు, ఐదు మధ్య."

ఇన్‌స్పెక్టర్ శవంవైపు మళ్ళా చూశాడు. ఆమె మెళ్ళో బంగారం గొలుసుంది. మంగళసూత్రాలున్నాయి. చేతులకు గోల్డు బాంగిల్స్ వున్నాయి. డబ్బుకోసం ఈ హత్య జరగలేదని స్పష్టమవుతోంది.

"ఇన్‌స్పెక్టర్, ఈ శవాన్ని పోస్టుమార్టమ్‌కి మద్రాసు

జనరల్ హాస్పిటల్‌కి పంపడం మంచిదని నా అభి ప్రాయం. గాస్ మాస్క్ ధరించి శవ పరీక్ష చేయాలి" అన్నాడు డాక్టర్ సుందరం.

"అలాగే చేయించుతాను" అన్నాడు యిన్‌స్పెక్టర్ శివన్.

శవం ఫోటోలు తీశారు. కర్రపెట్టె వున్న కంపార్టు మెంటును యిన్‌స్పెక్టర్ శివన్ పరీక్షించి వచ్చాడు. పైడులో వున్న పట్టాలమీద వుంది జోలార్‌పేట ఎక్స్‌ప్రెస్. టార్చి కాంతిలో యిన్‌స్పెక్టర్ శివన్ సీటు కింద వెతికాడు.

ఉపయోగించేదేమీ దొరకలేదు. సిగరెట్ పీకలు కాల్చి పారేసిన బీడీలు దొరికాయి. అందరూ ప్లాట్ ఫాంమీదకు తిరిగి వచ్చారు.

శవంమీదున్న గుడ్డలు, నగల ఇన్‌వెంటరీ తయారు చేశాడు యిన్‌స్పెక్టర్ శివన్. స్టేషన్‌మాష్టరు మరో వ్యక్తి సంతకాలు పెట్టారు.

కర్రపెట్టెను మూసేశారు.

"మద్రాసుకు శవాన్ని వెంటనే పంపిస్తాను" అన్నాడు ఇన్‌స్పెక్టర్ శివన్ పక్కనున్న డాక్టర్ సుందరంతో.

ఇద్దరు కానిస్టేబుళ్ళను అక్కడ కాపలా వుంచి ఇన్‌స్పెక్టర్ శివన్ తన జీపువైపు నడిచాడు. డాక్టర్ సుందరం అతడి స్కూటర్ మీద వెళ్ళిపోయాడు.

ఇన్‌స్పెక్టర్ శివన్ జీపులో కూర్చున్నాడు. డ్రయివర్ సీటులో వున్న హెడ్ కానిస్టేబుల్‌తో స్టేషన్‌కి పదమని చెప్పాడు.

హెడ్ కానిస్టేబుల్ అరవిందం జీప్‌ను పోనిచ్చాడు.

"సంవత్సరం తర్వాత మన చేతుల్లోకి ఈ మర్డర్ కేసు వచ్చింది సార్" అన్నాడు హెడ్.

## 5

పోలీసుస్టేషన్ కు వెళ్ళగానే తన కుర్చీలో కూర్చుని, ఒకసారి ఆవులించి, యిన్స్పెక్టర్ శివన్ హెడ్ కాన్ స్టేబుల్ వంక చూశాడు.

"హాట్ టీ చేయించి పట్రా" అన్నాడతను.

"అలాగే సార్" అని హెడ్ వెళ్ళిపోయాడు.

సంవత్సరం తర్వాత ఒక మర్డర్ కేసు తనకు చిక్కింది. తనే స్వయంగా దర్యాప్తు చేసి హంతకుడిని పట్టుకోవాలి.

సంవత్సరం క్రితం తను సబ్ఇన్స్పెక్టర్ గా ఒక హత్య కేసులో పనిచేసి అఖండ విజయాన్ని సాధించాడు. దానితో సర్కిల్ ఇన్స్పెక్టర్ గా ప్రమోషన్ పొందాడు.

హెడ్ హాట్ టీ తెచ్చాడు. ఇన్స్పెక్టర్ శివన్ విస్కీ తాగినట్లు టీ మెల్లిగా తాగాడు. టెలిఫోన్ మ్రోగింది.

"హలో!" అన్నాడతను.

"నేను గోమతిని."

"నిద్రపోలేదా?"

"ఆ శవం గురించే ఆలోచిస్తున్నాను. నాకు భయంగా వుంది. మీ పనింకా పూర్తికాలేదా?"

"చెయ్యవలసింది చెరువంత వుంది" అన్నాడతను.

"ఎప్పుడొస్తారు?"

"హాయిగా నిద్రపో. ఈసారి నేను నిన్ను లేపుతాలే!" అన్నాడతను నవ్వుతూ.

"పోలీసు ఇన్స్పెక్టర్ పెళ్ళాణ్ణి ఎందుకయ్యానో!"

అని ఆమె రిసీవర్ పెట్టేసింది.

ఇన్‌స్పెక్టర్ శివన్ గంభీరంగా నవ్వాడు.

ఇన్‌స్పెక్టర్ శివన్ హెడ్ వైపు చూశాడు.

"పొద్దుట ఐదింటికి ఎక్స్‌ప్రెస్ బయల్దేరుతుంది. నేను మద్రాసు వెళ్ళిపోతాను. ఈ శవం మద్రాసు నుంచి వచ్చిందని నా నమ్మకం. అందువలన అక్కడ నుంచి నరుక్కురాడం మంచిది. శవాన్ని అదే పెట్టెలో నేను మద్రాసు తీసుకు వెళ్తాను. ఒక కానిస్టేబుల్ నాతో వస్తే చాలు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"మంచిది సార్" అన్నాడు అరవిందం.

"నేను లేని సమయంలో అంతా సబ్‌ఇన్‌స్పెక్టర్ తిలక్ యిక్కడ చూసుకుంటాడు. అతడికి ఫోన్ చేసి చెప్తాను."

హెడ్ తల ఆడించాడు.

"శవం ఫోటోల ప్రింట్లు నాకు కొన్ని కావాలి" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"తెల్లారితేగాని స్టూడియోలు తెరవరు సార్!" అన్నాడు హెడ్.

హెడ్ వైపు చురచుర చూశాడు శివన్.

"పోలీసు ఫోటోగ్రాఫర్ రాజా యింటికి కబురు. వెంటనే ప్రింట్లు కావాలని చెప్పు. నేను ట్రెయిన్ ఎక్కేలోపల ప్రింట్లు నా బాగ్‌లో వుండాలి. లేకపోతే యేమవుతుందో నీకు తెలుసుగా!"

"తెలుసు సార్! మీరు అన్నప్రకారం జరగకపోతే వీరభద్రుడైపోతారు మీరు!" అన్నాడు హెడ్.

"టైమ్ వృధా చెయ్యకు! ప్రొసీడ్!" అరిచాడు ఇన్‌స్పెక్టర్ శివన్.

హెడ్ కానిస్టేబుల్ వేగంగా అక్కడినుంచి కదిలాడు.

## 6

స్టేషన్‌లో ఎక్స్‌ప్రెస్ నుంచి దిగి గోపాలం ఆటోలో తన యింటికి చేరుకున్నాడు. గేటు తెరుచుకొని లోపలకు వెళ్ళాడు.

ముందు తలుపుకు వేసిన తాళం వెక్కిరిస్తున్నట్లు కనిపిస్తోంది!

తన భార్య సీత యింకా తిరిగి రాలేదు. ఆమె యేమైంది? యెక్కడికి వెళ్ళింది? అతడి గుండె దడదడలాడ్తోంది.

పనిమనిషి జీవన్ యేమయ్యాడు? యెందుకు పనికి రాలేదు?

పక్కింటి మాలతి, అడ్వకేట్ రామాచారి భార్య, అతడివైపు వరండాలో నిలబడి చూసింది.

"ఆమె యేమైందో తెలియలేదా?"

"లేదు" అన్నాడతను.

"మా యింటికి రండి. గాభరా పడకండి. ఆమె యెక్కడికో వెళ్ళుంటుంది" అందామె.

గోపాలం జీవచ్ఛవంలా ఆమె యింటికి వెళ్ళాడు. హాల్లోని సోఫాలో అతడు కూర్చున్నాడు.

"ఎప్పుడూ యిలా జరగలేదు. జోలార్‌పేట వెళ్ళి అక్కడ వుండలేక, పని మానుకొని యిలా తిరిగొచ్చాను. నా సీత యేమైందో!" విచారవదనంతో అన్నాడతను.

"అదే నాకు ఆశ్చర్యంగా వుంది. మీనంబాకంలో, ఆమె మేనత్త కూతురుందిగా! అక్కడకు వెళ్ళిందేమో!"

"ఆమె అడ్రెసు నాకు తెలియదు."

"క్రిందటిసారి సీత తన మేనత్త కూతురు శాంతని ఇక్కడకు తీసుకొచ్చింది. శాంత ఆమె భర్త కిరణ్ ఇక్కడ చాలా సేపు వున్నారు. వాళ్ళ అడ్రెసు నాకిచ్చారు. నన్ను వాళ్ళింటికి రమ్మన్నారు" అంది మాలతి.

"రక్షించారు. ఆ అడ్రెసు నా కివ్వండి. వెళ్ళి చూస్తాను" అన్నాడు గోపాలం.

ఆమె లోపలకు వెళ్ళి కాఫీ తెచ్చి అతడికిచ్చింది. ఒక చీటీమీద అడ్రెసు రాసి యిచ్చింది. కాఫీని అతడు వేగంగా తాగి సోఫాలోంచి లేచాడు.

"అక్కడకూ వెళ్ళొస్తాను. సీత అక్కడ వుంటుందని ఆశిస్తున్నాను" అని బయటకు కదిలాడతను.

ఆమె వరండామీదకు వెళ్ళింది.

"ఏం తెలిసినా నాకు చెప్పండి. సీత చాలా మంచిది ఇద్దరం కలసి ఎన్నో సినిమాలకు వెళ్ళాం" అందామె.

అతడు రోడ్డమ్మట నడవసాగాడు. సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. చలికాలం అయినా వేడిగా వుంది. తను మీనంబాకం తొందరగా వెళ్ళాలి!

కొంచెం దూరం వెళ్ళాక ఆటో దొరికింది.

"మీనంబాకం పద!"

"వెళ్ళి తిరిగి రావాలా?" అడిగాడు డ్రయివర్.

"అవును" అన్నాడు గోపాలం.

"60 రూపాయిలు యివ్వండి!"

"ఇస్తాను పద!" అన్నాడతను నిస్సహాయంగా.

ఆటో రోడ్డమ్మట దూసుకుపోతోంది. వెనుక కూర్చున్న గోపాలం నిద్రలోకి జారిపోయాడు.

నలభై నిమిషాలపాటు ఆటో వెళ్తూనే వుంది.

"సార్. ఎక్కడికి?" అరిచాడు డ్రయివర్.

ఉలిక్కిపడ్డూ అతడు లేచాడు. డ్రయివర్ ఆటోని ఆపాడు.

"ఎక్కడికి కళ్ళాలో చెప్పండి."

గోపాలం చీటీ చూశాడు.

"రామరత్నం స్ట్రీట్! నంబరు 11."

డ్రయివర్ ఎడంవైపుకు తిప్పి ఆటోను పోనిచ్చాడు. గోపాలం ఉషారుగా యిళ్ళవైపు చూస్తున్నాడు.

"కుడివైపుకు తిరుగు, ఆ వీధి!" అన్నాడు గోపాలం.

చిన్న యింటిముందు ఆటో ఆగింది. అతడు దిగాడు. పిట్టగేటు తోసుకొని లోపలకు వెళ్ళాడు. ముందు తలుపు మూసి వుంది. తలుపుమీద తట్టాడు.

"ఎవరు?" అందో యువతి.

"నేను గోపాలం, సీత భర్తని" అన్నాడతను.

తలుపు తెరవబడింది. ఒక యువతి అతడివైపు నవ్వుతూ చూసింది.

"రండి" అందామె.

అతడు చిన్న గదిలోకి నడిచాడు. ఆమె కూర్చోమంది. సీత అక్కడుంటే తన కంఠం విని పరుగెత్తుకొచ్చేది! సీత అక్కడ లేదని గోడలుకూడా చెపుతున్నాయి!

అతడు వెనుదిరిగాడు.

"కాఫీ తెస్తాను, వుండండి."

"వద్దమ్మా, సీత యిక్కడకు వచ్చిందేమో అనుకున్నాను" అన్నాడతను, నీళ్ళతో నిండిన కళ్ళతో.

"సీత ఏమైంది?" అడిగిందామె ఖంగారుగా.

"అదే లక్షరూపాయిల ప్రశ్న!" అన్నాడతను.

ఆమె చెప్పకుండానే అతడు కుర్చీలో కూలిపోయాడు.

అతడి కళ్ళమ్మట నీళ్ళు జలజల రాలాయి.

అతడిని చూసి ఆమె కళ్ళు తుడుచుకుంది.

"ఏర్‌పోర్టులో కిరణ్ వుంటారు. ఆయన్ని కలవండి. యిద్దరూ ఆమెకోసం వెతకొచ్చు" అందామె.

అతడామెవైపు సూటిగా చూశాడు.

"చెల్లీ, నీ చేత్తో మంచినీళ్ళు యియ్యమ్మా" అన్నాడు.

లోపలకు వెళ్ళి గ్లాసులో నీళ్ళు తెచ్చి ఇచ్చిందామె. అతడు సగం నీళ్ళను తాగేశాడు. కొన్ని నీళ్ళను మొహం మీద జల్లుకున్నాడు. గ్లాసును కిందపెట్టి నమస్కరించి లేచాడు.

"వెళ్తానమ్మా" అని బయటకు కదిలాడు.

వెళ్ళి ఆటోలో కూర్చున్నాడు. డ్రయివర్ ఆటోను పోనిచ్చాడు. రోడ్డు కిరువైపులా అతడు చూస్తున్నాడు, సీత కోసం!

"ఆగు!" అరిచాడతను.

డ్రయివర్ ఆటోను ఆపాడు.

"ఆ వైన్ షాపులోకి వెళ్ళి మెక్డోవల్ బ్రాందీ రెండు ఫుల్ బుడ్డీలు పట్రా" అని డ్రయివర్‌కి రెండు వందరూపాయిల నోట్లు యిచ్చాడు.

బుడ్డీలతో డ్రయివర్ తిరిగివచ్చాడు. బుడ్డీలను, చిల్లరను తీసుకున్నాడతను.

"మా యింటికి పద" అన్నాడతను.

"మీ యిల్లు యెక్కడ సార్?"

"మొదట నేను ఈ ఆటో యెక్కిన ప్రాంతంలోనే" అన్నాడతను.

డ్రయివర్ ఆటోను పోనిచ్చాడు.

ఇంటి తాళం పగలగొట్టి అతను లోపలకు వెళ్లాడు. గదులన్నీ తిరిగిచూశాడు. పడగ్గదిలో నిలబడి పరుపువైపు చూశాడు.

దుప్పటి నీట్ గా పరుపుపైన పరచి వుంది. ఎవ్వరూ పడుకున్న సూచనలు లేవు. క్రితం రాత్రి సీత ఈ పరుపు మీద పడుకోలేదు!

వాళ్ళ సంసారం హాయిగా సాగుతోంది. తనూ, తన భార్య యెంతో అన్యోన్యంగా బతుకుతున్నారు. ఆ పరిస్థితుల్లో తనని విడిచి ఆమె యెందుకు వెళ్ళిపోతుంది?

ఆనాటి రామాయణం అతడి మెదడులో రీల్స్ లా తిరిగింది. యే రాక్షసుడో తన సీతను యెత్తుకుపోయి వుండాలి! తను వెళ్ళి ఆ రాక్షసుడిని వధించి ఆమెను కాపాడాలి!

పెళ్ళినాటి ఫోటోవైపు అతడు కన్నీళ్ళతో చూశాడు. ఆమెను తనకూడా తీసుకుపోవలసింది. నక్కా లకూ కుక్కలకూ ఆమెను వదిలేసి తను వెళ్ళిపోయాడు. అతడు ఏడుస్తూ పరుపుమీద వాలాడు.

సీత లేని యీ లోకంలో తనుండలేడు! మెక్డోవల్ బ్రాందీ బుడ్డీ తెర్చాడతను. గ్లాసులో పోసుకొని, నీళ్ళు కలిపి గడగడ తాగేశాడు.

గొంతు కాలిపోయినట్లనిపించింది.

ఎక్కువగా నీళ్ళు కలపాలి!

ఈసారి బ్రాందీలో అతడు నీళ్ళు ఎక్కువగా పోసి తాగేశాడు. అలా తాగుతూనే వున్నాడు.

టెలిఫోన్ మ్రోగింది.

"హలో!" అన్నాడతను.

"గోపాలం!" అందో కంఠం.

"ఆఁ ఆఁ."

"కంట్రాక్టర్ దేవరాజుని. నీ వెనక నే మద్రాసు వచ్చాను. మీ ఎమ్.డి. దగ్గరకు వెళ్తున్నాను."

"వెళ్ళండి."

"అంతేనా, ఎంత పొగరు!" అరిచాడు దేవరాజు.

"మాటలు సరిగ్గా రానివ్వండి!"

"ఏం చేస్తావేంటి? నా నలభై యేళ్ళ కాంట్రాక్టుల జీవితంలో నీలాటివాళ్ళను చాలామందిని చూశాను. నీలాటి దోమల్ని, ఈగల్ని నేను లెక్కచేయను. నలిపి పారేస్తాను."

"నలిపేయండి! తావలిస్తే చంపేయండి!" అని గోపాలం పిచ్చిగా అరిచాడు.

"విపత్కలయంలో యిరుక్కుపోయావు. నాకు అడ్డొస్తే అలాగే బాధపడ్తావు" అని దేవరాజు రిసీవర్ పెట్టేశాడు.

గోపాలం నిషాలో పిడికిలి బిగించాడు. తన భార్యను ఈ నరరూప రాక్షసుడు ఎత్తుకుపోయి, యెక్కడో దాచాడా?

అతడు మళ్లా బ్రాందీ తాగాడు. సిగరెట్ వెలిగించాడు.

"సీతా, నువ్వు ఎక్కడున్నా నేను నీ దగ్గరకు చేరుకుంటాను" అన్నాడతను గంభీరంగా.

తప్ప తాగి గోపాలం నిద్రపోయాడు. మర్నాడు పొద్దుట అతడికి తెలివి వచ్చింది.

ఏదో అతడి తలను పట్టేసట్లుంది. హేంగోవర్! ఎవరో పిలిస్తే అతడు వీధి తలుపు తెర్చాడు. వరండామీద దిన

పత్రిక పడుంది.

హాల్లో కూర్చుని అతడు దినపత్రికను చూడసాగాడు. ఏదో ఫోటో చూసి అతడు వులిక్కిపడ్డాడు. సీత ఫోటో! ఫోటో కింద యిలా రాసి వుంది. "ఈమె ఎవరో మీకు తెలుసా? తెలిస్తే వెంటనే మాకు టెలిఫోన్ చేయండి."

కింద ఒక టెలిఫోన్ నంబరు పెద్ద అక్షరాల్లో ఈయ బడింది. అతడు టెలిఫోన్ దగ్గరకు నడిచాడు. రిసీవరెత్తి ఆ నంబరు తిప్పాడు.

"హలో, ఇన్‌స్పెక్టర్ శివన్!" అందో కంఠం అటువైపునుంచి.

"ఇన్‌స్పెక్టర్, ఆమె నాకు తెలుసు" అన్నాడు గోపాలం.

"మీకు ఏమవుతుంది."

"నా భార్య సీత."

"మీరెక్కడున్నారు?"

గోపాలం అడ్రెసు చెప్పాడు.

"మీరు ఎక్కడకీ వెళ్ళకండి. అక్కడే వుండండి. ఇన్‌స్పెక్టర్ నాయర్, నేనూ వస్తున్నాం."

"సీత ఫోటోలో అదోలా వుంది. ఆమెకు యాక్సిడెంట్ అయిందా?" అడిగాడు గోపాలం.

అటువైపు రిసీవర్ పెట్టేశారని గోపాలం వెంటనే గ్రహించాడు.

## 8

గోపాలం పదేపదే పేపర్లోని సీత ఫోటో కేసి చూశాడు. కళ్ళు మూసి వున్నాయి. మొహంలో యేదో బాధ! ఆమె యాక్సిడెంట్‌లో యిరుక్కుని వుండాలి!

రెండు పోలీస్ జీప్‌లు యింటిముందు ఆగాయి.

ఇన్‌స్పెక్టర్ నాయర్, ఇన్‌స్పెక్టర్ శివన్ కిందకు దిగారు. వరండాలో నిలబడి వున్నాడు గోపాలం.

"మీరు మాతో రండి" అన్నాడు శివన్.

గోపాలం వాళ్ళవైపు కదిలాడు. ఒక కానిస్టేబుల్‌ని ఇంటికి కాపలా వుండమన్నాడు యిన్‌స్పెక్టర్ నాయర్.

జీప్లలో వాళ్ళు వెళ్ళిపోయారు. జనరల్ హాస్పిటల్ కాంపౌండులో జీప్‌లు ఆగాయి. గోపాలం వాళ్ళ వెనకనే పెద్ద హాల్లోకి ప్రవేశించాడు.

హాల్లో ఎన్నో శవాలున్నాయి. ఒక బల్లముందు ఇన్‌స్పెక్టర్ శివన్ ఆగాడు. దుప్పటిని తీసేశాడు.

"చూడండి! మీ భార్య సీత ఈమేనా?" అడిగాడు యిన్‌స్పెక్టర్ శివన్.

ఆ ప్రశ్నకు జవాబు మరో విధంగా యిచ్చాడు గోపాలం. బల్లమీద వెల్లకిలాపడున్న ఆ మెమీద ఏడుస్తూ వాలిపోయాడు.

"సీతా, నీ కీగతి ఎలా పట్టింది?" అని వెక్కి వెక్కి ఏడ్వసాగాడు.

ఇన్‌స్పెక్టర్ నాయర్ అతడిని వెనక్కి లాగాడు. ఇన్‌స్పెక్టర్ శివన్ దుప్పటి కప్పేశాడు.

"పదండి, మీ యింటికి!" అన్నాడు శివన్.

పొడుగాటి నల్లటి పెట్టె బల్లకింద వుంది. దానివైపు గోపాలం ఆశ్చర్యంగా చూశాడు.

జీప్‌లు అతడి యింటివైపు దూసుకుపోయాయి. ఇంటి ముందు రోడ్డుమీద జీప్‌లు ఆగాయి. అందరూ కిందకు దిగారు.

ఇంటికి కాపలా వుంచిన కానిస్టేబుల్ పక్కనే నాఖుదు జీవన్ నిలబడి వున్నాడు.

అందరూ ముందు హాల్లోకి వెళ్ళారు. ఇన్ స్పెక్టర్ నాయర్, గోపాలం పెద్ద సోఫాలో కూర్చున్నారు. ఇన్ స్పెక్టర్ శివన్ యిటూ, అటూ పచార్లుచేసి గోపాలం వైపు చూశాడు.

"జరిగినదంతా చెప్పండి" అన్నాడు శివన్.

"నేను ప్రేమించి సీతను పెళ్ళాడాను. యెంతో సుఖంగా మేం జీవిస్తున్నాం. నిన్న సాయంత్రం 3-30కి కంపెనీ కారు పంపింది. నేను నా సామానుతో సహా ఆఫీసుకు వెళ్ళాను. నాలుగింటికి ఆఫీసునుంచి సెంట్రల్ స్టేషన్ కి వెళ్ళాను. జోలార్ పేట వెళ్ళాను ఎక్స్ ప్రెస్ లో."

"స్టేషన్ కి చాలా తొందరగా వెళ్ళారు!" అన్నాడు యిన్ స్పెక్టర్ శివన్.

"ఆఫీసు కారును వెనక్కు పంపేయాలి. అందుకని ముందుగా వెళ్ళవలసి వచ్చింది."

ఒక కానిస్టేబుల్ లోపలకొచ్చి యిన్ స్పెక్టర్ నాయర్ తో ఏదో చెప్పాడు. అతడు కానిస్టేబుల్ తో బయటకు వెళ్ళాడు.

"4 నుంచి 5-25 దాకా స్టేషన్ లో వున్నారా?"

"వున్నాను."

"అంత సేపు ఏం చేశారు?"

"నా వెయిట్ చూసుకున్నాను. హిగిన్ బాదమ్స్ షాపులోని బుక్కులు, పత్రికలు చూస్తూ వున్నాను. ఈవినింగ్ డెయిలీ కొన్నాను. కాఫీ తాగాను."

ఇన్ స్పెక్టర్ శివన్ అతడివైపు సూటిగా చూశాడు.

"మీ భార్య అంటే మీకెంతో ప్రేమ. స్టేషన్ లో గంటపైన మీకే పనీ లేదు. ఇంటికి ఫోన్ చేసి ఆమెతో మాట్లాడారా?"

"మాట్లాడాలని ఒకసారి టెలిఫోన్ బూత్‌లవైపు వెళ్లాను. ఏ ఫోనూ ఖాళీగా లేదు."

ఇన్‌స్పెక్టర్ నాయర్ హుషారుగా లోపలకు వచ్చాడు.

"స్టేషన్ నుంచి మీరు యింటికి తిరిగి వచ్చారా?" అడిగాడు నాయర్.

"రాలేదు" అన్నాడు గోపాలం.

ఇన్‌స్పెక్టర్ నాయర్ విజిల్ వూదాడు. బయట కానిస్టేబుల్ పరుగెత్తుకొచ్చాడు.

"ఈ యింట్లో పనిచేసే నౌఖరు జీవన్ని లోపలకు రమ్మను."

కాస్సేపట్లో నౌఖరు జీవన్ లోపలకొచ్చి చేతులు కట్టుకొని నుంచున్నాడు. ఇన్‌స్పెక్టర్ నాయర్ అతడి వైపు చూశాడు.

"కంపెనీ కారులో వెళ్ళిపోయిన గోపాలంగారు మళ్లా ఇంటికి తిరిగొచ్చారా?" ఇన్‌స్పెక్టర్ నాయర్ అడిగాడు.

"ఆటోలో వచ్చారు సార్. ఆయన లోపలకు వెళ్ళి తలుపు మూసుకున్నారు. కొంతసేపయ్యాక ఆమె బయట కొచ్చి నన్ను పొమ్మన్నారు" అన్నాడు జీవన్.

"నువ్వు ఎక్కడకు పోయావు?"

"నేను బీడీ బంక్ దగ్గర నిలబడ్డాను. నల్లటి పెట్టె తెచ్చి ఆయన ఆటోలో పెట్టారు. ఆయన కూర్చున్నారు. ఆటో రోడ్డమ్మట మూసుకుపోయింది సార్" అన్నాడు జీవన్.

జీవన్ చెప్పినదంతా గోపాలం ఆశ్చర్యంతో వింటు న్నాడు.

"తర్వాత ఏమైంది?"

"నేను ఈ యింటిముందు నుంచి పోతూ లోపలకు

చూశాను. బయట తాళం వేసుంది."

గోపాలం అతడివైపు చూశాడు.

"యూ డర్టీ లయ్యర్, అబద్ధాలు చెప్పావు! నిన్ను చిత్రవధ చెయ్యాలి" అర్చాడు గోపాలం.

"శివన్ నువ్వు వెళ్ళిపో!" అన్నాడు ఇన్‌స్పెక్టర్ నాయర్.

ఇన్‌స్పెక్టర్ శివన్ సూటిగా గోపాలం వైపు చూశాడు

"పొడుగాటి నల్ల పెట్టెను మీరు చూశారా?" అడిగాడు యిన్‌స్పెక్టర్.

"చూశాను."

"ఎక్కడ?"

"జోలార్ పేట ఎక్స్‌ప్రెస్‌లో, నేనున్న కంపార్టుమెంటులో. ఇద్దరు కూలీలు ఆ పెట్టెను తెచ్చి నా ముందు సీటుకింద పెట్టారు. ఆ పెట్టె నా కాళ్ళకు తగిలేది. ఆ పెట్టెలో నా భార్య సీత వుందని నేను వూహించలేను. అకాలంగా మరణించిన సీత నా కాళ్ళముందున్న పెట్టెలో వుందని నాకు తెలియదు" అన్నాడతను ఏడుస్తూ.

"మీరు జోలార్ పేట వెళ్ళి యెందుకు వెంటనే తిరిగి వచ్చేశారు?" అడిగాడు యిన్‌స్పెక్టర్ శివన్.

"అక్కడి కెళ్ళగానే ఇండియా లాడ్జిలోని నా గది నుంచి యిక్కడకు ఫోన్ చేశాను. ఎవ్వరూ పలకలేదు. పక్కనున్న అడ్వకేటు రామచారికి ఫోన్ చేశాను. నా యింటికి తాళం వేసివుందని ఆయన చెప్పారు. నిన్న రాత్రి నేను నిద్రపోలేను. సీత యేమయిందో అని గాబరాపడ్తూ యిలా వచ్చేశాను" అన్నాడు గోపాలం.

కొంచెం పక్కకు వెళ్ళి ఇన్ స్పెక్టర్ నాయర్, ఇన్ స్పెక్టర్ శివన్ ఏదో మాట్లాడుకున్నారు. ఇన్ స్పెక్టర్ నాయర్ బయటకు వెళ్ళిపోయాడు.

నిస్పృహోయంగా సోఫాలో కూర్చున్న గోపాలం ఇన్ స్పెక్టర్ వైపు చూశాడు.

"ఇన్ స్పెక్టర్! జీవన్ చెప్పిన అబద్ధాలను నమ్మి మీరు నన్ను అనుమానిస్తున్నట్లు వున్నారు. అది నాకు మంచిదే. నన్ను అరెస్టు చేయండి! నన్ను ఉరితీసేయండి. అలాగైనా నేను ప్రాణసమానంగా భావించిన సీతకు దగ్గరవుతాను. యింతవరకూ చావంటే నేను భయపడే వాడిని. సీత పోయాక చావంటే వీసమెత్తు భయం కూడా లేదు" అన్నాడు గోపాలం, కన్నీళ్ళతో.

ఇన్ స్పెక్టర్ నాయర్ తిరిగి వచ్చాడు. ఇద్దరు ఇన్ స్పెక్టర్లూ వరండామీద గుసగుసలాడి హాల్లోకొచ్చారు.

ఇన్ స్పెక్టర్ శివన్ అతడి భుజంమీద చెయ్యివేశాడు.

"గోపాలంగారూ, మీరు చెప్పినదంతా నేను నమ్ముతున్నాను. ఇన్ స్పెక్టర్ నాయర్ పక్కనుండే రామాచారినీ, అతడి భార్యనూ కలుసుకొని వచ్చారు. మీ గురించి మంచే విన్నాం. కాని జీవన్ అలా యెందుకన్నాడు? అదంతా త్వరలో కనుక్కుంటాం" అన్నాడు శివన్.

గోపాలం మాట్లాడలేదు.

"అంతవరకూ మీరు యిల్లు వదిలి యెక్కడకూ వెళ్ళకండి" అన్నాడు యిన్ స్పెక్టర్ నాయర్.

అందరూ జీప్ లవైపు వెళ్ళారు. రెండు జీప్ లూ యింటి ముందునుంచి కదిలిపోయాయి.

గోపాలం ముందు తలుపు మూసి గడియలు బిగించాడు,

పడగ్గదిలోకి వెళ్లాడు. గ్లాసులో బ్రాందీ పోసుకొని గడ గడ తాగేశాడు.

ఇటువైపు బతికుండడం దేవుడు తనకు విధించిన శిక్షేమో!

బ్రాందీ సేవిస్తూ గోపాలం సిగరెట్ పొగ పీల్చి వదులుతున్నాడు. ఏదో టార్చి కాంతిలా అతడి మెదడులో మెరిసింది.

"విషవలయంలో యిరుక్కుపోయావు!"

"నీలాంటి ఈగల్నీ, దోమల్నీ నలిపి పారేస్తాను!"

దేవరాజు మాటలు అతడి చెవుల్లో ప్రతిధ్వనించాయి!

తనమీద కసితో, ఆ దుర్మార్గుడు, ఆ కిరాతకుడు యిదంతా చేయించాడా? జీవన్ చేత అబద్ధాలు అతడే చెప్పించాడా?

నిజాన్ని చంపి, అబద్ధాన్ని, అన్యాయాన్ని యేను గెక్కించే దేవరాజు దుష్టకాండను ఈ లోకంలోని ప్రజలు ఎలా సహిస్తారు? ప్రజలు ఐక్యమై అటువంటి దుష్టులను నిర్మూలించాలి!

దేవరాజులాంటి వాళ్ళు వున్నంతకాలం ఈ దేశం పురోగమించదు. నిజాయితీపరులకు నిలువ నీడ వుండదు.

ఎవరో తలుపు తట్టారు. గోపాలం వెళ్ళి తలుపు తెరిచాడు. రామాచారి విచారవదనంతో లోపలకొచ్చాడు.

"కూర్చోండి" అన్నాడు గోపాలం.

"పొద్దుటనుంచీ మీరు ఏమీ తినలేదనిపిస్తోంది. మా యింటినుంచి మీకు భోజనం తెచ్చాను" అని ఒక కేరియర్ని అతడు సోఫా పక్కనే వుంచాడు.

"పోలీసు ఇన్‌స్పెక్టర్ మా యింటికొచ్చాడు. సీతకు సంభవించింది విని మాలతి షాకయిపోయింది. మీ గురించి

యిన్‌స్పెక్టర్‌తో మాట్లాడాను. మీ భార్యను చంపి, ఆ నేరాన్ని మీమీద మోపడానికి యెవరో ప్రయత్ని స్తున్నారని నా నమ్మకం. త్వరలో నిజం బయటపడ్తుంది" అన్నాడు రామాచారి.

"రామాచారిగారూ, ఏది ఏమైనా నాకు బెంగలేదు. సీతా, నేను పదేళ్ళుగా హాయిగా, ఆనందంగా జీవించాం. ఈ జీవితంలో అది చాలు. ఇటుపైన నాకేమైనా ఫరవా లేదు. కాని అమాయకుల ప్రాణాలను తుడిచిపారేసే స్వార్థపరులను, నీతి నిజాయితీలను దగ్ధంచేసే దుష్టులను మనం ఏకమై ఎదిరించి ఓడించాలి" అన్నాడు గోపాలం.

"అందుకే ఈ కోర్టులూ అవీ పెట్టబడ్డాయి" అన్నాడు రామాచారి.

"ఈ లోకంలో మీలాటి మంచివాళ్ళు వున్నారు. రాక్షసులు వున్నారు. రాక్షసులను మనం కన్నీళ్ళతో జయించలేం. వాళ్ళను బెదిరించడానికి కమ్చీలు కావాలి" అన్నాడు గోపాలం.

రామాచారి కుర్చీలోంచి లేచాడు. అతడివైపు ఆప్యా యంగా చూశాడు.

"నేను వెళ్ళొస్తాను. ఏదో కాస్త తినండి. నే వెళ్ళి మాలతి తినేటట్లు చూస్తాను" అని అతడు వెళ్ళి పోయాడు.

గోపాలం టైము చూశాడు. ఐదు కావస్తోంది. ఇంకా చీకటి పడలేదు. అతడు పడగ్గదిలోకి వెళ్ళాడు. గ్లాసులో బ్రాందీ పోసుకొని, నీళ్ళు కలిపి తాగేశాడు.

నిషాలో వున్నాడతను. అతడి మెదడులో దేవరాజు, జీవన్ రూపాలు పదేపదే కనిపిస్తున్నాయి.

అతడు వంటగదిలోకి వెళ్ళాడు. అలమారులో వున్న

పదునైన కత్తిని గొంతుజేబులో పడేసుకున్నాడు.

ఆ కత్తిని అతడు కొని ఐదేళ్ళయింది. బటన్ నొక్కితే కత్తి బయటకొస్తుంది!

మరో గ్లాసు బ్రాందీ తాగి అతడు బయటకు నడిచాడు. తలుపును దగ్గరగా మూసి వుంచాడు.

"అన్నిటికంటే విలువైన సీతలేని ఆ యింటికి తాళం ఎందుకు?" అనుకున్నాడతను తనలో తాను.

అతడు రోడ్డుమీదకు నడిచాడు.

## 9

బీడీ బంక్ దగ్గర జీవన్ వున్నాడు. దూరంగా నిలబడి గోపాలం జీవన్ వైపు చూస్తున్నాడు.

జీవన్ రోడ్డమ్మట నడుస్తున్నాడు. వెనకనే వెళ్ళాడు గోపాలం. డ్రెయినేజ్ కాలువ వడ్డమ్మట వెళ్తున్నాడు జీవన్. వెనకనే వెళ్ళాడతను. జేబు రుమాలు తలమీద కప్పుకున్నాడు గోపాలం. జీవన్ తనని పోల్చుకోడదు.

ఒక చింత చెట్టుకింద కూర్చున్నాడు జీవన్. అతడు వేగంగా కదిలాడు. అక్కడ జనసంచారం అంతగాలేదు.

తటాలున అతడు జీవన్ ముందు నిలబడ్డాడు.

"మీరా?" అన్నాడు జీవన్.

"నేనే. భయపడ్తున్నావా?"

"నాకెందుకు భయం?" అన్నాడు జీవన్ లేస్తూ.

అమాంతంగా అతడిమీదకు దూకాడు గోపాలం. ఒక దెబ్బతో అతడి మెడ విరిగింది. జీవన్ అరుస్తూ కింద పడ్డాడు.

జేబులోని కత్తిని అతడు బయటకు తీసి బటన్ నొక్కాడు. మెరుస్తూ కత్తి పైకి వచ్చింది.

కత్తిని జీవన్ గొంతుమీద గోపాలం గుచ్చిపెట్టాడు.

"రాస్కెల్, నిజం చెప్పు!" అర్చాడు గోపాలం.

"నన్ను వదలండయ్యా" అర్చాడు జీవన్.

"నేను మళ్ళా ఇంటికి ఆటోలో వచ్చానా?"

"రాలేదు సార్" అన్నాడు సార్.

"ఇన్ని అబద్ధాలు నిన్ను ఎవరు చెప్పమన్నారు?"

"ఆ మస్తాన్ గాడు సార్" అన్నాడు జీవన్.

"నీ కెంత యిచ్చాడు?"

"వెయ్యి రూపాయిలు."

"ఆ డబ్బు ఎక్కడుంది?"

"గుడిసెలో, నా తల్లి దగ్గర."

"నిన్న నేను వెళ్ళాక నా యింట్లో ఏం జరిగింది?" అడిగాడు గోపాలం.

"దేవరాజు గారు, మస్తాను మారు వేషాల్లో వచ్చారు. ఒక పెట్టెను మోసుకొచ్చారు. నేను పిలిస్తే అమ్మగారు తలుపు తీశారు. వాళ్ళిద్దరూ లోపలకు జొరబడి తలుపు మూశారు. తర్వాత పెట్టెను మోసుకొని వాళ్ళు వెళ్ళిపోయారు. ఇంటికి తాళం వేయమని నాతో చెప్పారు. నేను తాళం నొక్కి వెళ్ళిపోయాను. వాళ్ళ కారు కొంచెం దూరంలో ఆగి వుంది. నల్లటి పెట్టెను వాళ్ళు కారులో పెట్టి వెళ్ళిపోయారు" అన్నాడుజీవన్.

"ఇదంతా పోలీసులకు చెప్పగలవా?"

"చెప్తే ఆ మస్తాన్ గాడు నన్ను చంపేస్తాడు."

అతడివైపు గోపాలం సూటిగా చూశాడు.

"మూడేళ్ళపైగా నా యింట్లో నౌఖరుగా వుంటున్నావు. డబ్బుకోసం నా భార్య ప్రాణాన్ని అమ్మేశావు. నీకు శిక్ష ఏమిటి?"

"ఇటుపైన అలా చెయ్యను సార్. నన్ను వదిలేయండి"

అన్నాడు జీవన్.

"నిన్ను వదిలేస్తే మరెవర్నో మోసగిస్తావు. నీలాటి వాళ్ళు చావాలి!" అని గోపాలం పళ్ళు పటపట కొరికాడు.

కత్తి జీవన్ గొంతును చీల్చేసింది. కత్తి అతడి కడుపు లోకి దిగింది. పేగులు బయటకొచ్చాయి.

డ్రెయినేజ్ కాలువలో మురికి నీళ్ళు ప్రవహిస్తున్నాయి. జీవన్ శవాన్ని అతడు కాలువలోకి తోసేశాడు.

బటన్ నొక్కాడు. కత్తి లోపలకు మాయమైంది. అతడు వెనుతిరిగి వేగంగా వెళ్ళిపోయాడు.

# 10

గోపాలం తన యింటికి చేరుకున్నాడు. రామాచారి తెచ్చిన కేరియర్ తెర్చి చూశాడు. రుచికరమైన పదార్థాలు!

కాని ఏదీ అతను తినదల్చుకోలేదు. సీతలా తనూ ఏమీ తినకుండా వుండాలి!

అతడు గ్లాసులో బ్రాందీ పోసుకొని నీళ్ళు కలిపాడు. క్షణంలో తాగేశాడు. టేబుల్ మీదున్న పెళ్ళి ఫోటో వైపు అతడు చూశాడు. ఆ ఫోటో వైపు చూస్తూనే వున్నాడు. కాలచక్రం పదేళ్ళు వెనక్కి తిరిగింది....

చక్కటి పడగది. పట్టుచీర కట్టుకొని, సీత అప్సరసలా గదిలోకొచ్చింది. అతడా మెరంక చూస్తూ వుండిపోయాడు.

పొడుగాటి జడలో మల్లెపూలు. నుదురుమీద చక్కటి తిలకం. కాటుక కళ్ళు. దానిమ్మగింజల్లా మెరుస్తూన్న పళ్ళు. ఎర్రటి పెదిమలు!

ఆ రాత్రి సరిగ్గా పన్నెండింటికి ఇద్దరూ ఏకమయ్యారు!

ఎన్నేళ్ళు దొర్లిపోయినా ఆ దృశ్యాన్ని అతడు మరువ లేదు.

"ఈ లోకంలో ఏదీ శాశ్వతంగా వుండదు! అంతా మిథ్య!" అనుకున్నాడతను.

గ్లాసులో బ్రాందీ పోసి తాగేశాడు. నీళ్ళు కలపడం మర్చిపోయాడు. గొంతు మండింది. మండనీ! కాలిపోనీ!

అతడు టైమ్ చూశాడు. ఏడు దాటింది. గదిలో లైటు వెలుగుతోంది. అతడు టెలిఫోన్ దగ్గరకు వెళ్ళాడు. రిసీవర్ ఎత్తి ఒక నంబరు తిప్పాడు.

"హలో, ఎవరు?" అందో కంఠం.

"నేను గోపాలం. దేవరాజుగారితో మాట్లాడాలి" అన్నాడతను.

"వుండండి!"

కొంతసేపయ్యాక దేవరాజు కంఠం అటువైపునుంచి వినబడింది.

"గోపాలం ఏం కావాలి? నేను దేవరాజునే" అన్నాడతను.

"మీ బిల్సు అన్నీ పాస్ చేస్తాను" అన్నాడతను.

"ఇది ముందుగానే చేసుండవలసింది."

"ఇప్పుడు పోయిందేమిటి?" అన్నాడతను.

"అవునులే. నీ భార్య పోయిందని విన్నాను. నీకు మళ్ళా వైభవంగా పెళ్ళి చేయిస్తాను. నీకు పెద్ద మేడ కట్టియిస్తాను. నా బిల్సు పాస్ చేస్తూ వుండు. అంతే నాకు కావాలి."

"మీరు చెప్పినట్లు చేస్తాను. ఇంతవరకూ నేను మూర్ఖుడిని. మీ విలువ తెల్సుకోలేకపోయాను" అన్నాడతను.

"గోపాలం, నువ్వు తొమ్మిదింటికిరా! నీకు పెద్ద

డిన్నర్ ఇస్తాను. స్కాచ్ విస్కీ తాగుదాం" అన్నాడు దేవరాజు.

"బ్రహ్మాండంగా వుంటుంది."

"సరిగ్గా 8-30కి కారు పంపుతాను. వచ్చేయి" అన్నాడు దేవరాజు.

"వచ్చేస్తాను" అన్నాడతను.

రిసీవర్ పెట్టేసి అతడు భార్య ఫోటోవైపు చూశాడు.

"సీతా, నీకు ద్రోహంచేసిన వాళ్ళతో నా అకౌంట్లు సెటిల్ చేసి ఆ తర్వాత నీ దగ్గరకు వస్తాను" అన్నాడతను.

పడగ్గదిలో అతడు తాగుతూ కూర్చున్నాడు. సిగరెట్ పీకలు గది నలువైపులా పడివున్నాయి. నిమిషాలు గడిచి పోతున్నాయి.

అతడు టైమ్ చూశాడు. 8-30 అయింది. బయట నుంచి కారు హారన్ మ్రోగింది. అతడు బయటకు వెళ్లాడు. రోడ్డుమీదున్న కారువైపు చూశాడు.

"రండి, గోపాలంగారూ" అన్నాడు మస్తాన్, డ్రయివర్ సీటులోంచి.

గోపాలం కారు దగ్గరకు వెళ్లాడు. మస్తాన్ తప్ప కారులో యెవ్వరూ లేరు. అతడు మస్తాన్ పక్కనే ముందు సీటుమీద కూర్చున్నాడు. మస్తాన్ కారును పోనిచ్చాడు.

"మీరు బాగా మారారని దేవరాజుగారు అన్నారు. మీ కోసం పెద్ద పార్టీని ఆయన ఇస్తున్నారు. పార్టీలో ఆయనా, మీరూ, నేనూ మాత్రం వుంటాం. మరెవ్వరూ రారు" అన్నాడు మస్తాన్.

"ఫైన్" అన్నాడు గోపాలం.

విశాలమైన కాంపౌండులో కారు ఆగింది. దేవరాజు భవనం చాలా పెద్దది. మస్తాన్ అతడిని బాత్రూమ్‌లోకి తీసుకు వెళ్ళాడు.

ఫ్లోరసెంటు లైట్లు ప్రకాశవంతంగా వెల్గుతున్నాయి. పెద్ద హాలు. ఎదురుగా మెరుస్తూన్న కౌంటరు. అద్దాల బీరువాలో ఎన్నో బుడ్డీలు వున్నాయి. ఏర్‌కండిషండ్ బాత్రూమ్‌లో హాయిగా వుంది.

గోపాలం ఫోమ్ సోఫాలో కూర్చున్నాడు. "ఇప్పుడే వస్తాను" అని మస్తాన్ వెళ్ళిపోయాడు.

హాల్లో యెవ్వరూ లేరు. కాస్సేపట్లో దేవరాజు, మస్తాన్ వచ్చారు.

"బిల్స్ యిప్పుడే పాస్ చేస్తావా, తర్వాతా?" అడిగాడు దేవరాజు.

"తర్వాత! మీరేం చేయమన్నా చేస్తాను" అన్నాడు గోపాలం వినయంగా.

ఓల్డు పాల్ స్కాచ్ విస్కీ బాటిల్ని గోపాలం తెర్చాడు. మూడు గ్లాసుల్లో పోశాడు. మస్తాన్ సోడా పోసి ఐస్ క్యూబ్స్ వేశాడు.

"చియర్స్!" అంటూ వాళ్ళు తాగడం మొదలెట్టారు.

గంటపైగా వాళ్ళు తాగుతూనే వున్నారు. మస్తాన్ బాత్‌రూమ్‌కి వెళ్ళాడు. దేవరాజు ఒంటరిగా అతడి కెదురుగా కూర్చుని వున్నాడు.

గోపాలం లేచి బాత్‌రూమ్‌వైపు వెళ్ళాడు. మస్తాన్ వెళ్ళిన గది గడియను బయటనుంచి బిగించి అతడు తిరిగి వచ్చాడు. దేవరాజు వెనక్కి జరిగాడు. కత్తి తీసి బటన్ నొక్కాడు.

కత్తిని అతడి మెడమీద గుచ్చిపెట్టాడు.

"రాస్కెల్! నిజం చెప్పు! నా భార్య సీతను చంపించింది నువ్వేనా?" అర్చాడు గోపాలం.

"నాకు ద్రోహం చేస్తే చస్తావు!" అన్నాడు దేవరాజు.

"ఎవరు చస్తారో చూద్దాం" అన్నాడు గోపాలం.

కత్తి మెడలోకి దిగింది. రక్తం పైకి వస్తోంది. దేవరాజు బాధతో అరుస్తున్నాడు.

"దేవరాజు, అనేకమందిని మోసం చేసి నువ్వు కోట్లు గడించావు. కాని అవి నీతో రావు!" అర్చాడు గోపాలం.

"గోపాలం, నన్ను చంపకు! నీకు ఏం కావలసినా యిస్తాను" అన్నాడు దేవరాజు.

"నా భార్య సీతను యివ్వగలవా?" అడిగాడు గోపాలం.

"ఆమె నీ మూలంగానే చచ్చింది. నేను చెప్పినట్లు చేసుంటే ఆమె బతికే వుండేది" అన్నాడతను.

"ఆమె వెళ్ళిన చోటుకు నువ్వూ వెళ్ళాలి" అన్నాడు గోపాలం.

"మస్తాన్!" అర్చాడు దేవరాజు.

గోపాలం గంభీరంగా నవ్వాడు.

"మస్తాన్ రాలేడు. అతడు బాత్‌రూమ్‌లో ఇరుక్కుపోయాడు" అన్నాడు గోపాలం.

"నన్ను రక్షించు!"

"ఎందుకు? మరి కొందరు అమాయకుల్ని నువ్వు చంపడానికా?"

"నువ్వు నాకు ద్రోహం చేస్తున్నావు!"

"నువ్వు ఎంతమందికి ద్రోహం చేశావో ఒకసారి ఆలోచించుకో?''

"నీ మూలంగా సీతను చంపవలసి వచ్చింది."

"ఆమెను ఎవరు చంపారు?"

"మస్తాన్ ఆమెకు ఎమ్. ఐ. సి. గాస్ యిచ్చాడు. ఆమె క్షణంలో మరణించింది."

"ఆ గాసు నీకెలా వచ్చింది?"

"శ్రీకాకుళంలో నాకో పెస్టిసైడ్ ఫ్యాక్టరీ వుంది. అక్కడినుంచి తెప్పించాను.

కత్తి దిగి దేవరాజు మెడ చీలుకుపోయింది. అతడి పొట్ట పగిలింది. పేగులు బైటకొచ్చాయి. దేవరాజు సోఫాలోంచి కిందపడ్డాడు.

గోపాలం బాత్ రూమ్ వైపు వెళ్లాడు. గడియను తీశాడు. మస్తాన్ తలుపును తెర్చాడు. అదే క్షణంలో అతడి కడుపులోకి గోపాలం కత్తి దిగిపోయింది.

మస్తాన్ అరుస్తూ ముందుకు పడ్డాడు. గోపాలం అతడిని అనేకచోట్ల కత్తితో పొడిచాడు. మస్తాన్ బాత్ రూమ్ ముందు చచ్చిపడున్నాడు.

గోపాలం బాత్రూమ్‌లోంచి బయటకు నడిచాడు. కిందకు దిగాడు. గేటు దాటి బయటకు చేరుకున్నాడు. ఆటో యెక్కి తన యింటివైపు వెళ్ళిపోయాడతను.

గోపాలం తన యింట్లో ప్రవేశించాడు. కాగితంమీద ఏదేదో రాశాడతను.

''సీతా, నీ దగ్గర కొస్తున్నా!" అన్నాడతను.

మరుక్షణంలో కత్తి అతడి గుండెల్లో దిగిపోయింది. కత్తిని పట్టుకున్న అతడి చేయి పక్కకు ఒరిగిపోయింది.

• • •

# 83

ఇన్‌స్పెక్టర్ నాయర్, ఇన్‌స్పెక్టర్ శివన్ గోపాలం యింటికి వెళ్ళారు.

గోపాలం నేలమీద చచ్చిపడున్నాడు. అతడి పక్కనే ఒక కాగితం పడుంది.

ఇన్‌స్పెక్టర్ శివన్ ఆ కాగితాన్ని తీసి చదివాడు.

"ఇన్‌స్పెక్టర్,

నన్ను ఎక్కడికీ వెళ్ళొద్దన్నారు. నా శరీరం యిక్కడే వుంది, మీకోసం. కాని నా ఆత్మ సీత ఆత్మతో కలిసిపోయింది."

అని రాశాడు గోపాలం.

—:అ యి పో యిం ది:—

# దెయ్యాల ప్రతీకారం

## స్వరూప్

"బేబీ నీతూ! త్వరగా బుక్స్ తెచ్చుకోమ్మా! కా న్వెంట్ కెటైమౌతోంది" పిల్చాడు భుజంగరావు.

"బీ వెయిట్ డాడీ!" అంటూ పాలు త్రాగిన గ్లాసు టేబుల్ మీద వుంచి, పరుగున తన గదిలోకి వెళ్ళి పుస్తకాల సంచి తీసుకోబోయింది నీతు.

అవి జారి క్రిందపడిపోయాయి.

సర్దుకుని సంచిలో పెట్టుకుందామనుకుంటుండగానే ఒళ్ళంతా చల్లగా అనిపించి, ఏదో మగతలా ఫీలయి అలాగే క్రిందపడిపోయింది.

రెండు సెకన్ల తర్వాత తీక్షణంగా ప్రజ్వలిస్తోన్న కళ్ళతో పైకి లేచింది నీతు.

నోట్ బుక్ లో ఓ పేపర్ చించి, దానిమీద ఏదో రాసి మడతగా చుట్టి చేతిలో వుంచుకొని, పుస్తకాల సంచితో బయటకు వచ్చింది.

అప్పటికే భుజంగరావు కారులో కూర్చుని నీతు కోసం

ఎదురు చూస్తున్నాడు.

సంచి సీట్‌లో పడేసి, తండ్రి ప్రక్కనే వచ్చి కూర్చుంది నీతు. డోర్ వేసి కారు పోనిచ్చాడు డ్రైవరు రంగా.

నీతు కాన్వెంట్ దగ్గర కారు ఆగేసరికి....నీతు చేతి లోని కాగితం భుజంగరావు కోటు జేబులోకి చేరిన విషయం భుజంగరావుకు తెలియదు.

కారు దిగిన కూతురుకు సంచి అందించి "టాటా" చెప్పాడు భుజంగరావు.

"టాటా" గరగరలాడింది నీతు కంఠం.

ఆ కంఠ ధ్వనికి ఉలిక్కిపడి నీతువైపు పట్టిపట్టి చూశాడు భుజంగరావు.

"టాటా డాడీ!" నవ్వుతూ చేయి ఊపుతూ నిలబడ్డ కూతురిలో ఏ మార్పూ కన్పించలేదు భుజంగరావుకు.

కారు కదిలి తన కంపెనీవైపు పయనించ సాగింది.

## 2

ముందు సూట్‌కేస్‌తో రంగా నడుస్తుంటే....వెనక వస్తోన్న భుజంగరావుని చూసి ఆఫీస్ స్టాఫంతా గౌరవంగా లేచి నిలబడి "గుడ్మార్నింగ్ సార్" అంటుంటే ప్రతిగా విష్ చేస్తూ, తన ఎయిర్ కండీషన్డ్ గదిలోకి నడిచి రివాల్వింగ్ ఛెయిర్‌లో కూర్చున్నాడు భుజంగ రావు.

సూట్‌కేస్ టేబుల్ మీద వుంచుతూ .... "సార్! పెట్రోలుకు డబ్బు ఇస్తానన్నారు కదా!" అడిగాడు రంగా.

"ఓహ్!....ఆ విషయం మర్చిపోయాన్రా!" కోటు జేబులో చేయిపోనిచ్చి క్యాష్ తీస్తుంటే....ఓ కాగితం

జారి క్రిందపడింది.

ఆ కాగితంతీసి టేబుల్ మీద పెట్టాడు రంగా.

వందరూపాయల నోటిచ్చి రంగాని పంపేసి, జేబులో నుండి పడిన కాగితం ఏమైవుంటుందా అని చేతిలోకి తీసుకొని మడతలు విప్పాడు.

"భుజంగరావ్!

మృత్యుఘడియలకు ఆసన్నమౌతున్నావు. నిన్ను చంపటానికి నాకు నిమిషం కూడా పట్టదు. వారం క్రితం నన్నూ, నా భార్య రాగిణిని ఎన్ని చిత్రహింసలు పెట్టి చంపా(లో)వో నిన్నూ అలాగే చంపుతాను. ముందు నీ ఆఫీస్ స్టాఫ్‌తోనే నీకు 'దేహశుద్ధి' జరిపిస్తాను కాచుకో...."

చేతులు వణుకుతుంటే పేపరు జారి క్రిందపడిపోయింది. భయంతో భుజంగరావు శరీరం చిన్నగా కంపించసాగింది.

ఆ పేపరు తన కోటుజేబులోకి ఎలా వచ్చిందో అర్థం కావటంలేదు. పేపరు చేతిలోకి తీసుకొని మరలా చదివాడు.

ఆ దస్తూరి తనకు పరిచయం కానిది. పేపరు వెనక్కి త్రిప్పిచూసి మరింత ఆశ్చర్యపోయాడు భుజంగరావు.

ఆ కాగితం నీతు నోట్ బుక్ లోనిదిగా గ్రహించాడు. దానిమీద ముందురోజు డేట్‌తో స్కూల్లో చెప్పిన నోట్స్ రాసి వుంది.

అయితే ఈ పని నీతు చేసి వుంటుందా....?

ఓ క్షణం అనుమానం వచ్చిందతనికి.

అయినా నీతు వయసు ఆరు సంవత్సరాలు. తెలుగులో అ, ఆ, లు కూడా తెలియవు. మరింకెవరు చేశారీపని....?

రంగా అయివుంటాడా ...!?

వాడసలు చదువుకోనే లేదే...!

అయితే ఇంకెవరు చేసుంటారు....?

ఆలోచిస్తున్నా అర్థంకావటంలేదు భుజంగరావుకు.

"నీ ఆఫీసు స్టాఫ్‌తోనే నీకు దేహశుద్ధి చేయిస్తా కాచుకో...." సవాల్ చేస్తూ కన్పించాయి లెటర్లోని వాక్యాలు.

భరించలేనట్లు కాగితాన్ని ముక్కలుగా చేసి వేస్టు బాస్కెట్‌లోకి విసిరికొట్టాడు.

ఎందుకో ఆఫీస్‌లో వుండాలన్పించటంలేదు. తన చేతి క్రింద పనిచేసేవాళ్ళే తనని కొడతారంటే చాలా విచిత్ర మన్పించింది. ఆ ఊహ రావటమే అతను భరించలేక పోతున్నాడు.

అర్జంటుగా టైప్ కావలసిన లెటర్లు రెండున్నాయి. వాటిని డిక్టేట్ చేసి ఇంటికి వెళ్ళిపోదామని నిర్ణయించుకుని బెల్ కొట్టి బోయ్‌ని పిలిచాడు.

"సార్!" అంటూ వచ్చి వినయంగా నిలబడ్డాడు బోయ్.

"స్టెనో మాధవిని రమ్మను" పెన్ను తీసుకుని ఫైల్సులో కొన్ని కాగితాలమీద సంతకాలు చేస్తూ అన్నాడు.

"అలాగే సార్!" అంటూ వెళ్ళిపోయాడు బోయ్.

అయిదు నిమిషాల తర్వాత చేతిలో పుస్తకం, పెన్సిల్‌తో ఆ గదిలోకి వచ్చింది మాధవి.

తెల్లని ఛాయతో, నిండైన అవయవ సౌష్టవంతో, చూసిన వాళ్ళ మతులు పోగొట్టేంత అందంగా వుంటుంది మాధవి. ఆ కంపెనీలో కొత్తగా స్టెనోగా సెలక్టు అయింది.

రసికుడైన భుజంగరావు వచ్చిన ఆ మ్మాయిల్లో

ఎంచుకుని, మాధవిని సెలక్టు చేసుకున్నాడు. ఆ తర్వాత 'ఆ విషయాల్లో' మాధవి చాలా స్ట్రిక్ట్ అని తెలుసుకుని ప్లాన్ ప్రకారం అనుభవించాలన్న ఉద్దేశం కూడా అతని మనసులో లేకపోలేదు.

"గుడ్ మార్నింగ్ సర్" వీణ మీటినట్లుగా వుంది మాధవి కంఠం.

తల పైకెత్తిన భుజంగరావు మెరుపుతీగలాంటి మాధవి అందాన్ని అరనిమిషం కళ్ళతో వీక్షించి "మార్నింగ్" అన్నాడు గుటకలు మ్రింగుతూ.

"పిలిచారట."

"ఆఁ....అవును. రెండు లెటర్స్ టైప్ చేయాలి. రాసుకో" అంటూ ఫైల్స్ మూసి ప్రక్కన పడేసి, పెన్ స్టాండ్ లో పెన్నును వుంచి, టై సవరించుకుంటూ పైకి లేచాడు.

"రెడీ సర్!" అంది పుస్తకం తెరచి, పెన్సిల్ పొజిషన్ లో పట్టుకుని.

భుజంగరావు అటూ, ఇటూ తిరుగుతూ లెటర్ డిక్టేట్ చేస్తుంటే, షార్ట్ హాండ్లో స్పీడుగా రాసుకుంటూ పోతోంది మాధవి.

వున్నట్లుండి భుజంగరావు చెప్పటం ఆపేశాడు.

మరో నిమిషం తర్వాతకూడా లెటర్ డిక్టేట్ చేయక పోయేసరికి పుస్తకంనుండి తలత్రిప్పి చూసిన మాధవి.... ఆకలిగా, కాంక్ష నిండిన కళ్ళతో, తనవైపు చూస్తున్న బాస్ ని చూసి అదిరిపడింది.

"సార్!.... లెటర్ ...." అయోమయంగా విచ్చాల పైన ముఖంతో బెదురు చూపులు చూస్తూ భయంగా అంది.

"వస్తున్నా" గరగరమంది భుజంగరావు గొంతు. అంటూనే మాధవిని రెండు చేతులతో బంధించి పెదాల మీద గాఢంగా ముద్దు పెట్టుకున్నాడు.

ఆ చర్యకు మాధవి అణువణువూ ఆగ్రహంతో మండి పిచ్చికోపంతో ఈడ్చి భుజంగరావు చెంపల్ని పగల కొట్టింది.

ఆ దెబ్బలకు కొంచెం పట్టు సడలించాడు భుజంగ రావు.

అదే అదనుగా ఒక్క త్రోపు తోసి తలుపులవైపు పరుగుతీసింది. వెనుకే భుజంగరావు పరుగెత్తాడు.

తలుపులు తెరుచుకుని రొప్పుతూ బయటపడ్డ మాధవిని చూడగానే ఆఫీసు స్టాఫంతా ఆశ్చర్యంతో కళ్లు పెద్దవి చేసుకొని చూడసాగారు.

ఇంతలో—

అదే తలుపు తెరుచుకుని బయటకొచ్చిన భుజంగరావు టేబుల్ మీద చేతులాన్చి ఆయాసం తీర్చుకుంటున్న మాధవిని.... వెనుకనుండి బంధించి ఒళ్ళంతా ముద్దులు పెట్టేస్తుంటే....ఓ క్షణం అది సినిమానా, లేక వాస్తవమా అన్న ఆలోచనలో పడిపోయారు ఆఫీసు స్టాఫు.

మాధవిని క్రింద పడేసి మీదపడ్డాడు భుజంగరావు.

అతని పట్టునుండి విడిపించుకోవాలని విశ్వప్రయత్నం చేస్తూ .... "హెల్ప్ .... హెల్ప్ ...." అంటూ అరుస్తోంది.

అప్పటిగ్గానీ ఆఫీస్ స్టాఫ్‌లో చైతన్యం రాలేదు. తమ కళ్ళముందే సాటి ఉద్యోగినిపై అత్యాచారం తలపెడుతోన్న భుజంగరావు ఆ క్షణంలో తమ 'బాస్' అన్న విషయం కూడా విస్మరించారు.

మాధవి నుండి భుజంగరావు కోటు కాలరు పట్టుకుని పైకి లేపి ఈడ్చి తన్నాడు హెడ్ క్లర్కు.

ఆ దెబ్బకు ఎగురుకుంటూ వెళ్ళి టేబుల్ మీద పడ్డాడు భుజంగరావు.

నిద్రనుంచి వదిలినవాడిలా పైకి లేచాడు.

చుట్టూ ఆఫీస్ స్టాఫ్ పిడికిళ్ళు బిగించి పళ్ళు పటపట లాడిస్తూ మీదకు వస్తుంటే, ఓ ప్రక్క మాధవి.... చిరిగిన జాకెట్ చుట్టూ పైటకొంగు చుట్టుకున ఏడు స్తుండటం చూసి ఆశ్చర్యపోయాడు.

తనమీదకు రాబోతున్న వాళ్ళను "ఏమైంది....? ఏమైంది....?" అంటూ భయంగా అడగసాగాడు.

అతని మాటలకు ఒక్కరూ నోటితో సమాధానం చెప్పలేదు. కాళ్ళతో చేతులతోనే చెప్పారు. అదా, మగ అంతా ఏకమై ఉతకసాగారు. భుజంగరావుమీద కోపమున్న వాళ్ళంతా....మళ్ళా ఛాన్సు దొరకదన్నట్లు మరింత కసిగా బాదసాగారు.

అప్పుడే కార్లో పెట్రోలు పోయించుకొచ్చిన రంగా భుజంగరావుని ఉతికేస్తూ కన్పించిన ఆఫీసుద్యోగులను కలా, నిజమా అన్న మీమాంసలో పడిపోయాడు.

....వెంటనే తేరుకొని వాళ్ళ మధ్యలోకి వెళ్ళి అందర్నీ శాంతపరుస్తూ...."ఏం జరిగిందని?" ప్రశ్నించాడు.

"వీడి చేతిక్రింద పని చేయటానికి వచ్చినంతలో వీడెన్ని చేసినా నోరు మూసుకుని ఊరుకుంటూ మనుకుం టున్నాడేమో! బాసేకాదు....వాడి బాబొచ్చినా వాడికీ ఇదేగతి. తీసుకెళ్ళి హాస్పిటల్లో అడ్మిట్ చేయి" అంటూ ఉచిత సలహా పడేసి ఏడుస్తున్న మాధవిని ఊరడించ

టానికి అటు నడిచారంతా.

జరిగిందేమిటో అర్థం చేసుకున్న రంగా... మూల్గుతోన్న భుజంగరావుని కారు వెనక సీట్లో పడుకోబెట్టి, హాస్పిటల్ వైపు కారును పోనిచ్చాడు.

## 3

బుద్ధి లేని పని చేసి, ఆఫీస్ స్టాఫ్‌తో తన్నించుకుని, హాస్పిటల్లో జాయిన్ కాబడ్డాడన్న విషయం రంగా చెప్పగానే .... పరామర్శించటానికి పరుగున వచ్చారు థామస్, షేర్ ఖాన్ లు.

వీళ్ళిద్దరూ భుజంగరావుకు రెండు భుజాల్లాంటివారు.

థామస్ వయసు నలభై రెండు. నల్లగా, లావుగా వుంటాడు. కొన్ని కంపెనీల్లో పార్ట్‌నర్‌గా వుంటూ... సైడ్‌న స్మగ్లింగ్ చేస్తుంటాడు. శృంగార పురుషుడు. భార్యా వియోగి. ఇరవై యేళ్ళ కొడుకు సుధర్టు, పది హేడేళ్ళ కూతురు ఎలీజా అతనికున్న సంతానం.

షేర్ ఖాన్ వయసు నలభై. కళ్ళకు కాటుక నెత్తిన తెల్లటోపీ, గడ్డం మీసాలతో వింతగా వుంటాడు. స్వంత టైర్ల కంపెనీ వుంది. స్నేహితుల స్మగ్లింగ్ లో సహపాత్ర వుంది. భార్య పేరు ఫాతిమా బేగం. ఒక్కతే కూతురు.... నజీమా. వయసు పదహారు.

"నీ బుద్ధి పోనిచ్చుకున్నావు కాదు భుజంగరావు. ఆ పిల్లమీద మరీ అంత మనసైతే, సమయా సందర్భాలు చూడకుండా ఆఫీసు స్టాఫు అందరిమధ్యా 'ఆ పని' చేయబోతే వాళ్ళు సహిస్తారా!" ఎగతాళిగా అన్నాడు థామస్ బెడ్ మీద మూల్గుతోన్న భుజంగరావుతో.

"అంతగా మనసైతే ఎన్ని మార్గాలు లేవు? మన ధర్మాలెన్ని లేవు?....ఏదీ ప్రయోగించకుండా, ముందెవ

రున్నారో యేమిటో చూడకుండా మీద పడిపోవట మేనా?" ఈ మాటలు షేర్ ఖాన్ అన్నాడు.

"ఫ్రెండ్స్! నిజం చెబుతున్నాను. అసలు నాకేం జరిగిందో నాకే తెలియదు. మాధవిపై అత్యాచారం జర పాలనుకోవటం కూడా నాకు తెలియదు. నాకు తెలిసే సరికి నేనో టేబుల్ మీద పడి వున్నాను. అందరూ నన్ను తన్నటాన్కి వస్తూ కన్పించారు. వాళ్ళెందుకు నన్ను కొట్టారో ఇప్పుడు మీరు చెబితేకాని నాకు తెలియలేదు." దెబ్బలు పెడుతున్న బాధ భరిస్తూ అన్నాడు భుజంగ రావు.

అతని మాటలకు వింతగా చూశారు థామస్, షేర్ ఖాన్‌లు.

"అసలేం జరిగిందో వివరంగా చెప్పు?"....అడిగాడు షేర్ ఖాన్.

తను ఆఫీసుకు రావటం, తన జేబులోనుండి బయట పడిన కాగితం, అందులోని సారాంశం....ఇంటికి వెళ్ళి పోవాలనుకున్న విషయం అన్నీ చెప్పాడు భుజంగరావు.

"నిజం చెపుతున్నాను షేర్ ఖాన్! మీరు నమ్మండి. మాధవికి లెటరు డిక్టేట్ చేయటం కూడా గుర్తుంది. మధ్యలో నా వళ్ళంతా చల్లగా అయినట్లన్పించింది. ఒక్కసారిగా గగుర్పొడిచింది. ఆ తర్వాత ఏం జరిగిందో నాకు తెలియదు" గాలి పీల్చుకోవటాన్కి ఆగాడు భుజంగరావు.

"అయితే యిదంతా ఆ ఉత్తరం రాసిన పృథ్వీరాజ్ దెయ్యం చేసిన పనేనంటావు" మెల్లగా అడిగాడు షేర్ ఖాన్.

"జరిగింది చూస్తుంటే అలాగే అన్పిస్తోంది."

భుజంగరావు మాటలకు చిన్నగా నవ్వాడు థామస్. జరిగిన అవమానం కప్పిపుచ్చుకోవటానికి అలా నాటక మాడుతున్నాడని భావించాడు.

"నిజంగా అది ఆ జంట దయ్యాల పనే అయినట్లయితే ఆ రోజు మనందరం కలిసే 'ఆ పని' చేశాం కదా! మరి మమ్మల్నేం చేయలేదెందుచేత?" అనుమానంగానే అడిగాడు థామస్.

సమాధానం చెప్పలేకపోయాడు భుజంగరావు.

ఆ దయ్యాల విషయం గుర్తుకొస్తేనే హడలిపోతున్నాడు. జరిగిన విషయం భార్యకు తెలియనీయకుండా జాగ్రత్తపడ్డాడు.

"రేపటినుండి ఆఫీసుకు యే ముఖంతో వెళ్ళాలో అర్థం కావటంలేదు థామస్" ఆవేదనగా అన్నాడు.

"నువ్వేం వర్రీ కాకు. అన్నీ మేమిద్దరం చూసుకుంటాం. నువ్వు అట్టే ఆ దయ్యాల గురించి ఆలోచిస్తూ మనసు పాడుచేసుకోకు. నన్నడిగితే అసలు దయ్యాలనేవే లేవంటాను. మన నీడే మన దయ్యం. అంతే—బాగా విశ్రాంతి తీసుకో. అదిగో నీ భార్య, నీ బేబీ వస్తున్నారు. మరి మేం వెళ్లొస్తాం. తర్వాత కలుస్తాం" అంటూ వీడ్కోలు చెప్పి వెళ్ళిపోయారు మిత్రులిద్దరూ.

## 4

"టంగ్ ....టంగ్ ...."

కర్ణభేరి పగిలిపోయిందా అన్నంత గట్టిగా విన్పించిన ఆ గంటల చప్పుడుకు అదిరిపడి లేచాడు థామస్.

అతని భవనమంతా నిశ్శబ్దంగా వుంది.

నిజంగా ఆ గంటలు అంత గట్టిగా విన్పించినట్లైతే స్టువర్టు, ఎలీజాలు ఈ పాటికే నిద్రలేవాలే. మరెందుకు

లేవలేదు?.... లేక తన ఒక్కడికే అలా వినిపించిందా....?

అలా ఆలోచిస్తున్నంతలోనే గది బయట యెవరో చిన్నగా నవ్వినట్లనిపించింది.

గభాలున మంచందిగి పరుగున వెళ్ళి తలుపు తెరిచాడు.

తన గది ప్రక్కనుండి మేడపైకి మెట్లున్నాయి. ఆ మెట్లమీద ఏదో ఆకారం నడచి వెళ్ళిపోవటం స్పష్టంగా చూశాడు.

ప్రక్కనే వున్న స్విచ్ ఆన్ చేశాడు.

కరంటు లేక లైటు వెలగలేదు.

గబగబా మేడమీదకు నడిచాడు. విశాలమైన మేడ. ఆ మేడమీద పనివ్రాడు రాము నిద్రపోతాడు. వాడు తప్ప మరెవ్వరూ కనిపించలేదు థామస్‌కు.

వాడ్ని లేపి 'ఎవరైనా ఇటొచ్చారా?' అని అడుగుదామని వాడి దగ్గరకు వచ్చాడు థామస్.

"నువ్వొస్తావని తెలుసు థామస్! నీ మిత్రుడికి జరిగిన పరాభవం చూశావు కదా! అదంతా నా మహిమే. ఆ అదృష్టాన్ని రేపే నీకు అందిస్తున్నాను. ఈ పట్టణ ప్రజలతోనే నీకు సన్మానం చేయిస్తాను" గరగరలాడుతోంది పనివ్రాడి కంఠం.

వింటున్న థామస్‌కు వళ్ళు మండిపోయింది.—

రాత్రి భోజనాల సందర్భంలో సువర్ట్, ఎలీజాలకు భుజంగరావు విషయం టూకీగా చెప్పాడు తను.

అది విన్న స్టువర్ట్, ఎలీజాలు నవ్వుతుంటే.... భోజనం వడ్డిస్తూ రామూ కూడా నవ్వాడు. అది విని వుండటంవల్ల తనను ఆట పట్టించాలనే ఇలా చేసివుంటాడన్న కోపంతో మేడమీదకు వాలివున్న జామచెట్టు కొమ్మ విరచి, దానితో రాముని ఇష్టమొచ్చినట్లు కొట్టసాగాడు

థామస్.

ఆ దెబ్బకు నిద్రమత్తు వదలిన రాము.... అకారణంగా యజమాని యెందుకు కొడుతున్నాడో అర్థంగాక, తగులు తున్న దెబ్బలకు తట్టుకోలేక, గట్టిగా అరుస్తూ ఏడవ సాగాడు.

ఆ అరుపులకు నిద్రలేచిన స్టువర్టు, ఎలీజాలు పరు గెత్తుకొని మేడపైకి వచ్చారు.

ఇంత రాత్రివేళ రాముని యెందుకలా చావగొడు తున్నాడో అర్థంకాలేదు వాళ్ళకు.

స్టువర్టు, ఎలీజాలు రావటం చూసిన రాము.... పరు గెత్తుకు వెళ్ళి వాళ్ళ వెనకకు చేరి యేడవసాగాడు.

బరికె పుచ్చుకొని ఆవేశంతో వస్తోన్న తండ్రిని మధ్యలోనే అడ్డుకుంటూ — "ఏమిటి డాడీ! వాడేం చేశాడు? .... యెందుకలా కొడుతున్నారు?" అంటూ అడిగాడు స్టువర్టు.

"నన్నే యెగతాళి పట్టించాలనీ, ఆటలాడించాలనీ చూస్తున్నాడ్రా ఈ వెధవ. ఓసారి జ్ఞాపకం వుండేలా బుద్ధి చెపితే, రెండోసారిలాంటి పనులు చేయడు" ఆవే శంతో రొప్పసాగాడు థామస్.

"అసలు వీడేం చేశాడో చెప్పండి డాడీ!" తండ్రి చేతిలో బరికె లాక్కొని మేడ క్రిందకు విసిరేస్తూ అడి గింది ఎలీజా.

జరిగిందంతా చెప్పాడు థామస్.

విని ఆశ్చర్యపోయారు స్టువర్టు, ఎలీజాలు. వింతగా తండ్రివైపు చూశారు. డాడీకేమీ మతిపోలేదు కదా! అన్నట్లు.

"డాడీ! మీరు చెప్పింది నమ్మలేకుండా వున్నాం.

మీ రేదో కలగని అనవసరంగా వచ్చి వాడ్ని తన్నారు. మీ ఆవేశంలో వాడు 'మూగవాడన్న విషయమే మర్చిపోయినట్లున్నారు."

సుబ్బరు మాటలకు తృప్తిపడ్డాడు థామస్.

అప్పటిగ్గానీ అతనికి గుర్తు రాలేదు రాము మూగ వాడన్న విషయం.

అంతా అయోమయంగా అనిపించింది థామస్‌కు. ఒకవేళ ఆ దయ్యాలే తనమీదకూడా విజృంభించలేదు కదా! ఆ విషయం స్ఫురణకు రాగానే థామస్ గుండెలు దడదడలాడాయి.

ఏడుస్తున్న రాముని తీసుకుని మేడదిగి వెళ్ళిపోయింది ఎలీజా.

"మీ ఫ్రెండ్‌ని గురించి, అతను చెప్పిన కల్లిబొల్లి కథల గురించి ఆలోచిస్తూ నిద్రపోయి వుంటారు డాడీ! పీడకల వచ్చి వుంటుంది. బైబిల్ చదువుకుని నిద్ర పొండి" సలహా యిచ్చి ఆవులిస్తూ వెళ్ళిపోయాడు సుబ్బరు.

మెల్లగా తన గదిలోకి నడిచి సిగరెట్ తీసి వెలిగిస్తూ ఆలోచనల్లో పడ్డాడు థామస్.

మూగవాడైన రాము మాట్లాడటం కళ్ళారా చూశాడు. చెవులారా విన్నాడు. ఇదెలా సాధ్యం....? అంతా ఆ దయ్యాల మహిమేనా?....జరిగింది నమ్మాలా, వద్దా....అన్న సందిగ్ధంలో పడిపోయాడు థామస్.

ఆ ఆలోచనలతోనే తెల్లార్లూ జాగారం చేశాడు.

## 5

సమయం ఉదయం ఎనిమిది—

ఫోన్ రింగవుతుంటే రిసీవర్ ఎత్తి 'హలో' అన్నాడు థామస్.

"నేను భుజంగరావుని" అవతలి నుండి నీరసంగా పలికింది భుజంగరావు గొంతు.

"ఓహ్! నువ్వా! యెలా వుంది ఒంట్లో?....యెక్కడ్నుంచి మాట్లాడుతున్నావు?"

"ప్రస్తుతం ఫర్వా లేదు. నిన్న సాయంత్రమే 'డిస్చార్జ్' అయి వచ్చేశాను. అప్పుడే ఆఫీసుకు వెళ్ళి రెండ్రోజులైంది. అక్కడి వాతావరణం ఎలా వుందో ఓసారి వెళ్ళిచూసి రాకూడదనూ!"

"అలాగేలే, సాయంత్రం ట్రిబుల్ క్వీన్ క్లబ్‌లో కలుసుకుందాం."

"తప్పకుండా. ఇంకేమిటి విశేషాలు."

"నీకు చెప్పాను కదా! సరుకు సిద్ధంగా వుంది. ఇక లారీలు తెప్పించి పంపించడమే తరువాయి. అవతల పార్టీలు తొందర పెడుతున్నాయని...."

"ఆఁ....అవునవును....ఏం చేశారా విషయం....?"

"ఇంతకుముందే షేర్‌ఖాన్ ఫోన్ చేసి చెప్పాడు. రాత్రి లారీల్లోకి లోడ్ యెక్కించి తన గొడౌన్‌లో సిద్ధంగా వుంచాడట. అవి కరెక్ట్‌గా ఉదయం ఎనిమిదీ నలభై అయిదుకు బయల్దేరి వెళుతున్నట్లు చెప్పాడు."

"ఈసారి మన వాటాకు ఎంత ముడుతుందంటావ్?" అట్నుంచి హుషారుగా అడిగాడు భుజంగరావు.

"అది ఫోన్‌లో చెప్పేదికాదు. అన్ని విషయాలూ రాత్రి క్లబ్‌లోనే. వుంటాను మరి. కాలకృత్యాలు తీర్చుకుని నీ ఆఫీస్‌కెళతాను."

"ఏం....ఇప్పుడే నిద్రలేచావేమిటి?"

"అవును. రాత్రి తెల్లార్లూ నిద్ర పట్టలేదు."

"ఎందుకని?"

తనకి రాత్రి జరిగిన అనుభవం, దెయ్యం చేసిన హెచ్చరికా చెప్పుదామా, వద్దా అన్న మీమాంసలో పడ్డాడు థామస్. అసలే జరిగిన దానికి భయంతో సగం చచ్చాడు. మరింత బెదరగొట్టట మెందుకులే అని ఆగి పోయాడు.

"ఏమీ లేదు. కొంచెం తలనొప్పి వచ్చింది."

"సరే....వుంటా మరి."

"ఓ.కె" అంటూ ఫోన్ పెట్టేసి పైకి లేచాడు.

కాలకృత్యాలు తీర్చుకుని భుజంగరావు ఆఫీసుకు బయల్దేరాడు థామస్—

ఓ చేత్తో డ్రైవ్ చేస్తూ, మరో చేత్తో సిగరెట్ కాల్చుతూ పోనిస్తున్నాడు కారుని.

ఉన్నట్లుండి తన ప్రక్కన యెవరో కూర్చున్నట్లుగా ఫీలయ్యాడు.

తల ప్రక్కకు త్రిప్పిచూస్తే .... అక్కడ సీట్ కొంచెం అణిగినట్లు, ఎవరో కూర్చున్నట్లే కన్పించింది. కానీ....మనుషులంటూ యెవరూ లేనిదే అలా యెందుకు వుందో అర్థంకాలేదు.

ధైర్యంచేసి అక్కడ చేత్తో తడిమిచూద్దామని....ఓ చేత్తో స్టీరింగ్ కంట్రోల్ చేస్తూ....రెండవ చేతిని సీట్ మీద వేయబోయాడు.

ఆ చేయిని మధ్యలోనే ఎవరో అడ్డుకుని తీసుకువెళ్ళి స్టీరింగ్ మీద వుంచడంతో....ఒక్కసారిగా షాక్ కొట్టినట్లు అదిరిపడ్డాడు. వళ్ళంతా జలదరించినట్లన్పించింది.

వెనక సీట్లో కూడా అలికిడి విన్పించటంతో అటు చూడకూడదనుకుంటూనే తలత్రిప్పి అటు చూశాడు.

అక్కడ....

నగ్నంగా..ఒళ్ళంతా రక్తంతో, ఎర్రబారిన కళ్ళతో, నోటి కిరుప్రక్కలా కోరలతో వికృతంగా నవ్వుతూ థామస్ ముఖానికి దగ్గరగా తన ముఖం తీసుకువచ్చిన రాగిణిని చూసి వెర్రిగా పెద్ద కేక వేశాడు.

కానీ....అది గొంతులో నే అడ్డుపడినట్లు ఆగిపోయింది. గబగబా కారు ఆపి క్రిందకు దిగుదామనుకున్నాడు. తన ప్రయత్నం ఫలించలేదు.

తనని వెనకనుండి యెవరో గట్టిగా అదిమిపట్టేసినట్లు అంగుళంకూడా కదల్లేకపోతున్నాడు.

అంతలో నే మరో భయంకర సన్నివేశం—

తన ప్రక్కనే వికృతాకారంతో ఒక కన్ను బయట కొచ్చి నరంతో వ్రేలాడుతూ, వళ్ళంతా రక్తంకారుతూ, తెగిన పొట్టలోనుండి ప్రేగులు బయటకొచ్చి, భయంకర రూపంతో కూర్చున్న 'పృధ్వీరాజ్'....రక్తం కారుతున్న చేతులతో స్టీరింగ్ మీదున్న తన చేతులను అదుముతూ కన్పించాడు థామస్‌కు.

దానితో హిస్టీరియా వచ్చిన వాడిలా వణికిపోతూ ఊగిపోతున్నాడు థామస్.

స్టీరింగ్ మీద చేతులు అంటుకు పోయినట్లుగా వున్నాయి. కారు మాత్రం ఇష్టమొచ్చినట్లు రోడ్డుమీద పాములా మెలికలు తిరుగుతూ పోతోంది.

రోడ్డుమీద ప్రజలు హాహాకారాలు చేస్తూ ప్రక్కకు తప్పుకుంటున్నారు.

*   •   •

కాన్వెంట్ ముందు కారాగింది—

పుస్తకాలు తీసుకొని కారుదిగి నవ్వుతూ తండ్రికి

'టాటా' చెప్పింది నీతు.

"ఎక్కడకు పోనీయమంటారు సార్?" వినయంగా అడిగాడు రంగా.

షేర్ ఖాన్ లోడ్ పంపిస్తున్నట్లు ఉదయం ఫోన్‌లో థామస్ చెప్పాడు. ఈ పాటికి లారీలు వెళ్ళిపోయి వుంటాయి. ఓ.సారి షేర్ ఖాన్ దగ్గరకు వెళ్ళొస్తే కొంచం సేపు కాలక్షేపం అవుతుందన్న ఉద్దేశ్యంతో "కారును షేర్ ఖాన్ ఇంటికి పోనీయ్" అని చెప్పాడు రంగాతో.

కారు షేర్ ఖాన్ ఇంటివైపు పరుగులుతీసింది.

తండ్రి కన్పించేంతవరకూ టాటా చెపుతూనే వుంది నీతు. ఇక లోపల వెళదామనుకుంటుండగా....

రోడ్డుమీద అందరూ పెద్ద పెద్ద అరుపులు అరుస్తుండటం చూసి ఏమై వుంటుందా అని ఉత్సుకతతో వాళ్ళు చూస్తున్నవైపు చూసింది నూతంగా. ఓ కారు పాములా అటూ, ఇటూ తిరుగుతూ వస్తుంటే....విచిత్రంగా చూస్తూ అలాగే నిలబడింది.

• • •

కారును కంట్రోల్ చేయాలని, బలవంతంగా కదలాలని ప్రయత్నిస్తున్నాడు థామస్. అతని ప్రయత్నం వ్యర్థమైపోతోంది.

యెదురుగా వస్తున్న సైకిళ్ళు స్కూటర్ల వాళ్ళు భయంతో రోడ్డు ప్రక్కకంటూ తప్పుకుంటున్నారు.

ఎవర్ని గుద్దేస్తాడో.... దేన్ని గుద్దుకుంటుందో అన్నట్లు భయంతో పెడకేకలు పెడుతున్నారు ప్రజలు.

కాన్వెంటు దగ్గరకు వచ్చేసింది కారు—

దగ్గరకొస్తున్న కారు మృత్యువులా కన్పించింది నీతుకు.

భయంతో....అక్కడ్నుంచి పారిపోవాలని వెనక్కి తిరగటం, అంతలోనే కారు సీతుని 'ఢీ'కొనటం, 'కీచు' మంటూ హఠాత్తుగా కారు దానంతటదే ఆగిపోవటం క్షణంలో జరిగిపోయింది.

మూడు గజాల దూరం ఎగిరపడిన సీతు తల పగిలి అక్కడికక్కడే ప్రాణాలు వదిలేసింది.

జరిగిన దారుణాన్ని చూసిన ప్రజలు పట్టరాని ఆవేశంతో కారువైపున పరుగున వచ్చారు.

డోర్ తెరచి థామస్‌ను విసురుగా బయటకు లాగి, ఫుట్‌బాల్ ఆడినట్లుగా కాళ్ళతో యిష్టమొచ్చినట్లు తన్నసాగారు.

కొందరు కారు అద్దాలు పగులకొడితే....మరికొందరు దానికి నిప్పంటించారు. భగ్గున ఇంజన్ను అంటుకున్నాయి మంటలు.

  

భుజంగరావు షేర్‌ఖాన్ ఇంటికి వెళ్ళేసరికి మొదటి గదిలోనే ఎదురైంది ఫాతిమా బేగం.

భుజంగరావుని చూడటంతోనే ప్రక్క గదిలోకి తప్పుకుని, పనివాడ్ని పిలిచి—"సాబ్ లేరని, ఏదో ఫోన్ వస్తే కంగారు పడ్డారని, వెంటనే థామస్ గార్కి ఫోన్ చేస్తే అటెవరూ రిసీవ్ చేసుకోలేదని, దాంతో విసుక్కుంటూ ఫోన్ పెట్టేసి భుజంగరావు ఇంటికి వెళుతున్నట్లు తనతో చెప్పి హడావుడిగా కారు వేసుకు వెళ్ళిపోయారని చెప్పు"మని పనివాడితో ఫాతిమా బేగం చెపుతుంటే అన్నీ వింటూనే వున్నాడు భుజంగరావు.

అంత హడావుడి పడటానికి షేర్‌ఖాన్‌కు ఆ ఫోన్ ఎక్కడ్నుండి వచ్చి వుంటుందో అతనికంతు బట్టలేదు.

పనివాడు ఫాతిమా బేగం చెప్పిన విషయాలు చెప్పటానిక్కి రాబోతుంటే...."అన్నీ విన్నాను గానీ, నేను వెళుతున్నానని వారితో చెప్పు" అని అక్కడ్నుండి వచ్చి కారులో కూలబడ్డాడు.

"అర్జంటుగా యింటికి పోనీయ్" అని ఆర్డర్ వేశాడు రంగారావు.

*　　　*　　　*

భుజంగరావు ఇంటిముందు కారు ఆపి హడావుడిగా లోపలకు వచ్చాడు షేర్‌ఖాన్.

అక్కడ భుజంగరావు లేడని, నీతుని కాన్వెంట్ దగ్గర దించటానిక్కి అప్పుడే బయల్దేరి వెళ్లారని సుగుణవతి చెప్పటంతో కంగారుగా బయటకు వచ్చి, కారెక్కి నీతు కాన్వెంట్ వైపు పరుగులు తీయించాడు షేర్‌ఖాన్.

కాన్వెంట్ దగ్గర జరుగుతోన్న మారణహోమం చూసేసరికి అతని మెదడు పనిచేయటం మానేసింది.

ఓ నిమిషం తర్వాతగానీ అతనిలో చలనం కల్గలేదు.

పరుగున వెళ్ళి జనాల చేతిలో చావుదెబ్బలు తింటూ స్పృహ తప్పబోతున్న థామస్‌ను లాక్కొచ్చి కార్లో పడేసి వెనక్కి త్రిప్పి హాస్పిటల్ వైపు పోనిచ్చాడు షేర్‌ఖాన్.

*　　　*　　　*

కాన్వెంట్ దగ్గర కాలిపోతున్న కారు, ఓ చోట గుంపుగా మూగి వున్న జనాన్ని చూడగానే ఆశ్చర్యంతో క్రిందకు దిగాడు భుజంగరావు.

కాలిపోతున్న కారు థామస్‌దిగా గుర్తించాడు.

"పాపం ముక్కుపచ్చలారని పిల్ల .... దుర్మార్గుడు పొట్టన పెట్టుకున్నాడు" యెవరో ప్రక్కనుండి అను

కుంటూ వెళుతుంటే....ఆ పిల్ల ఎవరై వుంటుందా అను కుంటూ గుంపుని చీల్చుకుంటూ వెళ్ళిన భుజంగరావుకు.... రక్తం మడుగులో శవమై వున్న కూతుర్ని చూడగానే— "బేబీ....నీతూ....!" అని అరుస్తూ స్పృహతప్పి క్రింద పడిపోయాడు.

# 6

హాస్పిటల్లో జాయిన్ చేసిన రెండు గంటల తర్వాత గానీ థామస్‌కు స్పృహ రాలేదు—

స్పృహ రాగానే...."చచ్చిపోయిందా, నీతు చచ్చి పోయిందా .. భుజంగరావు నన్ను క్షమించడు....నాకు తెలుసు....నాకు తెలుసు....వాడన్నట్టే దయ్యాలై మన మీద ప్రతీకారం తీర్చుకుంటున్నారు. నాకు తెలుసు.... నాకు తెలుసు ... ..." పిచ్చిగా వాగుతున్న థామస్‌ను వారిస్తూ....

"సరిగ్గా చూశావా నువ్వు ...యెవరికి ఏక్సిడెంట్ చేశావో" కంగారుగా అడిగాడు షేర్ ఖాన్.

"స్పష్టంగా చూశాను. అవే నీలి కళ్ళు...అవే లేత బుగ్గలు. లేక లేక పుట్టిందని ప్రాణంలా చూసుకుంటు న్నాడు. ఆ పాప ప్రాణాలు పొట్టన పెట్టుకున్నాను. షేర్ ఖాన్! నిజం చెబుతున్నాను. జరిగినదాంట్లో నా పొరపాటేమీ లేదు. నా శాయశక్తులా ప్రయత్నించాను. ఆ పృద్వీరాజ్ ....రాగిణిలు....ఆ రెండు దయ్యాలముందు నేను ఓడిపోయాను షేర్ ఖాన్, నేను ఓడిపోయాను" బాగా ఎగ్జయిట్ కావటంవల్ల ఏడ్చేస్తున్నాడు థామస్.

మన నీడే మన దయ్యం అంటూ కొట్టిపారేసే థామస్ తనే దెయ్యాలు, దెయ్యాలు అంటుంటే మరింత ఆశ్చర్య పడ్డాడు షేర్ ఖాన్. జరిగినవి చూస్తుంటే అతనికీ

భయం పట్టుకుంది.

'ఇందాక ఫోన్ చేసిందికూడా ఆ దయ్యం పనేనా?' షేర్‌ఖాన్ మస్తిష్కంలో ఆలోచనలు సుడి తిరుగు తున్నాయి.

"అసలేం జరిగిందో వివరంగా చెప్పు" అన్నాడు ఆలోచనలు ఆపి.

రాత్రి మూగవాడైన రాము మాట్లాడటం దగ్గర్నుండి కారు, సీతుని ఏక్సిడెంట్ చేయటం వరకూ పూర్తిగా చెప్పాడు థామస్. "నీకెలా థాంక్స్ చెప్పాలో అర్థం కావటంలేదు షేర్‌ఖాన్. సమయానికి నీవు రాకపోతే నా ప్రాణం ఆ ప్రజల చేతుల్లో.... ఓహ్! ఊహించలేక పోతున్నాను. ఇంతకూ ఆ క్షణంలో నువ్వెందుకు వచ్చావ్....?" ఆశ్చర్యంగా అడిగాడు థామస్.

"ఉదయం అనుకున్న టైముకు దగ్గరుండి లారీలు పంపేసిన తర్వాత ఇంటికి వచ్చిన పావుగంటకు ఫోనొచ్చింది—"ప్రభుత్వం కళ్ళుగప్పి పంపిస్తున్న ఆ సరుకంతా మీరనుకునే చోటికి చేరదు షేర్‌ఖాన్! సర్వనాశనమై పోతుంది" అని.

"అసలు సరుకు ఫలానా టైముకు వెళుతున్నట్లు నాకు తప్ప, నీకు భుజంగరావుకూ కూడా తెలియదు.... ఉదయం నీకు నేను ఫోన్ చేసేంతవరకూ. ఆ విషయం నన్ను బెదిరించిన వ్యక్తికి ఎలా తెలిసిందా అని ఆశ్చర్యపోయానంటే నమ్ము."

కళ్ళు పెద్దవి చేసుకుని షేర్‌ఖాన్ చెప్పే మాటలు వింటున్న థామస్ .... "ఇంతకూ ఆ ఫోన్ చేసిన వాడెవడు?" అనడిగాడు.

"నన్నే గుర్తుపట్టలేదా షేర్‌ఖాన్?" అంటూ ఫోన్

పెట్టేశాడు.

"ఆ ఫోన్ ఎక్కడ్నుండి వచ్చిందా అని ఎంక్వయిరీ చేస్తే 'పబ్లిక్ బూత్' నుండని తెలిసింది. ఈ విషయం వెంటనే నీకు చెప్పాలని ఫోన్ చేస్తే నీవు లేవని తెలిసింది" అంటూ జరిగింది చెప్పాడు షేర్ ఖాన్.

"ఆ లారీలు గాని ప్రభుత్వం కళ్ళలో పడితే ఈసారి మనం తప్పించుకోవటానికి మన నాయకులకు చాలా ముట్టచెప్పాల్సి వుంటుంది. మనకు పోవటమే గాని.... రావటం కన్పించటంలేదు. ఆ 'పృధ్విరాజ్' గాడితో పెద్ద సైజు దెబ్బతిన్న తర్వాత మరలా మనం నిలబడి ఈ రవాణా జరిపించటం ఇది రెండవసారి. ఈసారి కూడా సరుకు అవతల పార్టీలకు అందకపోతే మనల్ని నమ్మటం మానేస్తారిక. ఈ బాధ సరే....ఆ డ్రైవర్లూ, మన అనుచరులూ పట్టుబడకుండా వుంటే సరేను. మన పేరు బదలాం కాదు" అన్నాడు షేర్ ఖాన్.

"నీకన్నట్లే ఇది కూడా ఆ దయ్యాల పనే అయి వుంటుంది. ఇప్పటికి మా ఇద్దర్నీ ఆడించాయి. ఇక నిన్ను సాధిస్తాయేమో! ఎందుకైనా మంచిది నీ జాగ్రత్తలో నీవుండు షేర్ ఖాన్" అంటూ హితబోధ చేశాడు థామస్.

"నన్నేమైనా చేస్తే వాటి అంతు తేల్చనూ!" కోరగా నవ్వుతూ అన్నాడు షేర్ ఖాన్.

ఇంతలో ఆతృత చెందే ముఖాలతో వస్తోన్న సుబ్బరు, ఎలీజాలను చూడగానే "మరి వస్తాను" అంటూ లేచాడు షేర్ ఖాన్.

"జరిగినదాంట్లో నాదేం తప్పులేదని భుజంగరావుతో

చెప్పు. నీతు గురించి నేనెంత బాధపడుతున్నానో కూడా చెప్పు" అన్నాడు వెళుతున్న షేర్ ఖాన్ తో.

# 7

భుజంగరావు ఇంటిముందు కారాపాడు షేర్ ఖాన్.

ఇంటిచుట్టూ జనం గుమిగూడి వున్నారు. కారు దిగుతుంటే లోపల్నుండి ఇన్స్పెక్టరు, పోలీసులు కూడా వుడిగా బయటకొచ్చి వేన్ లో యెక్కి వెళ్ళిపోయారు.

మెల్లగా లోపలకు నడిచాడు షేర్ ఖాన్.

నీతు నిర్జీవ శరీరం ముందు కూర్చుని దారుణంగా విలపిస్తున్నారు భుజంగరావు దంపతులు.

షేర్ ఖాన్ని చూడగానే—"చూశావా ఖాన్! ఆ థామస్ గాడేం చేశాడో! నా బంగారు చిట్టితల్లిని పొట్టన పెట్టుకున్నాడు. వాడికి నేనేం ద్రోహంచేశానని ఈ పని చేశాడు?....మనం స్నేహానికి 'ప్రాణం' అనుకున్నాంగానీ... వాడిలా వెన్నుపోటు పొడుస్తాడని ఊహించలేదు. వాడ్ని వదిలిపెట్టను. కోర్టుకు ఈడ్పిస్తాను. జైలుకు పంపిస్తాను" యేడుస్తూనే అన్నాడు భుజంగరావు.

"బాధపడకు భుజంగరావ్! జరిగింది చెపితే థామస్ని అలా తిట్టవు" అతని భుజాన్ని అనునయంగా తడుతూ అన్నాడు షేర్ ఖాన్.

షేర్ ఖాన్ వైపు కోపంగా చూశాడు భుజంగరావు.

"ఆ డర్టీ స్కౌండ్రల్ ని నీవు కూడా వెనకేసుకొస్తున్నావా షేర్ ఖాన్? వాడు చేసిన పనిని సమర్థిస్తున్నావా?" ఆవేశంగా అడిగాడు.

"కాదు. నీకు చాలా విషయాలు చెప్పాలి. ఇటురా!"

అంటూ ప్రక్కగదిలోకి లాక్కువెళ్ళి—థామస్ యే పరిస్థితుల్లో సీతుని యేక్సిడెంట్ చేశాడో, యేక్సిడెంట్ కాకుండా చూడాలని ఎంతగా ప్రయత్నించాడో అంతా వివరంగా చెప్పాడు.

"నో....నమ్మను. అంతా కట్టు కథ" అరిచాడు భుజంగరావు.

"అయితే మొన్న మాధవి విషయంలో నీవుకూడా కట్టుకథే చెప్పావన్నమాట" వ్యంగ్యంగా అన్నాడు షేర్ఖాన్.

"లేదు షేర్ఖాన్! అది నిజంగా జరిగింది, నన్ను నమ్ము."

"అది నిజమైనపుడు ఇదీ నిజమేనని ఎందుకు నమ్మవు?" నిలేశాడు షేర్ఖాన్.

మౌనంగా వుండిపోయాడు భుజంగరావు.

"ప్రజలు స్పృహ తప్పేలా తన్నినా .... స్పృహ రాగానే సీతుకోసం యెంతగా కలవరించాడో....నీకన్యాయం చేశానని ఎంతగా విలపించాడో తెలుసా....? మన ముగ్గురం యెప్పటికీ స్నేహం కోసం ప్రాణం ఇచ్చేవాళ్ళమే. నీకు తీరని అన్యాయమే జరిగింది, కాదనను. ఏ పరిస్థితుల్లో జరిగిందో అర్థం చేసుకోకుండా నీ స్నేహితుడ్ని అలా తిడతావా! వెంటనే కేసు విత్డ్రా చేసుకో. నా మాట విను" నచ్చచెప్పాడు షేర్ఖాన్.

రెండు నిమిషాలు భారంగా ఆలోచించిన భుజంగరావు స్టేషన్కు ఫోన్ చేసి చెప్పాడు— కేసు విత్డ్రా చేసుకుంటున్నట్లు.

అతనివైపు కృతజ్ఞతగా చూశాడు షేర్ఖాన్.

# 8

సమయం అర రాత్రిదాటి అరగంట అయింది—

గదిలో లైటు మందంగా వెలుగుతోంది. బెడ్ మీద ఫాతిమా బేగం హాయిగా నిద్రపోతోంది.

బెడ్ ప్రక్కన వున్న టీపాయ్ ముందు కూర్చుని మందు దేవతను ప్రసన్నం చేసుకుంటున్నాడు—ఇంకా దయ్యాల దెబ్బ రుచిచూడని షేర్ ఖాన్.

లారీలు వెళ్ళి రెండ్రోజులైనా అవి ఎటు వెళ్లాయో అందులోని వాళ్ళు యేమైపోయారో యెవరికీ తెలియ లేదు. పోలీసు రిపోర్టు ఇవ్వాలనుకున్నా ఇవ్వలేని పరిస్థితి వాళ్ళది. ఇచ్చి గొడవలు తెచ్చుకునేకంటే .... నోరు మూసుకుని కూర్చోవటం ఉత్తమంగా భావించారు ముగ్గురూ.

ఇంకా సరుకు రాలేదేమిటని ఫోన్లుమీద ఫోన్లుచేస్తున్న అవతల పార్టీల వాళ్ళకు నచ్చ చెప్పేసరికి తల ప్రాణం తోకకు వచ్చింది షేర్ ఖాన్‌కు.

ఒకందుకు సంతోషంగా కూడా వుంది.

సరుకు తను దగ్గరుండి స్వయంగా పంపించాడు. ఆ సమయంలో ప్రక్కన భుజంగరావుగానీ, థామస్‌గానీ లేడు. ముగ్గురికీ ఒకళ్లంటే ఒకళ్ళకి అంత నమ్మకం. ఆ నమ్మకంతోనే సరుకుపోయినా తనని అనుమానించ నందుకు ఆనందపడ్డాడు షేర్ ఖాన్.

ఇంతకూ ఆ లారీలు ఎటు వెళ్ళాయి?....అందులోని వాళ్ళు ఏమయ్యారు?....ఇదంతా దయ్యాల మహిమేనా? ఇవన్నీ సమాధానాలు తెలియని ప్రశ్నలుగా కన్పిస్తు న్నాయి షేర్ ఖాన్‌కు.

ఆ ఆలోచనలతో సిగరెట్లు కాల్చుతూ .... మందు

కొడుతూండగానే "టంగ్....టంగ్...." మంటూ గడియారం రెండు గంటలు కొట్టింది.

గ్లాసులోని ద్రవాన్ని గొంతులో ఒంపుకుంటున్న షేర్ ఖాన్ .... నిశ్శబ్దంలో తుపాకీ పేల్చిన శబ్దంలా "షే....ర్....ఖా....న్....న్....న్..." అంటూ ఎవరో పిలవటంతో ఉలిక్కిపడి చూశాడు.

ఎదురుగా మంచంమీద కూర్చుని తనవైపే తీక్షణంగా చూస్తున్న ఫాతిమా బేగం కన్పించింది షేర్ ఖాన్ కు.

తలకెక్కిన నిషా ఒక్కసారిగా దిగిపోయినట్లనిపించింది. కారణం—ఆమె తనెప్పుడు అలా పేరు పెట్టి పిలవకపోవటమే.

మత్తులో అలా అన్పించి వుంటుందా....లేక నిజంగానే ఫాతిమా అలా పిల్చి వుంటుందా అన్న సందిగ్ధంలో ఒక్క సెకను కాలం అతను ఆలోచించి వుంటాడు.

ఆ ఆలోచన గ్రహించినదానిలా ఫాతిమా బేగం చిన్నగా నవ్వింది.

"నీ ఆలోచన అర్థమైంది షేర్ ఖాన్!.... నేను నీ భార్యను కాను."

"మరి—" ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవిచేసి అడిగాడు షేర్ ఖాన్.

"సరిగ్గా చూడు ఎవరో తెలుస్తుంది" గరగరలాడింది ఫాతిమా బేగం కంఠం.

పరీక్షగా చూశాడు షేర్ ఖాన్.

అదే వర్ణన....అదే భయంకరాకృతి....భుజంగరావు, థామస్ లు చెప్పినట్లే కన్పించిన రాగిణీని చూసి భయంతో అదిరిపోయాడు షేర్ ఖాన్.

వెంటనే ఆ గదినుండి పారిపోవాలని పైకి లేవబోయాడు. ఒళ్ళంతా జలదరించినట్లయి అలాగే కుర్చీకి అంటుకుపోయాడు.

అతని అవస్థచూసి వికృతంగా నవ్వింది రాగిణి.

ఆ నవ్వు గుండెల్ని బ్రద్దలు చేస్తుందా అన్నంత భయంకరంగా వుంది.

"సమస్యలతో సతమతమౌతోన్న నీకు సమాధానం చెపుతా విను షేర్ ఖాన్—నీవు పంపిన లారీలు ఘాట్ రోడ్ నుండి లోయల్లోకి దొర్లిపోయాయి. లారీలతోపాటు అందులోని సరుకు, ఆ సరుకులో ప్రభుత్వం కళ్ళు కప్పి మీరు పంపిస్తున్న 'గంజాయి', కిరాయి గూండాలు, అగ్నికి ఆహుతై బూడిదగా మిగిలిపోయారు. నీ మిత్రులకు సత్కార సన్మానాలు వీక్షించావు కదా! తరువాత వంతు తమరిదే. సిద్ధంగా వుండు.

ప్రస్తుతం నిన్నేమీ చెయ్యను. తన్నకుండా బాధ ఎలా వుంటుందో, బ్రతికుండగానే ప్రాణం పోయిన పరిస్థితిని కల్పిస్తాను. నా భర్తముందే నన్ను 'వివస్త్ర'ను చేసి రాక్షసానందం అనుభవించావే!....ఆ క్షణంలో రక్తం పొంగే ఆవేశంతో, ఏమీ చేయలేని నిస్సహాయతతో రక్తాశ్రువులు కార్చుతూ బాధపడ్డ నా భర్త ఆవేదన ఎలాంటిదో .... ఆ క్షోభ యెటువంటిదో నీకూ రుచి చూడాలని లేదా....?"

"నో....వద్దు....అలాంటి పని నేను సహించలేను" అరిచాడు షేర్ ఖాన్.

"అదే పని నీవు ఒకరికి చేసి..సహించగలవు కదూ!" ఎగతాళిగా పలికింది రాగిణి.

"ప్లీజ్! నీకు పుణ్యముంటుంది. దయ్యానివైనా

దేవతలా నీకు దండం పెడుతున్నాను. నా భార్యకు అలాంటి గతి పట్టనివ్వకు. సంఘంలో నేను తలెత్తుకు తిరగలేను" ఏడ్చేస్తున్నట్లు వేడుకున్నాడు షేర్ ఖాన్.

"తప్పదు షేర్ ఖాన్! మీ ధర్మాలు మీరు నెరవేర్చినపుడు మా ధర్మాలు మేమూ నెరవేర్చుకోవాలి కదా! కాదంటే ఎలా?....ఏమంటారండీ?" షేర్ ఖాన్ ముఖం పైకి చూస్తూ అంది రాగిని.

"సరైన ధర్మసూత్రం చెప్పావంటాను."

ఆ మాటలు తన తలపైనుండి రావటంతో గభాలున తలపైకెత్తి చూసిన షేర్ ఖాన్‌కు—ముఖమంతా రక్తమయమై....ఒక కన్ను తెగి నరంతో బయటకు వ్రేలాడుతూ అతి భయంకరంగా కనపడ్డ 'పృథ్వీరాజ్' ఆకారాన్ని చూడగానే వెర్రికేక పెట్టాడు.

ఒక్క సెకను....అది గొంతులోనే అడ్డుపడినట్లయి, ఆ తర్వాత మెల్లగా బయటపడింది.

ఆ కేకతోనే తన నెవ్వరో పట్టుకున్నట్లనిపించిన ఫీలింగ్ కూడా మాయమైంది. అయినా పైకి లేవకుండా భయంతో వెర్రివాడిలా అరుస్తూనే వున్నాడు.

ఆ అరుపులకు నిద్రలేచి వచ్చిన నజీమా....మందు సీసాలముందు కూర్చుని వణికిపోతూ అరుస్తున్న తండ్రీ, మంచంమీద అదమర్చి నిద్రపోతున్న తల్లీ కనిపించారు.

నిషా తలకెక్కి తండ్రి చిందులేస్తున్నాడనుకున్న నజీమా....బంగారులాంటి నిద్ర తండ్రి అరుపులతో చెడినందుకు చిరాకుపడుతూ అక్కడ్నుండి వెళ్ళిపోయింది.

మూడ్నిమిషాల తర్వాతగానీ....సరైన పరిస్థితిలోకి రాలేకపోయాడు షేర్ ఖాన్.

ఆ తర్వాత బాటిలెత్తి గడగడ ఖాళీచేసి మంచం

వైపు చూశాడు భయంగా. అమాయకంగా నిద్రపోతున్న ఫాతిమా దేహం కన్పించింది. దానితో రాగిణి బెదిరింపు గుర్తొచ్చింది.

"నో....ఆ దయ్యం ఆటలు సాగనివ్వను. ఇకనుండి ప్రతిక్షణం ఫాతిమాని కనిపెట్టుకు వుంటాను" అలా అనుకుంటూండగానే బ్రాందీ ప్రభావం మెదడుని పనిచేయటం ఆపేసింది. కొన్ని నిమిషాలు పిచ్చిపిచ్చిగా వాగి, ఆ తర్వాత గురకపెట్టి నిద్రాదేవి వడిలోకి వెళ్ళిపోయాడు షేర్‌ఖాన్.

# 9

"డాడీ!....డాడీ!" కంగారుగా, ఆందోళనాపూరిత కంఠంతో తనవెవరో కుదిపి లేపుతుంటే బద్ధకంగా కళ్ళు విప్పి లేపిన వ్యక్తివైపు చూశాడు షేర్‌ఖాన్.

ఏడుస్తూ నిలబడ్డ నజీమా ప్రతిమ కళ్ళకు మసగ్గా కన్పిస్తుంటే యేడ్వటానికి కారణం ఏమిటో తెలుసుకోవాలన్న ఆలోచనకూడా కల్గలేదతనికి. రాత్రి త్రాగిన మందు ప్రభావమేమో! మెదడంతా మొద్దుబారే వుంది.

"డాడీ! డాడీ! మమ్మీ బాత్‌రూంలో స్నానంచేసి బట్టలేకుండా బయట కెళ్ళిపోతోంది డాడీ! నే నెంత ఆపాలని ప్రయత్నించినా నా బలం చాల్లేదు డాడీ! నన్ను త్రోసి వెళ్ళిపోతోంది. త్వరగా వెళ్ళండి డాడీ!" రోదిస్తూ చెపుతోన్న కూతురి మాటలు మెదడు కెక్కగానే మత్తంతా యెగిరి దూరంగా పోయింది.

ఒక్క ఉదుటున లేచి "ఫాతిమా!" అని అరుస్తూ బయటకు పరుగులు తీశాడు షేర్‌ఖాన్.

అప్పటికే వీధంతా గగ్గోలుగా వుంది. షేర్‌ఖాన్ని చూసి ఎగతాళిగా నవ్వసాగారు అంతా.

ఏదో 'ట్రాన్స్'లో వుండి నడుస్తున్న దానిలా ఒంటి మీద నూలుపోగన్నా లేకుండా వెళ్ళిపోతోంది ఫాతిమా బేగం.

రోడ్డుమీద మగాళ్ళందరూ పెద్ద పెద్ద కళ్ళు చేసుకుని మరీ ఆమె నగ్న సౌందర్యాన్ని వీక్షించసాగారు, కుర్ర కారు విజిల్స్, కారుకూతలు వేటినీ ఖాతరు చేయకుండా నడిచిపోతోంది ఫాతిమా బేగం.

జాలి తలచిన ఇద్దరాడవాళ్లు అభిమానంతో... సాటి ఆడదాని మానం కాపాడాలన్న తాపత్రయంతో బట్టలు తెచ్చి కప్పబోతే వాళ్ళని దూరంగా విసిరికొట్టి అలా నడుచుకుంటూ పోసాగింది.

ఆ అవమానాన్ని భరించలేకున్నాడు షేర్ ఖాన్. ఎంతగా ప్రయత్నించినా ఫాతిమాను చేరుకోలేక పోతున్నాడు. ఏదో అదృశ్యశక్తి ఫాతిమాకు మూడడుగల దూరంలోనే వుండేట్లు చేయసాగిందతన్ని.

వీధిలోని కోలాహలానికి కారణమేమై వుంటుందా అని ఇళ్ళలో వున్న వాళ్ళంతా పరుగెత్తుకు బయటకొచ్చి చూడసాగారు.

కొందరు మగాళ్ళు హుషారుగా చిందులేసి ఆనందిస్తుంటే, చూడనీయకుండా లోపలకు లాక్కువెళ్ళి తలుపులేస్తున్న తమ భార్యలపై అకారణంగానే తిట్ల వర్షం కురిపించసాగారు కొందరు భర్తలు.

మెయిన్ రోడ్డు మీదకు వచ్చిన ఫాతిమా బేగం వున్నట్లుండి ఆగిపోయింది.

మత్తులోనుండి బయటపడినట్లుగా తెల్లబోతూ చుట్టూ చూసింది. తను బజార్లోకి యెలా వచ్చిందో, తనచుట్టూ

జనం అలా ఎందుకు గుమికూడి గుటకలు మ్రింగుతూ చూస్తున్నారో ఓ క్షణం అర్థంగాక అయోమయంలో పడింది. అదే క్షణంలో గ్రహించింది—తను నగ్నంగా వున్నానన్న విషయం. సిగ్గుతో కుంచించుకుపోయింది.

కొన్ని వందల కళ్ళు తన భార్య నగ్న దేహాన్ని తడిమి, తడిమి చూస్తుంటే.... వెళ్ళి తన భార్యను ఆ స్థితిలోనుండి తప్పించాలని, వాళ్ళందరికీ దూరంగా తీసుకుపోవాలని విశ్వప్రయత్నం చేస్తున్నా....అరంగుళం కూడా కదల్లేక భూమిలో కాళ్ళు కూరుకుపోయినట్లుగా అనుభూతి పొందుతున్నాడు. ఏమీ చేయలేని నిస్సహాయతతో కళ్ళు మూసుకుని యేడవసాగాడు షేర్ ఖాన్.

ఆ అవమానం తట్టుకోలేకపోయింది ఫాతిమా బేగం. వెంటనే ఓ నిర్ణయానికి వచ్చి, వెంటనే దాన్ని అమలులో పెట్టేసింది.

ఆశ్చర్యంతో అందరూ అరుస్తున్నంతలోనే. వేగంగా వెళుతున్న ఓ లారీవైపు పరుగులు తీసింది. అంతే....

ఫాతిమా బేగం దేహం లారీ టైర్ల క్రింద నలిగి పోయింది.

అప్పటిగ్గానీ షేర్ ఖాన్ కదల్లేకపోయాడు.

"ఫాతిమా!" అంటూ చేతిలోని గుడ్డను ప్రాణం పోయిన ఫాతిమామీద కప్పి ఏడుస్తూండిపోయాడు.

# 10

ట్రిబుల్ క్వీన్ బార్ స్పెషల్ రూమ్‌లో మౌనంగా కూర్చుని మందు బిగిస్తున్నారు మిత్రులు ముగ్గురూ.

జరిగిన అనుభవాల బాధతో నలిగిపోతున్నట్లుగా వున్నారు ముగ్గురూ. ఒకప్పుడున్న హుషారు లేదిప్పుడు వాళ్ళలో.

అక్కడి వాతావరణం చాలా నిశ్శబ్దంగా వుంది.

ఆ నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ అన్నాడు భుజంగరావు-

"ఫ్రెండ్స్! సందేహం లేదు. అవి మనమీద ప్రతీకారం తీర్చుకోవటానికి వచ్చాయి. ఇప్పటికే మన ప్రాణాలు సగం తినేశాయి. ఇకముందు యెలాంటి బాధల్లో మనల్ని హింసించి చంపుతాయోనని భయంగా వుంది. వాటి ఆగడాలు ఏ విధంగా అరికట్టాలో అర్థం కావటం లేదు. మనం ఏం చేద్దాం?" తాగిన గ్లాసు క్రింద పెడుతూ అన్నాడు.

"మన మార్గానికి అడ్డొచ్చే మనుషుల్ని....అడ్డు తొలగించే విధానాలు తెలుసుగానీ, దయ్యాల పని పట్టటానికి మన మేమన్నా మంత్రగాళ్ల మా?" బాయిల్డు ఎగ్ ను ముక్కలుగా కోస్తూ ఎగతాళిగా అన్నాడు థామస్.

గ్లాసు నోటికి చేర్చుకోబోతున్న షేర్ ఖాన్ కళ్ళు ఒక్కసారిగా మెరిశాయి.

"ఫ్రెండ్స్! కొత్తగా మన ఊళ్ళోకి ప్రసిద్ధిగాంచిన మళయాళ మాంత్రికుడు 'భైరవస్వామి' వచ్చాడని తెలిసింది. అతను చేతబడులు నయం చేయటమే గాక, గాలి సోకిన వాళ్ళనీ, దయ్యాలుపట్టి పీడిస్తున్న వాళ్ళను రక్షించటంలో ప్రసిద్ధిగాంచిన వాడని విన్నాను. రేపుదయం ఓసారి ముగ్గురం వెళ్ళి ఆయన్ని కలుసుకుందామా!" ఉత్సాహంగా అడిగాడు షేర్ ఖాన్.

"ఈ రోజుల్లో మంత్రాల పేరుతో మనుషుల్ని మోసగించి సొమ్ము చేసుకునే మాంత్రికులు వీధికొకడు బయలేరుతున్నాడు. ఈ మంత్రతంత్రాలను నేన్నమ్మను" బాటిల్ లోని బ్రాందీ గ్లాసులోకి వంచుతూ అన్నాడు భుజంగరావు.

"ఏ పుట్టలో ఏ పాముందో....మహిమలున్న మాంత్రికుడే అయివుండొచ్చుగా ఈ భైరవస్వామి. ఓసారి వెళ్లొచ్చినంత మాత్రంలో ఏమౌతుంది?" అభిప్రాయం వెలిబుచ్చాడు థామస్.

"ఓకే ఫ్రెండ్స్! అలాగే వెళదాం. మీరిద్దరూ రేపుదయం తొమ్మిది గంటలకు రెడీగా వుండండి. నేనొచ్చి కలుస్తాను. ఇక పోదామా" అంటూ పైకి లేచాడు భుజంగరావు.

బిల్ చెల్లించి ముగ్గురూ బయటకొచ్చారు.

థామస్ వెళ్ళి షేర్ఖాన్ కార్లో కూర్చున్నాడు. అతని కారు కాలిపోయిన తర్వాత అవసరమైనప్పుడు షేర్ఖాన్ కారుగానీ....భుజంగరావు కారుగానీ వాడుకుంటున్నాడు.

షేర్ఖాన్, థామస్లు వెళ్ళిపోయారు.

భుజంగరావు కార్లో కూర్చోగానే డోర్ వేసి కారుని ఇంటివైపు పరుగెత్తించాడు రంగా.

# 11

స్నానంచేసి ఒంటికి టవల్ చుట్టుకుని బాత్రూమ్ నుండి తన బెడ్రూమ్లోకి వచ్చింది సుగుణవతి.

సుగుణవతి భుజంగరావుగారి భార్య. మూడు పదుల వయసామెది. బిగిసడలని అవయవ సౌష్టవం. ఒంటిమీద టవల్ తీసి బెడ్ మీద పడేసి బీరువావైపు నడిచింది.

అప్పటికే గదిలోకి వచ్చి తీక్షణంగా ఆమెనే చూస్తున్న పనివాడు బలరామ్ మెల్లగా అడుగులు ఆమెవైపు వేశాడు.

చీర, జాకెట్ బయటకుతీసి తలుపు వేస్తూ....అద్దంలో తన వెనక నిలబడివున్న బలరామ్ ప్రతిబింబం చూడగానే

అదిరిపడి చేతిలోని చీర గబగబా వంటికి చుట్టుకుంటూ పట్టరాని కోపంతో వాడ్ని తిట్టసాగిందామె.

ఆమె తిట్లను లెక్క చేయకుండా వంటిమీద చీరలాగి దూరంగా విసిరేశాడు బలరామ్.

తప్పించుకు పారిపోబోతున్న సుగుణవతిని రెండు చేతులతో ఎత్తి బెడ్‌మీద విసిరి మీదపడ్డాడు.

కొండచిలువలా చుట్టుకుపోయిన ఆ కబంధ హస్తాల నుండి బయటపడలేక అరుస్తోంది సుగుణవతి.

కిచెన్ రూమ్‌లో చాకుతో ఉల్లిపాయలు తరుగుతోన్న వంటవాడు సింగ్....సుగుణవతి అరుపులు విని ఉల్లిపాయలు వదిలిపెట్టి ఆమె గదివైపు పరుగులుతీసి— "అమ్మగారూ!....అమ్మగారూ....!" అంటూ తలుపులు బాదసాగాడు.

ఆవేశంతో ముద్దులు పెడుతున్న బలరాం ముఖాన్ని రెండు చేతులతో ప్రక్కకి నెడుతూ—"ఒరేయ్ సింగ్! త్వరగా రారా! ఈ బలరామ్‌గాడు నన్ను నాశనం చేస్తున్నాడ్రా" అంటూ గోల పెట్టసాగింది.

అదే క్షణంలో కారు దిగిన భుజంగరావు భార్య అరుపులు విని, మళ్ళీ యే ఉపద్రవం ముంచుకువచ్చిందో అనుకుంటూ గబగబా లోపలకు పరుగెత్తాడు. వెనకే వెళ్ళాడు రంగా కూడా.

గది బయట నిలబడి తలుపులు బాదుతున్న సింగ్‌ను చూడగానే...."ఏమైందిరా!" అంటూ ఆతృతగా అడిగాడు భుజంగరావు.

"బలరామ్‌గాడు అమ్మగార్నేదో చేస్తున్నాడండి" కంగారుగా చెప్పాడు సింగ్.

"ఒరేయ్ బలరామ్ బాస్టర్డ్! మర్యాదగా బయటకురా.

లేకపోతే చంపేస్తాను" అరుస్తూ పిచ్చిగా తలుపులు బాదసాగాడు భుజంగరావు.

సుగుణవతి ఎంత పెనుగులాడినా లాభం లేకపోయింది. బలరామ్ బలానికి లొంగిపోయింది. ఓడిపోయింది.

యెంతకూ బలరామ్ తలుపులు తీయక పోయేసరికి వాటిని పగలకొట్టి లోపలకు వచ్చారు భుజంగరావు, రంగా, సింగ్ లు.

తృప్తిచెందిన ముఖంతో తన భార్యమీద పడుకుని వున్న బలరామ్‌ని చూడగానే..అతని గుండెల్లో తుపాకి తూట్లు పడినట్లు అలాగే ఆగిపోయాడు.

అప్పటికే తేరుకున్న రంగా, సింగ్ లు అరుస్తూ బెడ్ వైపు వెళ్ళారు.

జుత్తు పట్టుకుని పైకిలేపి ఈడ్చి డొక్కలో గుద్దాడు రంగా. ఆ విసురుకు గోడకు గుద్దుకుని కుప్పలా క్రింద కూలాడు బలరామ్.

మత్తు వదలిన వాడిలా "ఏం జరిగిందా!" అన్న అయోమయం నుండి బయటపడేసరికి....సింగ్ చేతిలోని చాకు బలంగా బలరామ్ పొట్టలో దిగింది.

"ఆమ్....మ్....మ్...." అంటూ గిలగిలా తన్నుకుంటూ తనని పొడిచిన సింగ్ వైపు చూశాడు బలరామ్.

ప్రాణం పోబోతున్న అంత బాధలోకూడా ఆ దృశ్యం బలరామ్ గుండెల్లో రక్తాన్ని గడ్డ కట్టించేదిగా కన్పించింది.

భయంకరంగా రక్తం ఓడుతున్న ముఖంతో ఒక కన్ను ఊడి నరంతో బయటకు వ్రేలాడుతూ... వళ్ళంతా కత్తిపోట్లుగా వుండి, వాటినుండి రక్తం కారుతూ, తెగిన పొట్టలోనుండి ప్రేగులు బయటపడి, ఓ చేత చాకు

పట్టుకుని వికృతంగా నవ్వుతూ కనిపించిన పృధ్వీరాజ్‌ని చూసి గజగజలాడాడు బలరామ్.

అతని శరీరంలో ఇష్టమొచ్చినట్లుగా దిగుతూనే వుంది సింగ్ చేతిలోని చాకు.

బలరామ్ ప్రాణాలు గాలిలో కలిసిపోయాయి. ప్రాణం పోయినా ఆ కళ్ళు సింగ్ వైపే భయంగా, బెదురుగా చూస్తున్నాయి.

ఇంతలో ఊహించిన విధంగా...తన కాలరు పట్టుకుని పైకి లేపుతున్న సింగ్ వైపు తెల్లబోయి చూశాడు రంగా.

భయంకరాకృతితో నున్న పృధ్వీరాజ్ తనని పైపైకి లేపుతుంటే భయంతో గట్టిగా అరుస్తున్నాడు రంగా.

అంతే—తిరుగుతున్న సీలింగ్ ఫ్యాన్ రంగా మెడని త్రెగగొట్టింది. రక్తం గోడలనిండా చిమ్మింది. మొండెం క్రిందపడి గిలగిలా కొట్టుకోసాగింది.

జరుగుతున్నదంతా చూస్తూ నిశ్చేష్టుడై పోయాడు భుజంగరావు.

సింగ్ బలరామ్‌ని చంపాడంటే అర్థం వుంది. అకారణంగా రంగానికూడా యెందుకు బలితీసుకున్నాడో భుజంగరావుకు అర్థం కాలేదు. తెల్లబోయి సింగ్‌నే చూస్తుండిపోయాడు.

రంగా మొండెంలో కదలిక ఆగిపోయింది. అప్పుడు తల త్రిప్పి భుజంగరావు వైపు చూసి చిన్నగా నవ్వాడు సింగ్.

ఆ నవ్వు యెంతో క్రూరంగా కన్పించింది భుజంగరావుకు.

మెల్లగా సుగుణవతి వైపు నడిచాడు సింగ్.

పైకి లేవబోతున్న సుగుణవతిని రెండు చేతులతో బంధించి గాఢంగా ముద్దుపెట్టుకున్నాడు.

ఆ దృశ్యం చూసిన భుజంగరావు గుండెల్లో భగ్గున మండాయి మంటలు. "డర్టీ బాస్టర్డ్స్! నా ఉప్పు తిని బ్రతుకుతూ నాకే ద్రోహం తలపెడతారట్రా....?" అని తిడుతూ క్రిందపడి వున్న చాకు తీసుకుని, తన భార్యను అక్రమించాలని ప్రయత్నిస్తోన్న సింగ్ వైపు నడవబోయాడు భుజంగరావు.

ఒక్కసారిగా ఒళ్ళు జలదరించినట్లయి అంగుళం కూడా కదల్లేక పోయాడు. చాకు క్రింద పడిపోయింది.

తనని కదలనీయకుండా పట్టుకున్న దెవరా! అని చూసిన భుజంగరావు... రాగిణి భయంకరాకృతిని చూసి వెర్రికేకలు పెట్టాడు. అది గొంతునుండి బయటపడలేదు.

"భయపడకు భుజంగరావ్! ఓ ఆడదాన్ని రాక్షసంగా చెరుస్తుంటే చూసి ఆనందించటం నీకు అలవాటేగా. సంతోషంతో చిందులు వేయక ఆవేదనతో ఎందుకలా అలమటిస్తావు?....ఆ నలిగిపోతుంది నీ భార్య అనా!....ఇతరుల భార్య అయితే ఫర్వాలేదా?" ఎగతాళిగా నవ్వింది రాగిణి.

ఆ నవ్వు అతని గుండెల్లో హోరెత్తిస్తోంది.

"ప్లీజ్! రాగిణీ....ఇంకెన్ని బాధలు పెడతారు మీరిద్దరూ....హాయిగా చంపేయకుండా ఇలా హింసించి చంపటం అన్యాయం" ఏడుస్తూ అన్నాడు భుజంగరావు.

"ఆ రోజు మీరు ఇలాగే చేస్తున్నప్పుడు 'అన్యాయం' అన్పించలేదా మీకు?....మీకైతే అన్యాయం, మాకైతే న్యాయమా!" భుజంగరావు చెంపల్ని యెడా పెడా వాయిస్తూ సమాధానమిచ్చింది రాగిణి.

ఏం మాట్లాడలేనట్లు, ఎదురుగా తన భార్యను రాక్షసంగా చెరుస్తోన్న సింగ్ ని చూడలేక కళ్ళు మూసుకొని అలాగే వుండిపోయాడు భుజంగరావు.

"సరిగ్గా చూడు భుజంగరావ్! ఆనందం తీర్చుకున్న సింగ్ నీ భార్యను ఇప్పుడేం చేస్తాడో" వ్యంగ్యంగా అంది రాగిణి.

కళ్ళు విప్పి చూశాడు భుజంగరావు.

సుగుణవతి మెడచుట్టూ చేతులు బిగిస్తోన్న సింగ్ ను బండబూతులు తిడుతున్నాడు భుజంగరావు.

"అనవసరంగా తిట్టకు భుజంగరావ్. అతనిప్పుడు నీ వంటవాడు సింగ్ కాదు. నా భర్త ఆత్మ ఆవహించిన సింగ్. నీవెంత గొంతు చించుకు అరచినా నీ మాట వినడు" గరగరా నవ్వుతూ చెప్పింది రాగిణి.

సుగుణవతి ప్రాణాలు కూడా ఆమె శరీరం నుండి వేరయ్యాయి.

పైకి లేచిన సింగ్ కు ఓ క్షణం తర్వాత అక్కడి వాతావరణం అయోమయంగా కన్పించింది.

ఆ అయోమయావస్థనుండి తేరుకుంటుండగానే క్రింద పడివున్న చాకు గాలిలో లేచింది.

ఆశ్చర్యపోయి చూశాడు సింగ్. అంతే—

గాలిలో కదులుతూ లెక్కలేనన్నిసార్లు సింగ్ శరీరంలో దిగింది చాకు.

అరవటానికి కూడా సమయం మిగల్లేదు సింగ్ కు. అచేతనంగా క్రిందకుపడి ప్రాణాలొదిలాడు.

"చూశావుగా భుజంగరావ్! నీ చావూ కొద్ది సెకన్లే" అని రాగిణి అంటూనే అతని గొంతు రెండు చేతులతో బిగించింది.

అదే సమయంలో ఎదురుగా చాకు చేతబట్టి, అదే వికృత భయంకరాకృతితో నిలబడ్డ పృథ్వీరాజ్‌ని చూశాడు.

ఆ చాకు పొట్టలో దిగబడటం కూడా చూసు న్నాడు.

ఓ ప్రక్కన గొంతుచుట్టూ బిగుసుకుపోతున్న రాగిణి చేతులు, మరో ప్రక్క ఇష్టమొచ్చినట్లు తనలో దిగబడు తోన్న చాకు—

"టంగ్."

గడియారం మ్రోగింది.

భుజంగరావు తల వాలిపోయింది.

## 12

భుజంగరావు, అతని భార్య....పనివాళ్ళతో సహా హత్య కాబడ్డారన్న విషయం విని పరుగున వచ్చారు షేర్‌ఖాన్, థామస్‌లు—

జనాల్ని గేటు దాటి లోపలకు రానీయకుండా పోలీసు వాళ్ళు లాఠీలతో గోడచుట్టూ కాపలాగా నిలబడ్డారు.

కారుదిగి లోపలకు వెళ్ళిన షేర్‌ఖాన్, థామస్‌లకు.. పచ్చినెత్తురు త్రాగి అటలాడేంతటి కిరాతకులకు కూడా కళ్ళు జలదరించి కళ్ళు తిరిగి క్రిందపడేంత భయంకరంగా కన్పించాయి శవాలన్నీ.

ఫింగర్ ప్రింట్ ఎక్స్‌పర్ట్సు వాళ్ళు హడావుడిగా ప్రింట్స్‌కోసం గాలిస్తున్నారు. ఫోటోగ్రాఫర్స్ మెడ లోని ఫ్లాష్ కెమెరాస్ "క్లిక్, క్లిక్"మంటూ మెరు స్తున్నాయి.

భుజంగరావు పలుకుబడి వున్నవాడు కావటంతో అతని మరణవార్త, ఆ భయంకర హత్యలు పెద్ద సంచలనం

సృష్టించింది.

నోటమాట రానట్లు నిలబడిపోయిన థామస్, షేర్ ఖాన్‌లను రొటీన్ గా కొన్ని ప్రశ్నలు వేశాడు ఎస్.ఐ.

అన్నిటికీ సమాధానాలు చెప్పారు వాళ్ళు.

ఇంతలో అంబులెన్స్ రావటంతో శవాన్ని తీసుకు వెళ్ళి అందులోకి యెక్కించారు. భుజంగరావు ఇల్లు సీల్ వేసి, ఇద్దరు పోలీసుల్ని కాపలా వుంచి, అంబులెన్స్ వెనకే జీప్‌లో వెళ్ళిపోయాడు ఎస్.ఐ.

చెమట పట్టిన ముఖాలతో కార్లోకి ఎక్కి కాసేపు సేదతీర్చుకున్నారు థామస్, షేర్ ఖాన్‌లు.

"అబ్బా!—చూడలేని దారుణం. అదే రకమైన హత్య లతో మనల్ని పోల్చుకుని చూసుకోలేక పోతున్నాను షేర్ ఖాన్," భయంతో వణికింది థామస్ కంఠం.

ఉలిక్కి పడ్డాడు షేర్ ఖాన్—

"అయితే ఈ హత్యలన్నీ ఆ దయ్యాలే చేశా యంటావా?...." అనుమానంగా అడిగాడు అదురుతున్న గుండెల్ని అదుపులో పెట్టుకుంటూ.

"ఇంకా అనుమానమా! ఆ హత్యలు దయ్యాల పనేనని నమ్మటానికి."

"అయితే ఇక మనం ఈ పేటీ సే లాభంలేదు. త్వరగా వెళ్ళి ఆ భైరవస్వామిని కలుసుకోవాలి. ఈ దయ్యాల్ని నాశనం చేయమని వేడుకోవాలి" స్టీరింగ్ ముందు కూర్చుని స్టార్టు చేస్తూ అన్నాడు షేర్ ఖాన్.

మౌనంగా వుండిపోయాడు థామస్—

సమయం తొమ్మిది.

ఆ సమయానికే ముగ్గురూ కలిసి భైరవస్వామిని కలుసు కోవాలని అనుకున్నారు. కానీ—ఇద్దరే మిగిలారిప్పుడు.

ఊరి చివర్న వున్న స్మశానం ముందు ఆగింది కారు–

అక్కడున్న ఓ పెద్ద మర్రిచెట్టు క్రింద పద్మాసనం వేసుకుని కళ్ళు మూసుకొని ధ్యానంలో వున్నాడు భైరవ స్వామి.

అతని వయసు దాదాపు యాభై అయిదేళ్ళపైనుంటుంది. ముడతలు పడబోతున్న అతని చర్మంలో వృద్ధాప్యం అప్పుడప్పుడే చోటుచేసుకుంటోంది. పొడవుగా ఎదిగిన గడ్డం, విశాలమైన ఫాలభాగం, నుదుటకు, చేతులకు విబూది రేఖలు. మధ్యలో ఎర్రటి కుంకుమ బొట్టు వుండి వింత అందాలతో ఓ దివ్య తేజస్సుతో ప్రభాసిస్తున్నాడు భైరవస్వామి.

మర్రిచెట్టు దగ్గరకు నడిచి తాము తెచ్చిన పళ్ళు, ఫలహారాలు అతని ముందుంచి వినయంగా నిలబడ్డారు థామస్, షేర్‌ఖాన్‌లు.

ఓపికగా అయిదు నిమిషాలు యెదురు చూశారు భైరవస్వామి కళ్ళు తెరుస్తాడని.

కానీ—అతనింకా ధ్యానంలోనే వున్నాడు.

తమ ఉనికి తెలియజేయటానికన్నట్లు చిన్నగా దగ్గాడు థామస్.

ధ్యానభంగమై కళ్ళు తెరిచాడు భైరవస్వామి. ఆ కళ్ళలో ఏదో ఆకర్షణ, ఆ చూపుల్లో ఏదో ప్రశాంతత. చూసేవాళ్ళకు ఆ చూపులు అభయమిస్తున్నట్లు, రక్షణ నిస్తున్నట్లు కన్పిస్తాయి.

ఎదురుగా నిలబడ్డ అపరిచిత వ్యక్తులను తిలకించి, వాళ్ళు రావటానికి కారణం ఊహించాలని కళ్ళు మూసుకున్నాడు.

అతని 'దివ్యదృష్టికి' ముందుగా ఓ అన్యోన్యమైన కొత్త దంపతుల ప్రేమ కదలాడింది.

## 13

అది అమావాస్య రోజు—

ఆకాశం నల్లని చీరకట్టుకున్నట్టుగా వుంది. ఆ చీకటిలో బీచ్ ఒడ్డున చేయీ, చేయీ కలిపి నడుస్తున్నారు పృధ్విరాజ్, రాగిణీలు.

వాళ్ళిద్దరకూ వారం రోజుల క్రిందటే వివాహమైంది. వాళ్ళది లవ్ మ్యారేజ్. వివాహమైన మరునటి రోజునే హనీమూన్‌కు బయల్దేరారు. ఇంకా ఆనందం అంచుల్ని తనివితీరా అందుకోనేలేదు.

పృధ్విరాజ్‌కు ఇరవై ఎనిమిది సంవత్సరాలుంటాయి. హాండ్‌సమ్ పర్సనాల్టీ. రాగిణికి ఇరవై రెండేళ్ళు. బ్రహ్మదేవుడు యెంతో శ్రద్ధగా తీర్చిదిద్ది ప్రాణం పోశాడా ఈ సౌందర్యాన్ని అని అన్పిస్తుంది రాగిణిని చూసిన వారెవకైనా.

"రాగిణీ" పిలిచాడు పృధ్విరాజ్.

"ఊఁ....."

"ఈ గాఢాంధకారమైన చీకటినీ, ఉవ్వెత్తున లేచి పడుతున్న ఈ అలల్ని చూస్తుంటే నీకేమన్పిస్తోంది?" రాగిణి నడుంచుట్టూ చేయివేసి దగ్గరకు తీసుకుని నడుస్తూ అడిగాడు పృధిరాజ్.

"పగబట్టిన కాలనాగు కాటేయటానికి వస్తుందా అన్నట్లు వుందండి" అతని భుజంమీద తలవాల్చి నడుస్తూ అంది.

"మరి భయం వేయటం లేదూ!"

"మీరు ప్రక్కనే వుండగా నాకు భయం దేనికి?"

ఆ మాటలో తనపట్ల ఆమెకున్న దృఢనమ్మకానికి ప్రపంచ విజేతలా పొంగిపోయాడు పృధ్వీరాజ్.

"ఏంతైనా పోలీసాఫీసర్ భార్యవనిపించుకున్నావు" అన్నాడు యెదురుగా కొండరాళ్ళు రావటంతో పైకి ఎక్కి కూర్చుంటూ.

"కేవలం పోలీసాఫీసరేనా, హంతకుల గుండెల్లో వాడల్ని సృష్టించే స్మగర్ల పాలిటి సింహస్వప్నంకూడా" చిన్నగా నవ్వుతూ అతని ప్రక్కకు చేరి కూర్చుంది.

స్మగ్లర్లన్న పదం వినగానే పృధ్వీరాజ్ ముఖం ఒక్కసారిగా పాలిపోయింది. అతని మస్తిష్కంలో భుజంగరావ్, షేర్ ఖాన్, థామస్‌ల ఎరుపెక్కిన కళ్ళతో వున్న రౌద్రరూపాలు గుర్తుకు రాగానే రెండు నిమిషాలు మనసంతా వికలమైపోయింది.

అదే విషయం రాగిణికి చెప్పి, "వాళ్ళని పట్టుకుని ప్రభుత్వానికి అప్పగిస్తుంటే వాళ్ళు ముగ్గురూ యేమని సవాల్ చేశారో తెలుసా?"....అన్నాడు.

తెలియదన్నట్లు తలూపింది రాగిణి.

"ఒరేయ్ పృధ్వీరాజ్! మమ్మల్ని పట్టుకున్నావని మురిసిపోకు. మేము బయటకెలా రావాలో బాగా తెలుసు. బయటపడిన తర్వాత మా దెబ్బ యెలాంటిదో రుచిచూద్దువు. త్వరలోనే వస్తాము. నీ అంతు తేల్చనిదే నిద్రపోము" అన్నారు.

పృధ్వీరాజ్ నోటివెంట ఆ విషయం వినటంతోనే విపరీతంగా భయపడింది రాగిణి. అందువల్లనే కాబోలు... అతని తలను గట్టిగా గుండెలకు హత్తుకుంటూ అంది—

"అలాంటి దుర్మార్గుల జోలికెందుకు పోతారండి. కోరి కొరివి తెచ్చుకునే పన్లకెందుకు దిగుతారు?....మరోసారి

అలాంటి రాక్షసుల జోలికి వెళ్ళనని మాటివ్వండి ప్లీజ్...."

రాగిణి మాటలకు గట్టిగా నవ్వాడు పృధ్వీరాజ్.

"పిచ్చి రాగిణీ! ఆ రాక్షసుల వికటాట్టహాసాలకు భయపడి ఊరుకుంటే ఈ దేశం గతేం కాను?....ప్రజల పరిస్థితేంగాను?.... ఈ వృత్తిలో ఇలాంటి సవాళ్ళను వినటం సహజమే గానీ....ఎప్పుడో తప్ప యెదుర్కొనే పరిస్థితి వుండదులే. నీవేం భయపడకు. అప్పుడే తొమ్మిది దాటినట్లుంది. ఆకలివేస్తోంది. పద పోదాం" పైకిలేచి నిలబడుతూ అన్నాడు.

"నా మాట తప్పించాలని చూస్తున్నారు కదూ!" మూతి ముడుచుకొని అలాగే కూర్చుంటూ అంది.

"నా అనురాగ దేవతి అలకలోని అందం చూసుకునే అదృష్టానికి నోచుకోనీయని ఈనాటి అమావాస్య ఎంతైనా క్షమించరానిదే" అన్నాడు నాటక ఫక్కీలో.

ఆ మాటలకు కిలకిలా నవ్వేస్తూ అతని వెంట నడిచింది రాగిణి.

* * *

చీకట్లను ఛేదించుకుంటూ ముందుకు పరుగులు తీస్తుందో కారు___

ఆ కార్లో భుజంగరావు, థామస్. షేర్‌ఖాన్, మాత్రమేగాక....రంగా, సింగ్, బలరామ్‌లు కూడా వున్నారు.

"మనల్ని చూడగానే వాడి గుండె ఆగిపోతుందేమో!" అనుమానం వ్యక్తం చేశాడు షేర్‌ఖాన్.

"వాడిదంత పిరికి గుండె అంటే నమ్మను" గతంలో ఎన్నో విధాలుగా భయపెట్టినా వేటికీ భయపడక తమని

పట్టుకుని ప్రభుత్వానికి అప్పజెప్పటంతో ఆ నమ్మకానికి వచ్చాడు థామస్.

"ఏది ఏమైనా వాడ్నంత తేలిగ్గా చంపకూడదు. సంఘంలో జైలుకెళ్ళి రాబడ్డ మనుషులుగా మన 'ఇమేజ్' దెబ్బతినేట్లు చేసినవాడ్ని చిత్రహింసల పాల్జేసిగానీ ప్రాణం తీయకూడదు. ఏమంటారు ఫ్రెండ్స్!" షేర్ ఖాన్ థామస్‌లవైపు చూస్తూ అన్నాడు భుజంగరావు.

"నీమాట సరైనదే" తన సమ్మతి తెలిపాడు థామస్.

"అవును. అంతే" షేర్ ఖాన్ కూడా తలపంకించాడు.

కారు బీచ్ గెస్టుహౌస్ వైపు పరుగులు తీయసాగింది.

ఆ బీచ్‌లో దాదాపు నాల్గు గెస్టు హౌస్‌లున్నా ఒకదానికొకటి సంబంధం లేనట్లు దూరంగా విసిరేయబడి నట్లున్నాయి.

గెస్టు హౌస్‌కు కొద్దిదూరంలో ఆగింది కారు.

అందరూ క్రిందకు దిగారు.

రంగా కారు డిక్కీ తెరచి రెండు పొడవాటి కత్తులు ఆరుబార్ల తెల్లని త్రాడు బయటకు తీశాడు. చెరో కత్తిని అందుకున్నారు సింగ్, బలరామ్‌లు.

ముందు భుజంగరావు, షేర్ ఖాన్, థామస్‌లు నడుస్తుంటే వెనుక రంగా, సింగ్, బలరామ్‌లు నడవసాగారు. అందరినీ మరోసారి హెచ్చరించాడు భుజంగరావు.

అప్పుడు సమయం పదకొండు కావస్తోంది—

వరండా మెట్లెక్కి డోర్ ప్రక్కనున్న కాలింగ్ బెల్ నొక్కాడు భుజంగరావు. అతని వెనుకే నిలబడ్డారు మిగిలినవారంతా.

రెండు నిమిషాలు నిశ్శబ్దం.

లోపల స్విచ్ వేసిన శబ్దం.... తలుపు తీయటానికి వస్తున్న అడుగుల చప్పుడు.... బయట వున్న వాళ్ళకు స్పష్టంగా వినపడింది.

అందరూ పొజిషన్‌లో నిలబడ్డారు.

డోర్ "క్లిక్"మని తెరుచుకున్న చప్పుడు రాగానే.. ఒక్కసారిగా లోపలకు త్రోశారు అంతా.

తలుపు 'పెదేల్'మని తగలటంతో రెండు పల్టీలు కొట్టి క్రిందపడ్డాడు పృథ్వీరాజ్. రెండు క్షణాలు మెదడు మొద్దుబారినట్లనిపించింది. తేరుకునేసరికే.... లోపలకొచ్చిన గుండగులు తలుపులు మూసేయటం, పృథ్వీరాజ్‌ను లాక్కెళ్ళి ఓ స్తంభానికి త్రాడుతో బంధించేయటంకూడా జరిగిపోయింది.

ఆ హడావుడికి ప్రక్క గదిలోనున్న రాగిణి గబగబా హాల్లోకొచ్చింది.

తన భర్తని స్తంభానికి కట్టేసివుండటం చూడగానే భయంతో 'కెవ్వు' అరచింది.

వెంటనే రంగా, సింగ్, బలరామ్‌లు రాగిణిని గట్టిగా పట్టుకుని నోరు నొక్కేశారు.

"ఫర్వాలేదు అరవనీయండిరా! గొంతు చించుకున్నా వీళ్ళ ఆర్తనాదాలు ఈ గెస్టుహౌస్ దాటి బయటకు పోవు" అరిచాడు భుజంగరావు.

రాగిణిని వదిలిపెట్టి నిలుచున్నారు వాళ్ళు ముగ్గురూ.

ఒక్క ఉదుటున వెళ్ళి పృథ్వీరాజ్‌ను చుట్టుకుపోయి విలపించసాగింది రాగిణి.

"ఏరా పోలీసాఫీసర్! కటకటాల వెనుక వుండవలసిన వాళ్ళం ఇక్కడికెందుకొచ్చామని ఆశ్చర్యపోతున్నావా?

చెపుతా విను. మా విషయంలో జోక్యం చేసుకోవద్దని మేమంతా ముందునుండే హెచ్చరిస్తున్నా పెడచెవిన పెట్టి మామీద సవాల్ చేశావు—మమ్మల్ని దొంగ రవాణాదారులుగా రెడ్ హేండెడ్‌గా పట్టుకుంటానని అంత పనీ చేశావు.

"మమ్మల్ని పట్టుకునే అధికారం నీకు ప్రభుత్వమే యిచ్చింది. కాదనను. కానీ జైలునుండి మేమిపుడు బయటకు వచ్చామంటే పారిపోయి రాలేదు నాయనా! 'పలుకుబడి'. ఏ ప్రజలైతే ఓట్లువేసి ప్రభుత్వాన్ని చీడపురుగుల బారినుండి కాపాడే భారం నీదేనని నాయకుల్ని యెన్నుకున్నారో .... ఆ నాయకుల పలుకుబడితోనే మేము బయటపడ్డాం. నీది ఉద్యోగ ధర్మం. మాది రాజకీయ ధర్మం.

"నీ ధర్మం ప్రకారం నీవు నడుచుకున్నావు. ఇప్పుడు మా ధర్మం యెలాంటిదో రుచి చూద్దువు" వికటంగా నవ్వాడు భుజంగరావు.

తమ నవ్వును జతకలిపారు థామస్, షేర్ ఖాన్‌లు.

"ఏం చేస్తావు?" కోపంగా అడిగాడు పృథ్వీరాజ్.

"మా మొదటి ధర్మం ప్రకారం నీ విప్పుడు మాకు క్షమాపణలు చెప్పాలి."

"అది జరగని పని."

"ఏమండీ ప్లీజ్! .... వాళ్ళకు ఎదురు తిరగకండి. జరిగిన దానికి 'సారీ' చెప్పుకుని ఈ పరిస్థితినుండి బయటపడదాం. సారీ చెప్పేయండి" కోదిస్తూ వేడుకుంది రాగిణి.

"స్టాపిట్ రాగిణీ! నాకు భార్యవై వుండి యిలాంటి పిరికి మాటలు మాట్లాడుతావా. నా ప్రాణం పోయినా

నాకు లెక్క కాదు. నేను మాత్రం దేశాన్ని దోచుకు తినే ఆ చీడపురుగులకు సారీ చెప్పను సలాం చేయను."

పృధ్వీరాజ్ మాటలు పూర్తికాకుండానే థామస్ చేయి గాలిలో పైకి లేచింది. పృధ్వీరాజ్ చెంపల్ని అటూ, ఇటూ బలంగా తాకింది.

రక్తమంతా ముఖంలోకి వచ్చిందా అన్నంత ఎర్రగా కందిపోయింది పృధ్వీరాజ్ ముఖం.

"రాస్కెల్! ఆయన చెంపమీద చేయి చేసుకుంటావ్రా?"....థామస్ వైపు కలకత్తా కాళిలా వెళ్ళింది రాగిణి.

మధ్యలోనే రాగిణి రెండు చేతులూ వెనక్కి విరిచి పట్టుకున్నాడు భుజంగరావు.

"అంత మంచి పని చేసిన నా మిత్రుడికి "థాంక్స్" చెప్పవలసిందిపోయి.... చేయి చేసుకుంటానికి వెళతావా? మర్యాదగా థాంక్స్ చెప్పేయమ్మా! .... మంచిదానివి కదూ!" రాగిణి ముందుకు వచ్చి వ్యంగ్యంగా అన్నాడు షేర్ ఖాన్.

"మమ్మల్నెందుకిలా హింసిస్తారండీ. ప్లీజ్ వది లేయండి."

రాగిణి ప్రార్థన పూర్తికాకుండానే పృధ్వీరాజ్ పొట్టలో ఎడా, పెడా పొడిచాడు షేర్ ఖాన్.

"మాట దాటేయకు అమ్మడూ! ముందు నా మిత్రుడికి థాంక్స్ చెప్పి. ఆ తర్వాత ఏదైనా మాట్లాడు" కరకుగా అన్నాడు షేర్ ఖాన్.

"ఏమండీ మీ అందరికీ థ్యాంక్స్. మెని మెనీ థ్యాంక్స్. ఇక మమ్మల్ని వదిలేయండి. మీకు పుణ్యముంటుంది" యేడుస్తూనే వేడుకుంది రాగిణి.

"అదీ—నీవు మంచి అమ్మాయివి. నీ మొగుడే మా మాట వినటంలేదు. ఏరా! ఇప్పటికైనా సారీ చెప్తావా?" బుసలు కొట్టాడు భుజంగరావు.

"మీరెన్ని పద్ధతులు ప్రయోగించినా నాతో క్షమాపణలు మాత్రం చెప్పించుకోలేర్రా!" ఆవేశంతో వెల్లువికిన కోపంతో అరిచాడు పృథ్వీరాజ్.

"డియర్ ఫ్రెండ్స్! ఇప్పటికి మనం చూసిన వినోదం చాలు ఇక ఆనందించవలసినదంతా చేతలతోనే. ఇప్పుడు మనం చేయబోయే పనులు చూసిన తర్వాత ఏ పోలీసు ఉద్యోగైనా సరే మన నీడను చూస్తేనే భయపడాలి. అలా చేయాలి ఈ నూతన దంపతుల్ని" అన్నాడు భుజంగరావు.

"ఎలా చేద్దామంటావు?" సందేహం వెలిబుచ్చాడు షేర్ ఖాన్.

"ముందు వీడి నరనరాలూ బాధతో గిలగిల్లాడేలా చేయాలి. వాడ్ని ముట్టుకోకుండానే సుమా!"

"అదెలా సాధ్యం?" మరలా అనుమానం వ్యక్తం చేశాడు షేర్ ఖాన్.

ఓసారి గట్టిగా నవ్వాడు భుజంగరావు. ఆ తర్వాత నవ్వటం ఆపి—"చూడమ్మా! రాగిణీ....నీవో చక్కని చుక్కవు. మర్యాదగా నీవంటిమీద దుస్తులన్నీ విప్పేసి నిలబడు. చక్కనమ్మ చక్కదనం తనివితీరా వీక్షించాలని మా అందరికీ యెంతో ఆరాటంగా వుంది—" వెకిలిగా నవ్వి, రాగిణిని వదిలిపెట్టాడు భుజంగరావు.

"నో....ఆ పని చేయను....చేయను...."వణికిపోతూ పరుగున వెళ్ళి పృథ్వీరాజ్‌ను చుట్టుకపోయింది రాగిణి. ఏడవటాన్కి కూడా ఆమె కళ్ళనుండి నీళ్ళు రావటం

లేదిప్పుడు.

"ఒరేయ్ డర్టీ బాస్టర్డ్స్! రాగిణి ఒంటిమీద చేయి పడిందా మీ అంతు చూస్తాను" పిచ్చిగా అరిచాడు పృథ్వీరాజ్.

"నీ ముఖం. ఎవరు ఎవరి అంతు తేల్చుతారో కొన్ని గంటల్లో నువ్వు, ఆ తర్వాత కొన్ని సెకన్లలో నీ ఆత్మ చూసుకోవాలి. ఏం రాగిణీ!—మా మాట వినవా? వినకపోతే చెప్పు. ఆ పనేదో మేము చేసుకుంటాం. ఎంత సేపు మమ్మల్నిలా వేధిస్తావ్?...." అడుగు ముందుకు వేశాడు భుజంగరావు.

పారిపోవాలని ముందుకురికింది రాగిణి. ప్రతీ తలుపు దగ్గరా కాపలా కుక్కల్లా నిలబడి వున్నారంతా—ఎలా తప్పించుకోవాలా అని ఆలోచిస్తున్నంతలో నే గిర్రున తిరిగి క్రిందపడింది రాగిణి. ఆమె చీరను దూరంగా విసిరేశాడు భుజంగరావు.

పైకి లేవబోతుంటే జాకెట్ సర్రున చించేశాడు థామస్. మిగిలివున్న దుస్తులు తొలగించేందుకు ముందుకొచ్చాడు షేర్‌ఖాన్.

పట్టరాని ఆవేశంతో ఊగిపోతున్నాడు పృథ్వీరాజ్. తాళ్ళు తెగగొట్టుకుని ఆ కిరాతకుల అంతు తేల్చాలని విశ్వప్రయత్నం చేస్తూ ఓడిపోతున్నాడు. చర్మం చిట్లి కారుతున్న రక్తంతో తడిసిన తాడు మరింత గట్టిగా బిగుసుకు పోతోంది.

చేతులు తెగి మండుతున్న బాధకన్నా రాగిణికి జరుగుతున్న అన్యాయం తల్చుకుంటేనే తట్టుకోలేకపోతున్నాడు.

ఆ రాక్షసులు వివస్త్రగా నిలబెట్టి ఏడిపిస్తున్న

రాగిణిని చూడలేక యేడుస్తూ కళ్ళు మూసుకున్నాడు.

ముగ్గురూ ఇష్టమొచ్చినంతసేపు ఆడుకున్నారు రాగిణి సొగసులతో....

వళ్ళంతా గాట్లతో ...రక్తం చిమ్ముతున్న శరీరంతో పాకుతూవచ్చి పృధ్వీరాజ్ పాదల్ని పట్టుకుంది రాగిణి.

"ఏమండీ! చూశారా — ప్రభుత్వాన్ని కాపాడే బాధ్యతగల ఉద్యోగి భార్యనైనందుకు మీరు నాకిచ్చిన బహుమతి."

"నన్ను క్షమించు రాగిణీ!....నీ శీలాన్ని రక్షించలేని అసమర్ధుడైపోయాను. నా కళ్ళముందు నీ శీలం కరిగినప్పుడే నా ప్రాణం పోయింది రాగిణీ!....ఇది ప్రాణంలేని శరీరం. ఏం చెయ్యను" పృధ్వీరాజ్ మనసులోని ఆవేదన బయటకు రాలేదు.

"ఏరా! చూస్తూ నిలుచున్నారే. మీరూ ఆనందించండి. వెళ్ళండి" రంగా, సింగ్, బలరామ్‌లను చూసి గోలాడు భుజంగరావు.

కాట్ల కుక్కల్లా వచ్చి రాగిణిమీద పడ్డారు ముగ్గురూ.

"ఒరేయ్! నా భార్యను హింసించినట్లే మీ భార్యను మీ పిల్లల్ని హింసిస్తాను. మిమ్మల్నందర్నీ ప్రాణాలతో వదిలిపెట్టను" ఎర్రగా అగ్నికణాల్లా మెరుస్తున్న కళ్ళతో తట్టుకోలేనంత టెన్షన్‌తో అనుకున్నాడు పృధ్వీరాజ్.

అదేమీ వినిపించుకోకుండా రాగిణిపై జరుగుతోన్న అత్యాచారాన్ని చూస్తూ ఆనందిస్తున్నారు ముగ్గురూ.

రాగిణి నుండి గర్వంగా లేచారు రంగా, సింగ్, బలరామ్‌లు. కృతజ్ఞతగా ముగ్గురు యజమానులవైపు చూశారు.

"ఏరా! ఆనందం తీర్చుకున్నారుగా. మిగిలిన పని

కానివ్వండి. వెంటనే పని ముగించుకుని మనమిక్కడ్నుండి వెళ్ళిపోవాలి" ఆర్డర్ వేశాడు భుజంగరావు.

"ఓకే సర్!" అన్నారు ఏక కంఠంతో.

ఇంకా హింసించటానికి ఏం మిగిలిందా అని ఆశ్చర్యంగా కళ్ళు విప్పి చూశాడు పృధ్వీరాజ్.

కొన ఊపిరితోన్న రాగిణి మెడచుట్టూ చేతులు బిగిస్తున్న రంగాను చూడగానే.. వెళ్ళి వాడి తల పగల గొట్టాలన్నంత కోపమొచ్చింది పృధ్వీరాజ్‌కు. తనని బంధించిన త్రాళ్ళు అరంగుళం కూడా కదల్నియ్యలేక పోయాయి.

"ఒరేయ్! ఇంకా తీరలేదట్రా మీ కసి....రండిరా. నన్ను కూడా చంపేయండి. నా రాగిణి దగ్గరకే నన్నూ పంపేయండిరా!" పిచ్చిగా అరుస్తున్నాడు పృధ్వీరాజ్.

"వస్తున్నాను ఆగు నాయనా! .... కంగారు పడతా వెందుకు? .... ఆఖరుసారిగా దేవుడ్ని ప్రార్థించుకో. భార్యాభర్తలిద్దరూ కలిసి నీలి విశ్వంలో విహరిద్దురు. రేపు బంగ్లాలో ఈ ఘోరం చూసిన ఏ పోలీసాఫీసరూ ఇకముందు మాలాంటి స్మగ్లర్ల జోలికి రాకుండా జాగ్రత్త పడతాడు. మాక్కావలసిందంతే."

"ఒరేయ్! నన్ను చంపినా నా ఆత్మను చంపలేరు. నేను దయ్యంగా మారైనాసరే—మీ అందరి అంతూ తేల్చుతాను. నా భార్యను హింసించినట్లే మీ భార్యా పిల్లలనూ హింసించి మరీ మీ ప్రాణాలు తీస్తాను. దయ్యమై వస్తాను. మీ అంతు చూస్తాను" అరుస్తున్న పృధ్వీరాజ్ గుండెల్లోకి కస్సున దిగాయి సింగ్, బలరామ్ చేతుల్లోని కత్తులు.

మెరుస్తున్న కళ్లతో రాగిణి మెడను వదిలిపెట్టి వైకి

లేచాడు రంగా.

సింగ్, బలరామ్‌ల కత్తి పోట్లకు పృథ్వీరాజ్ తల యెప్పుడో వాలిపోయింది.

ఒక్క క్షణం వాతావరణం నిశ్శబ్దంగా మారిపోయింది. ఆ నిశ్శబ్దాన్ని చీల్చుతూ గోడగడియారం "టంగ్ టంగ్ ...." మంటూ రెండుసార్లు మ్రోగింది.

సంతోషంగా వెనక్కి తిరిగారంతా—

♦ ♦ ♦

కళ్లు తెరిచాడు భైరవస్వామి—

అతని కళ్ళిప్పుడు యెర్రగా అగ్నికణాల్లా మండుతున్నాయి.

నోరు తెరచి ఏదో చెప్పాలనుకున్నాడు థామస్.

చేయి పైకెత్తి వారించాడు భైరవస్వామి.

"మీరు వచ్చిన కారణం నాకు తెలుసు. లోక కళ్యాణార్థం నేనెన్నో మంచి పనులు చేయటానికి సంవత్సరాల తరబడి నేర్చుకున్న విద్యలు నావి. ఆ విద్యలను దుష్ట సంహారానికే తప్ప, మరెందుకూ వినియోగించలేను. మీ కాలం సమీపించింది. మీ మిత్రుడికి పట్టిన గతే మీకూ కూడా. తప్పదు. తప్పించుకోలేరు. మిగిలివున్న కాలంలో దైవాన్ని తల్చుకోండి. వెళ్ళండి" తీక్షణంగా చూస్తూ చెప్పాడు భైరవస్వామి.

అతని కళ్ళలోని ఎర్రదనాన్ని చూడలేక నిరుత్సాహంగా వెనుదిరిగారు థామస్, షేర్‌ఖాన్‌లు.

"ఆగండి" పిలిచాడు భైరవస్వామి.

టక్కున ఆగారు ఇద్దరూ.

"నా ఆహారం నేనే స్వయంగా సంపాదించుకుంటాను. ఈ పళ్లూ, ప్రసాదాలు, పట్టుకుపోండి" గంభీ

రంగా అన్నాడు.

మారు చెప్పకుండా పళ్ళూ, ఫలహారాలు తీసుకుని వెళ్ళిపోయారిద్దరూ.

# 14

ఆలోచిస్తూ ఒంటరిగా కూర్చున్నాడు థామస్—

అతని మెదడు పనిచేయటం మానేసింది. మృత్యువు యే వైపునుండి కబళించుకొస్తుందోనన్న దిగులుతో ఉదయం నుండీ ఏమీ తినలేదు.

స్నేహితుడు చనిపోయినందుకు బాధతో అలా అయిపోయారనుకున్న సుబ్బు, ఎలీజాలు తండ్రిని హుషారు పర్చాలని ఆ బాధ మర్చిపోయేలా చేయాలని ఎంతగానో ప్రయత్నించారు. తండ్రిలో మార్పు రాలేదు.

సినిమాకు వెళదాం రమ్మని బ్రతిమాలారు.

మీరిద్దరూ వెళ్ళండని, తప్పుకున్నాడు థామస్.

అన్నా చెల్లెళ్ళిద్దరూ కలిసి సెకండ్ షోకి వెళ్ళిపోయారు.

అప్పట్నుండీ సిగరెట్లు కాలుస్తూ .... మృత్యువు గురించి ఆలోచిస్తూ....చిన్న చప్పుడైతే ఉలిక్కిపడుతూ భయపడుతున్నాడు థామస్.

ఇంటి ముందు ఆటో ఆగిన చప్పుడు విని కిటికీనుండి బయటకు చూశాడు థామస్.

రాము గేటు తీయగా....నవ్వుకుంటూ కబుర్లు చెప్పుకొంటున్న ఎలీజా, సుబ్బులు కన్పించారు.

లోపలి కొచ్చిన తర్వాత 'గుడ్‌నైట్' చెప్పుకుని ఎవరి గదిలోకి వాళ్ళు వెళ్ళిపోయారు.

తన గదిలోకి ఎవరూ రారన్న నిర్భయంతో ఎలీజా మాక్సీ ఊడదీసి....నైట్ గౌన్ వేసుకోవటానికి అది

వున్న వైపుకు నడవబోయింది.

ఎదురుగా నిలబడి గుటకలు మ్రింగుతూ కనబడ్డ రాముని చూడగానే అదిరిపడింది.

గభాలున క్రింద పడేసిన మాక్సీని ఒంటికి అడ్డుగా పెట్టుకుంది.

"ఇడియట్! ఎంత ధైర్యంరా నీకు? .... ఇంకో క్షణం ఇక్కడున్నావంటే చంపేస్తాను. గెటవుట్!" పిచ్చిగా అరిచింది. రాము ముఖం చూడాలంటే చచ్చేంత సిగ్గని పించింది ఎలీజాకు.

ఆమె మాటలు పట్టించుకోనట్లే ముందుకు వచ్చి అడ్డు పెట్టుకున్న మాక్సీ లాగి .... దూరంగా విసిరేశాడు రాము.

లాగిపెట్టి రాము చెంపమీద పెడేల్‌మని కొట్టింది ఎలీజా.

ఏమాత్రం బెదరలేదు రాము. రెండు చేతులతో ఎలీజాని చుట్టి పెదాలు తెగేలా ముద్దుపెట్టుకున్నాడు.

సర్రున మండాయి ఎలీజా పెదాలు. నాలుకపై రక్తం తగిలి ఉప్పగా అనిపించింది.

బలమంతా ఉపయోగించి రాము చేతుల్నుండి బయట పడి "డాడీ!" అని గట్టిగా అరుస్తూ తండ్రి గదివైపు పరుగులు తీసింది.

సిగరెట్ కాల్చుతూ దీర్ఘంగా ఆలోచిస్తోన్న థామస్ ఉలిక్కిపడి పైకి లేచేంతలోనే .... నగ్నంగా, పెదాల నుండి కారుతోన్న రక్తంతో ఏడుస్తూ తన గదిలోకి వచ్చిన ఎలీజాను చూడగానే — ఓ సెకను ఆలోచన రాని వాడిలా అలాగే నిలబడిపోయాడు థామస్.

ఎలీజా వెనుకే పరుగులుతీస్తూ వచ్చాడు రాము.

ఏం జరగబోతుందో గ్రహించిన థామస్ ముఖం

ఒక్కసారిగా యెరుపెక్కింది. "బాస్టర్డ్!" అంటూ కోపంగా రామువైపు నడిచాడు.

రాము బలంగా చేయి విసరటంతో గింగిరాలు తిరుగుతూ వచ్చి కుర్చీ ముందు పడ్డాడు. తల కుర్చీకి గట్టిగా గుద్దుకోవటంతో తలంతా దిమ్మెక్కిపోయింది. కదలాలనుకునీ కదల్లేక పోతున్నాడు.

ఎలీజావైపు కోరగా నవ్వుతూ చూశాడు రాము.

"ప్లీజ్ రామూ! నన్నేం చేయకు. నీకు పుణ్యముంటుంది" బ్రతిమాలుకుంటూ ప్రక్క ప్రక్కకు జరుగుతోంది. ఇంకొక్క అడుగు నడిస్తేగానీ ఏపిల్స్ పెట్టి వున్న ప్లేట్‌లోని నైఫ్ తన చేతికి అందదు.

ఎలీజా మనసులో విషయాన్ని గ్రహించినట్లుగా ఒక్కసారిగా యెగిరి ఎలీజామీద పడ్డాడు రాము. అప్పటికే ఎలీజా చేయి పళ్లానికి తగిలి అది క్రిందపడిపోయింది. ఏపిల్స్ తలో మూలకూ దొర్లుకుంటూ వెళ్ళిపోయాయి. క్రిందపడిన నైఫ్ ట్యూబ్‌లైట్ కాంతికి తళతళా మెరుస్తోంది.

తనని కాపాడుకోవాలని వ్యర్థ ప్రయత్నం చేస్తోంది. గట్టిగా అన్న స్టువర్టుని పిలిచింది ఎలీజా.

కదల్లేకుండా నిలబడి వున్న థామస్ ఏడుస్తూ అరుస్తున్నాడు—"ఒరేయ్ స్టువర్టు! త్వరగా రారా!....నీ చెల్లెలి జీవితం నాశనం అయిపోతోందిరా!" అని.

స్టీరియో నుండి వస్తోన్న మ్యూజిక్‌కు అనుగుణంగా అడుగులేస్తోన్న స్టువర్టు తండ్రి, చెల్లెళ్ళ అరుపులు విని, గబగబా వచ్చాడు.

తన చెల్లెలి మానం దోచుకోబోతున్న రాముని చూస్తూనే ఉగ్రరూపంతో వెళ్ళి రాముని ఈడ్చి తన్నాడు.

ఓ పట్టీ కొట్టి క్రింద పడ్డాడు రాము. చేతికి చాకు తగిలింది. దాన్ని చేతిలోకి తీసుకుని విసురుగా స్టువర్టు ముందుకొచ్చాడు రాము.

రాము చేతిలో చాకు చూసి అదిరిపడ్డాడు స్టువర్టు. భయంగా అడుగు వెనక్కి వేయబోతున్నంతలోనే.. రాము చేతిలోని చాకు స్టువర్టు శరీరంలో లెక్కలేనన్ని సార్లు దిగింది.

బాధగా మూల్గుతూ ప్రాణాలు వదిలేశాడు స్టువర్టు.

ఎదురుగా జరిగిన దృశ్యం చూసి గజగజా వణికిపో యింది ఎలీజా. షాక్‌తో తెల్లబోయి అలాగే నిలుచుండి పోయాడు థామస్.

వణికిపోతున్న ఎలీజాని వెనవేసుకున్నాడు రాము.

"ఒరేయ్ రామూ! దాన్నేం చేయకురా. ఇప్పటి వరకూ చేసిన రాక్షసకృత్యం చాలు. దాన్ని వదిలేయరా!" ప్రాధేయపడుతూ విలపించసాగాడు థామస్.

"వినడు థామస్. వినడు. అతనిప్పుడు నీ పనివాడైన రాము కాదు. నా భర్త ఆత్మ ఆవహించిన రాము" తన ప్రక్కనే వినబడ్డ మాటలకు త్రుళ్ళిపడ్డాడు థామస్.

తల త్రిప్పిచూసి ఒక్కసారిగా వణికిపోయాడు.

అదే భయంకరాకృతిలో వున్న రాగిణి ....వికృతంగా నవ్వుతోంది.

ఆ నవ్వు బ్లేడుతో గుండెల్ని మెత్తగా కోస్తు న్నట్లుగా విలవిల్లాడాడు థామస్.

"రాగిణీ! ....నీకు పుణ్యముంటుంది. అదెంత బాధపడు తుందో చూడు. అది చాలా చిన్నది. వదిలిపెట్టమని చెప్పు ప్లీజ్!" ఏడుస్తూ వేడుకున్నాడు.

"ప్చ్! ...ఎంత బాధపడుతున్నావు థామస్?....నీ

కూతురుకన్నా చిన్న వయసు వాళ్ళని నీ జీవితంలో యెంతమందిని నలిపి పారేశావో గుర్తుకు తెచ్చుకో. ఆ కూతుళ్ళ తల్లి దండ్రులు గుండెపగిలేలా ఎలా యేడ్చారో, వాళ్ల బాధ ఎలాంటిదో నువ్వూ అనుభవించవూ?....నీకు లాంగని ఆడపిల్లల్ని బలవంతంగా అనుభవించటంలో ఎంతో థ్రిల్ ఫీలవుతూ ఆనందపడతావుగా. ఇప్పుడు ఆనందపడక అలా యేడుస్తూ కూర్చుంటావెందుకు?" ఎగతాళి చేసింది రాగిణి.

సమాధానం చెప్పకుండా కళ్ళు మూసుకుని యేడుస్తూండిపోయాడు థామస్.

"కళ్ళు తెరవు థామస్. ఇప్పుడు మరో సన్నివేశం చూడు. కోరిక తీర్చుకున్న రాము—నీ కూతుర్ని యేం చేస్తాడో చూడు."

భయంగా కళ్ళు తెరిచాడు థామస్.

ఎలీజా మెడ చుట్టూ చేతులు బిగిస్తూ కన్పించాడు రాము.

"రాగిణీ! దానికి చేసిన అన్యాయం చాలు. దాన్ని అలాగైనా వదిలేయ్. దాన్ని చంపొద్దని చెప్పు" శోకిస్తూ ప్రతిమాలుతున్నాడు థామస్!

"నాశనం చేసిన ఆడపిల్లలను ప్రాణాలతో వుంచటం నీ డిక్షనరీలో నే లేదుకదా! నీ పద్ధతులే మిమ్మల్ని పాటించనీయి థామస్" గరగరా నవ్వింది రాగిణి.

నిర్జీవి అయిన ఎలీజానుండి పైకిలేచాడు రాము.

ఓ క్షణం తర్వాత తల విదిలిస్తూ చూశాడు.

ఎదురుగా నగ్నంగా పడివున్న ఎలీజా, ఓ ప్రక్కన రక్తం మడుగులో శవమైవున్న సుశ్రుత్. మరో ప్రక్క కూర్చుని రోదిస్తున్న యజమాని థామస్.

తన అవతారం చూసుకుని మరింత ఆశ్చర్యపోయాడు రాము. ఆ ఆశ్చర్యంలో వుండగానే.... క్రింద వున్న కత్తి గాలిలో పైకి లేచింది. బలంగా రాము గుండెలో దిగింది. అచేతనంగా నేల వాలిపోయాడు రాము.

తన కళ్ళెదుటే కూతురూ, కొడుకూ, రాము ప్రాణాలు పోగొట్టుకోవటం చూసి థామస్ గుండె మొండిబారి నట్లయింది.

"తీరిపోయిందా మీ కసి?" ఆవేశంగా అరిచాడు థామస్ గాల్లోకి చూస్తూ.

"అప్పుడే ఎలా అయిపోయిందనుకున్నావు థామస్. ఎవరొస్తున్నారో చూడు" అంది రాణిగి థామస్ కంఠం చుట్టూ చేతులు బిగిస్తూ.

భయంకరాకృతితో ఒళ్ళంతా రక్తం కారుతూ తళతళలాడే నైఫ్‌తో వస్తోన్నాడు పృధ్వీరాజ్.

భయంతో గజగజలాడుతున్నంతలోనే పృధ్వీరాజ్ చేతిలోని నైఫ్ బలంగా దిగింది థామస్ పొట్టలో.

థామస్ మెడచుట్టూ వున్న రాగిణి చేతులు కొంచెం, కొంచెం బిగుసుకుంటుంటే .... పృధ్వీరాజ్ చేతిలోని నైఫ్ పదేపదే అతని శరీరంలోని మాంసాన్ని రుచిమాసి వస్తోంది.

"టంగ్ ....టంగ్ ...."

గడియారం రెండు గంటలు కొట్టింది.

థామస్ జీవితం అంతమైంది.

# 15

జరుగుతోన్న దారుణ హత్యలకు పట్టణ ప్రజలు విపరీతంగా భయపడి పోతున్నారు.

పోలీసులకు ఈ మిస్టరీ అర్థం గాకుండా వుంది. చేతి

వ్రేళ్ల ముద్రలన్నీ ఇంట్లో మనుషులవే. కానీ—ఒక్కళ్ళూ మిగలకుండా అందరూ ఛస్తున్నారు. ఇదెలా సాధ్యపడుతుందో అర్థంగాక అయోమయంలో పడిపోతున్నారు. పై అధికారులనుండి వస్తోన్న తిట్ల వర్షం, ఓ ప్రక్క ప్రజలు, మరో ప్రక్క పత్రికలు వాళ్ళ్ని ఏకి వదిలి పెడుతున్నారు. పోలీసాఫీసర్ల బుర్రలు పనిచేయలేక వేడెక్కిపోతున్నాయి.

రెండో స్నేహితుడ్నికూడా దయ్యాలు దారుణంగా చంపాయని తెలుసుకున్న షేర్ ఖాన్ పిచ్చిపట్టినవాడిలా డబ్బంతా సూట్ కేస్ లో సర్దేసుకున్నాడు.

తండ్రి ఎందుకంత హడావుడి పడుతున్నాడో అర్థం కాలేదు నజీమాకు. సూట్ కేస్ పట్టుకుని, నజీమాను లాక్కు వెళుతున్నట్లే కారులో కూర్చోపెట్టాడు షేర్ ఖాన్.

తండ్రి కంగారేమిటో, తనని ఎక్కడకు తీసుకెళుతున్నాడో గ్రహించలేకపోతోంది నజీమా.

నజీమా ఏమడిగినా సమాధానం చెప్పకుండా ఇంటికి తాళం వేసి స్టీరింగ్ ముందు కూర్చుని, కారు వేగంగా పోనిచ్చాడు షేర్ ఖాన్.

అతని ఆలోచన ఒక్కటే—

ఈ దయ్యాలకు దూరంగా పారిపోవాలి. అవి రాలేనంత దూరంగా పారిపోవాలి. అంతే....

కారుని వేగంగా ముందుకు పరుగులు తీయిస్తున్నాడు.

సిటీ లిమిట్స్ దాటింది కారు.

ఉన్నట్లుండి షేర్ ఖాన్ శరీరం ఒక్కసారిగా జలదరించినట్లైంది. రైట్ హ్యాండ్ సైడ్ కు టర్నింగ్ చేయాలనుకున్న షేర్ ఖాన్ ఇప్పుడు గతుకుల రోడ్డుగా వున్న

లెఫ్ట్‌హ్యాండ్ సైడ్‌కు పోనిచ్చాడు.

చుట్టూ పెద్ద పెద్ద కొండలతో గతుకులుగా వున్న, అసలు మార్గమే లేనట్లున్న దారిలో.... గాలిలో తేలుతున్నట్లుగా పోతోంది కారు.

ఈ కొండల్లోకి ఎందుకు పోనిస్తున్నాడా తండ్రి అని మరింతగా ఆశ్చర్యపోయింది నజీమా.

"ఢాం" అన్న శబ్దంతో కొండంతా మారుమ్రోగింది.

పెద్ద కుదుపుతో కారాగిపోయింది.

తల విదిలిస్తూ చూశాడు షేర్‌ఖాన్. అసలు కారు ఆ ప్రదేశానికి ఎలా వచ్చిందో అర్థంకాలేదు.

ఓ పెద్ద బండ ప్రక్కన నీడలో మందు పార్టీ చేసుకుంటున్న పదిమంది కిరాయి రౌడీలు "ఢాం" అన్న శబ్దానికి ఉలిక్కిపడి బండరాళ్ళ ప్రక్కకు తప్పుకున్నారు.

పోలీసులెవరైనా వచ్చారేమోనని భయపడి, బండరాళ్ళ ప్రక్కనుండి తల బయటకు పెట్టి క్రిందకు చూశారు.

మెరుపు తీగలాంటి నజీమా డోర్ తెరచుకు దిగటం చూసి అందరూ తెగ ఉత్సాహపడిపోయారు.

"ఒరేయ్! పార్టీలోకి పిట్ట కూడా వుంటే భలే పసందుగా వుంటుందిరా!" అన్నాడు వాళ్ళలో ఒకడు.

అంతే—అందరూ గబగబా నజీమావైపు పరుగులెత్తారు.

'కారు ఇటు తీసుకురావటం దయ్యం పనేనా' అని భయపడుతూ ఆలోచిస్తోన్న షేర్‌ఖాన్—"డాడీ!" అంటూ అరచిన నజీమావైపు చూశాడు.

పదిమంది గుండగులు నజీమాను బండరాళ్ళ వైపు లాక్కువెళ్ళటం చూసి, ఉద్రేకంతో అరుస్తూ వెళ్ళి

వాళ్ళమీద పడ్డాడు.

రౌడీలందరూ కలసి ఇష్టమొచ్చినట్లు తన్ని....తన్ని.. వదిలారు షేర్ ఖాన్ని.

విరిగిపోయిన కీళ్ళతో లేవలేక, బాధతో అవస్థపడు తోన్న షేర్ ఖాన్ని చూసి పగలబడి నవ్వారు అంతా.

ఆ తర్వాత—ఏడుస్తూ చిందులేస్తున్న నజీమా వంటి మీద దుస్తులు ఒక్కొక్కటే వలిచేస్తున్న ఆ రౌడీలను వద్దని వారించలేక, వాళ్ళందరి ముందూ నగ్నంగా నలబడి ఏడుస్తున్న కూతుర్ని చూడలేక కళ్ళు మూసుకున్నాడు షేర్ ఖాన్.

ఆ కళ్ళనుండి టపటపమంటూ రాలిపడ్డాయి కన్నీటి బొట్లు.

"ఛీ!....ఏడుస్తున్నావేమిటి షేర్ ఖాన్?" ఎగతాళి చేస్తూ పలికింది రాగిణి కంఠం.

చూస్తే గుండె ఆగిపోతుందేమోనన్న భయంతో కళ్ళు తెరవలేదు షేర్ ఖాన్.

"నేను కనపడను. కళ్ళు తెరువు షేర్ ఖాన్! పదిమంది కలిసి ఓ ఆడదాన్ని అనుభవిస్తుంటే చూసి ఆనందించటం నీ హాబీకదా! మరెందుకు చూడవు?....నీ కూతురనా....?

'రేప్' అనేది ఎంత దారుణమో, ఆడదానివై వుండి నిన్ను పదిమంది కలిసి అనుభవిస్తుంటే తెలిసేది నీకు. పోనీయ్ లే!....నీ రక్తం పంచుకు పుట్టిందేగా—ఇప్పుడు తనకన్నా నీకే ఎక్కువ బాధ. అవునా!"

"ప్లీజ్ రాగిణీ....దాన్ని ఆ దుండగుల బారీనుండి కాపాడు అని చెప్పను. దాని ప్రాణం తీసేయ్. గంటల తరబడి అది ఆ హింసకు గురికాబడి చచ్చేకన్నా, ఒక్క

క్షణంలో దాని ప్రాణం పోయే మార్గం చూడు" కళ్ళు తెరవకుండానే రోదిస్తూ వేడుకున్నాడు షేర్ ఖాన్.

"అబ్బో!....ఫర్వాలేదే. నీలో ఇంతటి మానవత్వం ఎలా వచ్చింది షేర్ ఖాన్? 'ఆరోజు' నన్ను మీరంతా కలసి ఇలాగే హింసిస్తూ ఆనందించిన రోజు ఈ వివేకం ఎక్కడ నిద్రపోయింది?....అయినా నేనూ ఆడదాన్నే. ఆ నరకం ఎలాంటిదో చవిచూసిన దాన్ని. నీవు కోరినట్లే చేస్తాను."

"థ్యాంక్స్ రాగిణీ... థ్యాంక్స్. మెనీ.... మెనీ.... థ్యాంక్స్."

"చూశావా! నీ కూతురు ప్రాణం తీసికూడా నీతో థాంక్స్ ఎలా చెప్పించుకున్నానో" వికృతంగా నవ్వింది రాగిణి.

"ఒరేయ్! పిట్ట సచ్చిందిరా" బాధగా అరిచాడెవడో.

"పదిమందీ ఒక్కసారే మీదపడితే సావక బతుకద్దేట్రా?" విసుగ్గా అన్నాడు మరొకడు.

"ఇక ఇక్కడుండొద్దురా, పోదాం. పదండెహే" మరొకడి కంగారు.

"కళ్ళు విప్పి చూడు షేర్ ఖాన్! మరో దృశ్యం కనపడుతుంది. వాళ్ళంతా వెళ్ళిపోతారే....నీ ప్రాణం తీసి. ఆఖరుసారిగా ఈ విశాలమైన రంగుల ప్రపంచాన్ని తనివితీరా చూడు" రాగిణి మాటలకు అదిరిపడి కళ్ళు తెరిచాడు.

ఎదురుగా నేలమీద వళ్ళంతా గాట్లతో, రక్తం ఓడుతోన్న శరీరంతో ప్రాణంలేకుండా పడివున్న నజీమా శవం.

గుంపుగా నిలబడి వాళ్ళలో వాళ్ళే ఏవో గుసగుసలు చెప్పుకుంటున్న దుండగులూ కన్పించారు.

"మనం వెళ్ళిపోతే ఈ దెళ్ళి పోలీసులకు చెప్పి మన్ని పట్టించదూ!"

"అయితే ఈడ్ని కూడా యేసేద్దాం" గరగరమంది ఒకడి కంఠం.

"అదే మంచిది. ఏసేయ్‌రా!" వాడ్ని ప్రోత్సహించాయి మిగిలిన కంఠాలు.

ప్రక్కనే వున్న పెద్ద బండరాయి రెండు చేతులతో పైకెత్తి క్రింద కూర్చుని మూల్గుతూ చూస్తోన్న షేర్ ఖాన్ వైపు నడిచాడు ఆ దుండగుడు.

రక్తం కారుతోన్న శరీరంతో ఓ కన్ను ప్రేగి నరంతో బయటకు వ్రేలాడుతూ, పొట్టలోనుండి ప్రేగులు బయటకొచ్చి అతి భయంకరంగా వున్న పృధ్వీరాజ్ .... రెండు చేతులతో బండరాయి ఎత్తి తనవైపు రావటం చూసి షేర్ ఖాన్ గుండెలు భయంతో గుభిల్లుమన్నాయి.

ఆ ఆకృతిని చూడలేక గట్టిగా కళ్ళు మూసుకున్నాడు.

బండరాయి షేర్ ఖాన్ బుర్రమీద 'టపేల్'మని పడింది.

మూసిన కళ్ళు మరి తెరవలేదు షేర్ ఖాన్—

* * *

తమని దారుణంగా హింసించి చంపిన, దేశానికి చీడ పురుగుల్లాంటి వ్యక్తులయిన భుజంగరావు, థామస్, షేర్ ఖాన్‌లను చంపి తమ ప్రతీకారం తీర్చుకున్న పృధ్వీరాజ్, రాగిణిల ఆత్మలు శాంతించి పంచభూతాల్లో కలిసిపోయాయి.

—: అయిపోయింది :—

# మంత్రి కూతురు

## మిస్ కె. మధుబాల

రాజారామ్ భోజనం చేశాడు. తన కోటు జేబు తడిమి చూసుకున్నాడు. జేబు ఖాళీగా వుంది. అక్కడ వుండవలసిన 26 రూపాయిలు లేవు!

"సాధనా!" పిల్చాడతను.

అతడి భార్య సాధన గబగబా వచ్చింది.

"నా జేబులో 26 రూపాయిలు వుండాలి. నువ్వు తీశావా?" అడిగాడతను.

"నేను తియ్యలేదు" అందామె.

"అయితే ఆ డబ్బు ఏమైంది?" అర్చాడతను.

కోటు జేబుల్లో ఆమె వెతికింది. జేబుల్లో డబ్బులేదు.

కమ్యూనిటీ హాలు ఎదురుగా అతడు హాట్ టీ అమ్మితే ఆ డబ్బు అతడికొచ్చింది. ఆ డబ్బు పోతే మర్నాడు అతడు టీ అమ్మలేడు!

డబ్బుపెట్టి పాలపాకెట్లు కొనాలి. రేపు ఎలా తన వ్యాపారం నడపడం?

రాజారామ్ ఆలోచిస్తూ తన అరడజన్ పిల్లలవైపు చూశాడు. ముగ్గురు కొడుకులు, ముగ్గురు కూతుళ్ళు. వాళ్ళలో యెవరో తీయకపోతే ఆ డబ్బు తన జేబు లోంచి మాయం కాదు! ఎవరు తీశారు?

అతడు ఉగ్రుడయ్యాడు. పిల్లలవైపు కోపంగా చూశాడు.

"నా కోటు జేబులోని డబ్బు మీ రెవరేనా తీస్తే, వెంటనే ఒప్పుకొని యిచ్చేయండి" అర్చాడతను.

"నేను తీయలేదు" అన్నాడు పెద్దకొడుకు.

"నాకేమీ తెలియదు" అన్నాడు రెండోవాడు.

"మీ కోటు దగ్గరకు నే వెళ్ళలేదు" అన్నాడు మూడోవాడు.

"మేం మీ కోటును ముట్టుకోలేదు" అన్నారు ముగ్గురు ఆడపిల్లలూ.

తన రెండో కొడుకు రంజన్ మీద అతడి చూపు నిల్చింది. రంజన్ వయస్సు పదిహేను సంవత్సరాలుంటుంది. ఇంతకుముందు అతడు తండ్రి జేబులోంచి చిల్లర తీసుకన్నాడు.

"ఒరే వెధవ నిజం చెప్పు!" అర్చాడు తండ్రి.

రంజన్ ఏడ్వడం మొదలెట్టాడు. తన నిక్కర్ జేబు లోంచి యిరవై రూ·పాయిలుతీసి బయట పడేశాడు.

"ఇంకా వుండాలి లాగు!" అన్నాడు తండ్రి.

"ఆరు రూపాయిలు ఖర్చయిపోయింది. నేనూ నా ఫ్రెండ్సూ లడ్డులు, వడలు తినేశాం" అన్నాడు రంజన్.

కొడుకువంక కోపంగా చూశాడు తండ్రి. రెండు చంపలనూ వాయించాడు.

"అయిందేదో అయింది. వాడిని చంపేయకండి" అంది సాధన.

"ఇటువంటి యింటి దొంగ చావాలి" అన్నాడు రాజారామ్.

రంజన్ తండ్రి దెబ్బలకు ఏడుస్తూ వెనక్కి జరుగుతున్నాడు.

"ఈ వెధవకు మూడు రోజులు తిండి పెట్టకు!" అర్చాడు రాజారామ్.

"తెలియక పిల్లలు మీ జేబుల్లోని డబ్బు తీసుకుంటూనే వుంటారు. ఆ మాత్రం దానికి వాడిని అంతగా కొట్టాలా?" అంది తల్లి బాధతో.

రాజారామ్ మాట్లాడకుండా పక్కనున్న తన గదికి వెళ్ళిపోయాడు. చాపమీద పడుకున్నాడు. ఎవరి చెయ్యో అతడిమీద పడింది. పక్కకు తిరిగి చూశాడు.

తన భార్య సాధన చాపమీద కూర్చుని వుంది!

"చూడండి! ఒకప్పుడు మీరు పెద్ద బ్రతుకు బతికారు. పెద్ద ఉద్యోగం చేసేవారు. నెలకు మూడువేలు ఆర్జించేవారు. ఆ ఉద్యోగం పోయింది దిక్కులేక యీనాడు టీ అమ్ముకుని బ్రతుకుతున్నాం" అందామె కన్నీళ్ళతో.

"కడుపులు బళ్ళవుతాయి!" అన్నాడతను.

"పేదరికం దాపరించాక మీలో కోపం ఎక్కువయిపోయింది. ప్రతి చిన్న నేరానికీ పిల్లలను కొట్టేస్తున్నారు!"

"దొంగతనం నాకు నచ్చదు! అది నచ్చకే నేను టీ అమ్ముకు జీవిస్తున్నాను."

"మెల్లిగా చెప్పే వాడు తెలుసుకుంటాడు. అలా కొడ్తే మొండివాడై పోతాడు."

"వాడెలా పోతే నాకేం?" అన్నాడతను విసుగ్గా.

ఆమె అతడి చెయ్యి నిమిరింది.

"చిన్నతనంలో వాడు మీరు కొన్న గ్లాసును పగల గొట్టాడు. అప్పుడు మీరు ఏమన్నారో గుర్తుందా?" అడిగిందామె.

"బాగా జ్ఞాపకం వుంది. అప్పుడు చేతులో బాగా డబ్బుంది. మరో గ్లాసు కొనగలను. అందువలన వాడిని తిట్టొద్దన్నాను. ఈనాడు పరిస్థితులు వేరు. ఇప్పటి పరిస్థితులనుబట్టి మనం ప్రవర్తిస్తాం" అన్నాడతను.

క్షణకాలం వాళ్లు నిశ్శబ్దంగా వుండిపోయారు. అతడు ఒక ఎలక్ట్రికల్ కంపెనీకి మేనేజర్‌గా వుండేవాడు. కారులో తిరిగేవాడు. అతడికి గుర్రప్పందాలంటే మహాపిచ్చి. కంపెనీ డబ్బును యాభై వేలు పైగా అతడు వాడేశాడు. దానితో అతడు కష్టాల పాలయ్యాడు.

కంపెనీ యజమాని అతడిని పోలీసులకు అప్పగిస్తానన్నాడు. అలా కాకుండా వుండాలంటే కంపెనీ డబ్బును వాపసు చేయమన్నాడు. రాజారామ్ ఉద్యోగం వదిలేశాడు. గ్రేట్యూటీ, ప్రావిడెంట్ ఫండ్ మొత్తం నలభై వేలు వచ్చింది. అదంతా కంపెనీకిచ్చేశాడు. భార్య నగలూ, యింట్లోని వస్తువులూ అమ్మేసి మరో పదివేలు చెల్లించి తన గౌరవాన్ని కాపాడుకున్నాడు.

అటుపైన అతడికెక్కడా ఉద్యోగం దొరకలేదు. మూడు నెలలపాటు యింట్లో తింటూ కూర్చున్నాడు. వున్నవన్నీ ఎగిరిపోయాయి!

అప్పుడు టీ అమ్మకం ప్రారంభించాడు, మరేం గత్యంతరంలేక. పిల్లల చదువులు దెబ్బతిన్నాయి. ఫీజులు కట్టలేక, పుస్తకాలు కొనలేక పిల్లలు చదువులకు స్వస్తి

చెప్పకలసి వచ్చింది.

ఆనాటి రాత్రి అందరూ తిన్నారు, రంజన్ తప్ప. వాళ్ళు తినేటప్పుడు రంజన్ బయటకు వెళ్ళిపోయాడు. రోడ్డు వారగా వున్న రాయి మీద రామ్ కూర్చొని వున్నాడు. అతడి పక్కకు చేరాడు రంజన్. రామ్ వయస్సు పదమూడుంటుంది.

"ఒరేయ్, రామ్, తిండి తిన్నావా?" రంజన్ అడిగాడు.

"నాన్న తాగొచ్చాడు. అమ్మ ఏమీ వండలేదు. వాళ్ళిద్దరూ ఏదో తగువులాడుకుంటున్నారు. నాన్న నన్ను తన్నుతాడని భయపడి యిలా వచ్చేశాను."

"ఆకలిగా వుందా?" అడిగాడు రంజన్.

"పేగులు అరుస్తున్నాయి."

"అయితే పద."

"నీ దగ్గర డబ్బుందా?"

"పద చెప్తాను."

కొంచెం దూరం నడిచి యిద్దరూ లక్ష్మి హోటల్లోకి వెళ్ళారు. గులాబ్ జాములు తిన్నారు. మసాలా దోసెలు భుజించారు. పూరీలు, కూర నమిలేశారు. కాఫీ తాగారు. బిల్లు 4-50 అయింది. గ్లాసులో వున్న నీళ్ళు రంజన్ తాగేసి రామ్‌వైపు చూశాడు.

"నా జేబులో ఖాళీ పర్సు వుంది. బిల్ చెల్లించడానికి నేను పర్సు పైకి తీస్తాను. నా పర్సు లాక్కొని నువ్వు బయటకు పారిపో. నిన్ను పట్టుకోడానికి నేను పరుగెత్తాను. అలా యిద్దరం పారిపోదాం" అన్నాడు రంజన్.

"గొప్ప ఐడియారా!" అన్నాడు రామ్.

రంజన్ కౌంటర్ వెనుక కూర్చున్న హోటల్ యజమాని ముందుకు నడిచి పర్స్ పైకి తీశాడు. వెనుకనున్న రాము ఆ పర్సు లాక్కుని బయటకు పారిపోయాడు.

"దొంగ రాస్కెల్! వుండండి సార్ యిప్పుడే తిరిగొచ్చి డబ్బిస్తాను" అని రంజన్ బయటకు పరుగెత్తాడు.

తన ముందు పడేసిన బిల్ పట్టుకొని హోటల్ యజమాని అతడి రాకకోసం యెదురుచూస్తున్నాడు. చివరికి విసుగెత్తి "రత్నం!" అని పిల్చాడు.

"సార్" అన్నాడు రత్నం.

"బిల్లు చెల్లించకుండా ఒకడు బయటకు పారిపోయాడు. పరుగెత్తికెళ్ళి చూడు!" అర్చాడు హోటల్ యజమాని.

రత్నం బయటకు వెళ్ళాడు. అతడు రోడ్డు కిరువైపులా చూశాడు. పరుగెడ్తూన్న ఏ మనిషీ కనబడలేదు. రత్నం లోపలకు నడిచాడు.

"ఎవ్వరూ లేరు సార్" అన్నాడు రత్నం.

మరో వ్యక్తిని తన సీటులో కూర్చోమని హోటల్ యజమాని రోడ్డంతా నడిచి వెతికాడు. కాని ఎక్కడా వాడు కనపడలేదు. వాడిని తిట్టుకుంటూ హోటల్ కి చేరుకున్నాడు యజమాని.

"పర్సు కొట్టేసినవాడూ, అతడూ కలిసి అలా నన్ను మోసం చేశారు. డర్టీ రోగ్స్!" అన్నాడు హోటల్ యజమాని తన సీట్లో కూర్చున్న మనిషితో.

## 2

రంజన్ యింటికి చేరుకున్నాడు. ముందు తలుపుమీద తట్టాడు. అతడి తల్లి తలుపు తెర్చింది.

"ఎక్కడకి పోయావురా?" అంటామె.

"ఇంట్లో వుంటే నాకొచ్చేవి దెబ్బలేగా! అందుకని

అలా తిరిగివచ్చానమ్మా!" అన్నాడతను.

"మీ నాన్న పడుకున్నారు. వంట గదిలోకి పద. నీకోసం భోజనం వుంచాను" అందామె.

"ఆకలిగా లేదు."

"ఎక్కడేనా తిన్నావా?"

అతడు జవాబివ్వలేదు.

"చెప్పరా!"

"హోటల్లో తిన్నాను."

"డబ్బు ఎలా వచ్చింది?"

"డబ్బివ్వలేదు. హోటల్ వాడి ముఖాన్నే బిల్ పడేసి పారిపోయాను. ఎవ్వరూ నన్ను పట్టుకోలేదు."

"అలా ఎంతకాలం సాగుతుంది? ఎప్పుడో ఒకనాడు పట్టుబడ్తావు!"

"అప్పుడు చూద్దాం."

"చూడు, రంజన్! మీ నాన్నగారు యిప్పుడు చితికి పోయినా ఒకప్పుడు గొప్పగా బ్రతికారు. నిన్ను పోలీసులు అరెస్టుచేస్తే ఆయనా, నేనూ తలలు దించుకోవాలి" అందామె.

"ఒకప్పుడు మనం ఎలా వున్నా యీనాటి మన స్థితి చండాలంగా వుందమ్మా. కట్టుకోడానికి గుడ్డల్లేవు, తిన డానికి తిండిలేదు. మన పరిస్థితి బాగుపడ్తుందనే నమ్మకం లేదు నాకు."

"పిల్లలు పెద్దాళ్ళయితే మీరూ గడిస్తారు. మనస్థితి బాగుపడ్తుంది. ఆ దేవుడు మనల్ని వృద్ధిలోకి తీసుకొస్తాడు" అందామె.

"మాకు మంచి చదువులూ, డిగ్రీలూ లేవమ్మా. మా కెవ్వరూ ఉద్యోగాలు యివ్వరు. పెద్దవాడైన అన్నయ్య

ఏం చేస్తున్నాడు? నువ్వు తయారుచేసిన టీని రోడ్డు వారగా నాన్న నడిపే కొట్టుకు పట్టుకెళుతున్నాడు. అక్కడ కూర్చుని టీ తాగిన వాళ్ళ గ్లాసులు కడగడంలో నాన్నకు సహాయపడుతున్నాడు."

"ఎవరో ఒకరు గ్లాసులు కడగాలిగా?"

"మాలో ఎవరో ఒకరు ధైర్యంగా తెగించి ముందుకు పోతేగాని మన కుటుంబం నిలవదు" అన్నాడు రంజన్.

"నీ దొంగతనాలు కుటుంబాన్ని నిలబెట్టలేవు. నిన్నే కూలదోస్తాయి! ఇటువైపు అటువంటి పనులు చెయ్యకు!"

అతడు జవాబివ్వలేదు. పైకి చూస్తూ వుండిపోయాడు.

"అమ్మా, నాకు నిద్ర వస్తోంది."

"హాల్లో పడుకో" అందామె.

గచ్చు నేలమీద పిల్లలందరూ పడుకొని వున్నారు. వాళ్ళ పక్కనే పడుకొన్నాడు రంజన్.

ఆమె తలుపు మూసింది. మెల్లిగా తన భర్త వున్న పడగ్గదిలోకి వెళ్ళింది.

"ఆ వెధవకు తిండి పెట్టొద్దన్నాను. గుర్తుందా?"

"నేను పెట్టలేదండీ" అని ఆమె అతడి పక్కనే వాలిపోయింది.

రాజారామ్ ఆప్యాయంగా ఆమె మీద చెయ్యి వేశాడు.

## 3

మధ్య వయసులో వున్న ఆమె ఒంటరిగా రోడ్డుమ్మట నడుస్తోంది. సోడియమ్‌వాపరు లైట్లు ప్రకాశవంతంగా వెల్గుతున్నాయి. చల్లగా వున్న రాత్రి సమయంలో అనేకమంది రోడ్డుమ్మట విహరిస్తున్నారు.

కొంచెం దూరంలో వెనకనే రంజన్ నడుస్తూ, ఆమె

వైపు చూస్తున్నాడు. ఆమె మెళ్లో ఎన్నో నగలున్నాయి. బాగా మెరుస్తున్నాయి. అతడి చూపు వాటిమీదే వుంది. మంచి అవకాశం కోసం వేచివున్నాడతను.

ఎడంవైపు రోడ్డుకు ఆమె తిరిగింది. ఆ రోడ్డుమీద ఎవ్వరూ లేరు. అతడు వేగంగా వెళ్లాడు. ఆమె మెళ్లోని గొలుసును లాగాడు. కాని ఆమె అడ్డుపడింది. ఆమె చంపమీద బలంగా కొట్టాడు. ఆమె కిందపడింది. ఆమె మెళ్ళోని ఒక గొలుసును లాక్కొని వెనక్కి తిరిగి పారి పోయాడు, మరో రోడ్డమ్మట.

"దొంగ! దొంగ! వాడిని ఆపండి! నా గొలుసు!" ఆమె గట్టిగా అర్చింది లేచి నిలబడి.

పొట్టిగా లావుగా వున్న ఆమె అతడి వెనక పరుగెత్త లేకపోయింది. ఆమె అరుపులు ప్రజలు వినేసరికి రంజన్ చాలా దూరం పారిపోయాడు.

ఆ పరిసరాల్లో వుండే గోపీ మాత్రం అతడి వెనక పరుగెత్తగలాడు. గోపీ దగ్గరకు వచ్చేస్తున్నాడు. ప్రహరీ గోడ ఎక్కి రంజన్ ఒక ఫ్యాక్టరీ కాంపౌండులోకి దూకాడు. ఫ్యాక్టరీ కాంపౌండులో ఎవ్వరూ లేరు. రంజన్ అందుకు సంతోషించాడు. అదే గోడ దూకి గోపీ అతడి పక్కకు చేరుకున్నాడు.

"ఒరేయ్, ఏదా గొలుసు?" అడిగాడు గోపీ.

గోపీ యిరవై ఏళ్ళ యువకుడు. అతడివంక రంజన్ నవ్వుతూ చూశాడు.

"నువ్వు నాలాగే వున్నావు. రేపు హనుమంతుడి గుడి దగ్గర నన్ను కల్సుకో, పదింటికి, పొద్దుట" అన్నాడు రంజన్.

"ఎందుకు?"

"నీ వాటా నీకిస్తాను. ఇప్పుడు గోడదూకి అటువైపు దిగు. నేనిక్కడ లేనని అరువు!" అన్నాడు రంజన్.

గోపీ రోడ్డుమీదకు దూకాడు. అక్కడున్న యిద్దరు ముగ్గురు అతడివైపు చూశారు.

"దొంగనాకొడుకు పారిపోయాడు ఎటో!" అన్నాడు గోపీ, మరోవైపుకు పరుగెడ్తూ.

కొంతసేపటి వరకూ రంజన్ ఆ ఫ్యాక్టరీ కాంపౌండులో ఒక చెట్టుకింద కూర్చున్నాడు. రెండుగంటలు గడిచాక అతడు గోడపైకెక్కాడు. రోడ్డుమీద జన సంచారం లేదు. కిందకు దూకి రోడ్డమ్మట వేగంగా నడిచి వెళ్ళిపోయాడు.

ఆనాడు అతడు యింటికి చేరుకునేసరికి పన్నెండు కావస్తోంది. యథాప్రకారం తలుపును తల్లి తెర్చింది.

"ఎక్కడకి పోయావురా?" అందామె.

"ఫ్రెండుతో కలిసి బీచ్‌కెళ్లాను. బస్సులో రావడానికి డబ్బులేక నడిచి వచ్చాం. అందుకే యింత లేటైంది" అన్నాడతను.

"రా, అన్నం పెడ్తాను" అందామె.

"ఇవాళ చాలా ఆకలిగా వుంది" అన్నాడతను.

"కాని తినడానికి ఎక్కువగా అన్నం లేదురా. మీ నాన్నగారి ఫ్రెండు వచ్చారు. ఆయన ఇక్కడే భోజనం చేశారు" అందామె.

"తిండిలేక మనం చస్తూంటే మనకో అతిధా!" అన్నాడు రంజన్.

"ఆయన పోతానంటే మీ నాన్నగారే వదల్లేదు. ఆయన తినవలసి వచ్చింది."

"ఇంత పేదరికంలోకి దిగజారినా నాన్నకింకా బుద్ధి

రాలేదు!" అన్నాడతను.

అతడివంక ఆమె కోపంగా చూసింది.

"ఒరేయ్, తండ్రిని గురించి అలా అనకూడదు. కావాలంటే నన్ను తిట్టు! ఆయన్ని ఏమీ అనకు! ఒకప్పుడు పెద్ద హోదాలో వుండే ఆయన యీనాడు చావలేక మనకోసం కుక్కలా బ్రతుకుతున్నారు" అందామె కన్నీళ్ళతో.

తల్లివంక సూటిగా చూశాడతను. ఆమె కన్నీళ్ళను తుడిచాడు.

"అమ్మా, యిటుపైన యెప్పుడూ నాన్న గురించి అలా అనను. తెలియక అలా అన్నాను. నన్ను మన్నించు" అన్నాడు రంజన్.

ఒక కంచంలో తిండిపెట్టి ఆమె అతడికిచ్చింది. వున్నది కాస్తా తినేశాడతను. బాగా నీళ్ళు తాగి పడుకున్నాడు. కాని ఆ రాత్రి అతడికి నిద్రబట్టలేదు. నిక్కర్ జేబులో వున్న గొలుసు అతడికి నిద్ర పట్టకుండా చేసింది.

## 4

తండ్రి పొద్దుటే టీ పట్టుకుని వెళ్ళిపోయాడు. రంజన్ తన తల్లి ముందుకు వెళ్లాడు.

"అమ్మా, నా ఫ్రెండు తల్లికి నీ సహాయం కావాలి" అన్నాడతను.

"ఎందుకురా?"

"నా ఫ్రెండు తండ్రి అపెండిసైటిస్‌తో బాధపడుతున్నాడు. వెంటనే ఆపరేషన్ చేయించాలిట. ఇంట్లో డబ్బులేదు. ఆమె గొలుసు యిస్తానంది. అది అమ్మేసి నువ్వామెకు డబ్బు యివ్వాలి" అన్నాడతను.

"ఆమెను యిక్కడకు రమ్మను. మార్వాడీ కొట్టుకు

తీసుకెళ్తాను. ఆమే అమ్మి డబ్బు తీసుకోవచ్చు" అంది తల్లి.

"భర్తను విడిచి ఆమె రాలేదమ్మా. మార్వాడీలు యెక్కువ డబ్బిచ్చేరుట. నీకేదో కంపెనీ తెలుసుగా, అక్కడ అమ్మమంది".

"శేకర్ జువెలర్స్ కంపెనీ వాళ్ళకా?"

"ఆ కంపెనీకే."

"ఆ కంపెనీ పేరు ఆమెకెలా తెలుసు?"

"మా అమ్మకు పెద్ద కంపెనీ తెలుసని నేనే చెప్పాను. తనకీ సహాయం చేయమని నీతో చెప్పమంది."

"గొలుసు యిమ్మను. వెళ్ళి అమ్ముతాను. తర్వాత నేనేదో తినేశానని ఆమె అనకూడదు."

"ఆమె చాలా మంచిదమ్మా. ఎప్పుడూ అలా అనదు" అన్నాడు రంజన్.

"అయితే గొలుసు పట్రా."

"తర్వాత వెళ్ళి తెస్తాను" అన్నాడతను.

అతడు బయటకు కదిలాడు. గంట తర్వాత తిరిగి యింటికొచ్చాడు. రహస్యంగా కాగితంలో చుట్టిన గొలుసును ఆమెకిచ్చాడు.

మూడు పేట్ల చంద్రహారం! చాలా విలువైనది. అదమ్మితే కనీసం 14 వేలుపైన రావచ్చు. ఆమె చంద్రహారం వైపు ఆశ్చర్యంగా చూసింది.

"ఇది చాలా ఖరీదైనదిరా! ఆమె నాకూడా రావడం మంచిది" అందామె.

"అంతా చెప్పానుగా, మళ్లా మొదటికొస్తున్నావు. అమ్మేసి నాకు డబ్బిస్తే నేనామెకు ఇచ్చేస్తాను" అన్నాడతను.

"అంత డబ్బు నువ్వెక్కడేనా పారేస్తే! నిన్ను మోసం చేసి ఎవరేనా లాక్కుపోతే!" అందామె.

"నేను కుర్రాడిని కానమ్మా. నా వయసు పద్ధెనిమిది దాటింది."

"సినిమా హీరోలా మాట్లాడుతున్నావు!"

ఆమెవైపు అతడు సూటిగా చూశాడు.

"అమ్మా, నేను బాగా చదువుకొని వుండకపోవచ్చు, కాని ఒకటి నీకు చెప్తున్నాను. మన కుటుంబం నా మూలంగానే బాగుపడుంది. ఏదో చేసి నేను పెద్ద పెట్టున డబ్బు గడిస్తాను. రోడ్డువారగా కూర్చుని నాన్న టీ అమ్మవలసిన ఖర్మ లేకుండా చేస్తాను."

"నీ మాటలు ఫలించాలని దేవుడిని ప్రార్థిస్తున్నాను" అందామె.

ఏదో పనుందని చెప్పి రంజన్ బయటకు వెళ్ళిపోయాడు.

ఆమె రంజన్ గురించే ఆలోచిస్తోంది.

చిన్నతనంలో రంజన్ అంటే అతడి తండ్రికి ఎంతో ప్రేమ. అతడు పుట్టాక తండ్రికి మేనేజర్‌గా ప్రమోషన్ వచ్చింది. ఇంటికి కారొచ్చింది. కార్లో కూర్చోబెట్టి తండ్రి అతడిని అన్నిచోట్లకూ తిప్పేవాడు. ఏం కావాలన్నా కొని యిచ్చేసేవాడు. వాడిని యెవరేనా ఏడిపిస్తే తండ్రి తిట్టేవాడు. అల్లారు ముద్దుగా పెరిగాడు రంజన్! పన్నెండేళ్ళదాకా జీవితం అలాగే సాగింది. తర్వాత పేకముక్కల మేడలా అంతా కూలిపోయింది.

మళ్ళా రంజన్ మూలంగా వాళ్ళ వంశం బాగుపడుందేమో! ఆమె కళ్ళలో ఆశ రగుల్కుంది!

పది ప్రాంతంలో రంజన్ హనుమంతుడి గుడి దగ్గరకు

చేరుకున్నాడు. అక్కడ గోపీ తనకోసం తారట్లాడుతున్నాడు.

"నా వాటా తెచ్చావా?" అడిగాడు గోపీ.

"పోలీసులు మనకోసం వెతుకుతున్నారు. కొన్ని రోజులు దాకా ఆ గొలుసు అమ్మలేను. అమ్మగానే నీ వాటా యిస్తాను."

"పోలీసులు నీకోసం వెతకొచ్చు. నాకోసం కాదు" అన్నాడు గోపీ.

"ఒరేయ్ పిచ్చోడా! దొంగిలించిన వస్తువులో వాటా కోచ్చేవాడు దొంగ కాడా?"

"నువ్వు ఏదో యిస్తానంటే నిన్ను పోనిచ్చాను. నేను దొంగను కాను. నీ యిల్లు యెక్కడుందో కనిపెట్టాను. తల్చుకుంటే నీ గురించి పోలీసులకు చెప్పగలను" అన్నాడు గోపీ.

"అలా చెయ్యకు. మనం కలిసి యింకో చెయ్యాలి" అన్నాడు రంజన్.

వంతెన గోడమీద కూర్చుని యిద్దరూ సిగరెట్లు వెలిగించారు. విల్స్ఫిల్టర్!

"నేను నీతో కలవను. నేను దొంగను కాను. నా గర్ల్ ఫ్రెండ్ పుట్టినరోజు రేపు. ఆమెకు చీర కొని యివ్వాలి."

"నీ గర్ల్ ఫ్రెండ్ ఎవరు?"

"అదే, మల్లిక. సాయంత్రం యిక్కడ పువ్వులు అమ్ముతుంది. ఇక్కడంటే బస్టాండు దగ్గర."

"ఆమెను చూశాను. నీకు ఎంత కావాలి?"

"వంద రూపాయిలిస్తే నిన్ను మర్చిపోతాను."

"మధ్యాహ్నం ఒంటి గంటకి మూర్తిగారి మామిడి తోటలోకి రా. అక్కడిస్తాను రొక్కం" అన్నాడు రంజన్.

"అక్కడ కోతులుంటాయ్. నాకు భయం!"

"కోతులు మన్నేం చేస్తాయి? మనిద్దర్నీ చూసి పారిపోతాయి!"

"వస్తాలే. చెప్పిన ప్రకారం డబ్బు యివ్వకపోతే పూరుకోను. వెంటనే పోలీసుస్టేషన్‌కి వెడుతాను" భయపెట్టాడు గోపీ.

ఇద్దరూ విడిపోయారు. రంజన్ తన యింటికి చేరుకున్నాడు. తల్లి యింట్లో లేదు. తమ్ముడు, చెల్లెళ్ళు మాత్రం వున్నారు.

"అమ్మ ఏదీ?"

"ఎక్కడికో వెళ్ళింది. గంటలో వస్తానంది" అంది పెద్ద చెల్లెలు లక్ష్మి.

అతడు నేలమీద పడుకొని ఆలోచించసాగాడు. ఏదో చేసి గోపీకి తను చెల్లించాలి. లేకపోతే అతడు తన పక్కలో బల్లెం అవుతాడు.

# 5

తల్లి తిరిగి వచ్చింది. ఒక కవరున్న అతడికి అందించింది. అతడు కవర్ను నిక్కర్ జేబులో దాచుకున్నాడు.

"పదిహేను వేలుపైన వచ్చింది. ఆ కవర్లో డబ్బూ, వాళ్ళిచ్చిన చీటీ వున్నాయి. వివరాలన్నీ వున్నాయి. ఆమెకది అలాగే యిచ్చేయి" అంది తల్లి.

"ఆమె చాలా ఆనందిస్తుంది. అమ్మా, యీ విషయం నాన్నకు చెప్పకు. నిన్నూ, నన్నూ తిడ్తాడు" అన్నాడతను.

"చెప్పను లేరా!"

ఆమె వంటగదిలోకి వెళ్ళిపోయింది.

పెద కొడుకు సైకిల్ మీద వచ్చాడు.

"అర్జంటుగా టీ కావాలమ్మా. అంతా అమ్మాడై పోయింది" అన్నాడతను.

"చేసిస్తాను" అందామె.

"అలా వెళ్ళివస్తానమ్మా" అని రంజన్ లేచాడు.

"ఎక్కడకిరా? ఊరమ్మట తిరగడం మాని మన కొట్టుకు రావచ్చుగా! అక్కడ గ్లాసులు కడగొచ్చు" అన్నాడు పెద్దకొడుకు రాజా.

"నేను వూరికే తిరగడం లేదురా, బడుద్ధాయ్! వుద్యోగం కోసం చూస్తున్నాను" అని రంజన్ బయటకు వెళ్ళిపోయాడు.

"వీడు వెధవలా తయారవుతున్నాడమ్మా!" అన్నాడు రాజా తల్లితో.

"విధి గీసిన గీతలనుబట్టి ప్రతి వ్యక్తీ రూపొందుతాడు. మనం ఎంత కొట్టుకు చచ్చినా వాడిని మార్చలేం. అందు వలన యెవర్ని గురించీ నేను బెంగెట్టుకోను" అంది మెల్లిగా.

రంజన్ కోడ్డమ్మట నడుస్తున్నాడు. నిక్కర్ జేబు లోకి చెయ్యిని పోనిచ్చాడు. కవరు వేళ్ళకు తగిలింది.

తనా డబ్బును యిప్పుడు ఏం చెయ్యాలి? యెక్కడ దాచాలి? ఇంట్లో దాచితే ఎవరేనా చూస్తే ప్రమాదం. నాన్నదాకా ఆ వార్త వెళుతుంది.

ఎవరో ఎదురుగా వస్తున్నారు. అతడా మనిషిని టైము అడిగాడు. పన్నెండు దాటింది. మూర్తిగారి తోటకు తను గోపీని రమ్మన్నాడు.

అతడు ఆ మామిడి తోటవైపు అడుగు వేశాడు. ఇరవై నిమిషాల్లో అక్కడకు చేరుకున్నాడు. ఒక చెట్టు కింద కూర్చున్నాడు. గోపీ యింకా రాలేదు.

అతడు నలువైపులా చూశాడు. ఎక్కడా మనుషులు లేరు. రెండు కోతులు చెట్టు కొమ్మమీద కూర్చున్నాయి.

అతడు కవరు బయటకు లాగాడు. కాగితంమీద ఏవో అంకెలున్నాయి. నోట్లవైపు అతడు ఆశ్చర్యంగా చూశాడు. నోట్ల కట్టలు! వాటిని లెఖ్ఖపెట్టడానికి టైమ్ లేదు. గోపీ ఆ నోట్లను చూడకూడదు. కాగితంమీద రాసివుంది, పదిహేను వేల నూటయిరవై యేడురూపాయిల యాభై పైసలని!

అతను 127-50 తీసి షర్టు జేబులో పడేసుకున్నాడు.

అతడికి చాలా ఆనందంగా వుంది. తనిప్పుడు ధనవంతుడు. కావలసింది కొనుక్కు తినగలడు. యేవేవో ఆలోచనలు అతడి మెదడులో తిరుగుతున్నాయి.

గోపీ మెల్లగా అక్కడకొచ్చాడు.

"తెచ్చావా?" అడిగాడు.

"అన్నయ్యా కూర్చో" అన్నాడు రంజన్.

"నేను వెళ్లాలి."

"డబ్బుతో వెళ్ళొచ్చులే."

"వాగడం మాని డబ్బియ్యి!"

వంద రూపాయిల నోటును రంజన్ అతడికిచ్చాడు. నోటును జేబులో దాచుకుని అతడు కూర్చున్నాడు.

"గ్రేట్ హెల్ప తమ్ముడూ! నిన్ను మళ్ళీ అడగను. నేను వెళ్తాను."

"ఇద్దరం పోదాం" అన్నాడు రంజన్.

"వేర్వేరుగా వెళ్ళడం మంచిది" అని గోపీ వెళ్ళి

పోయాడు.

రంజన్ పడుకుని ఆలోచించసాగాడు. చివరకి ఒక నిశ్చయానికి వచ్చాడు. అతడు లేచి తోటలోంచి బయటకు నడిచాడు.

మెయిన్ రోడ్డు చేరుకున్నాడు. బస్టేండులో నిలబడ్డాడు. బస్సు రాగానే ఎక్కాడు. జార్జిటౌన్ కి టికెట్ కొన్నాడు.

హైకోర్టు ఎదురుగా దిగాడు. ఎడంవైపుకు తిరిగి ఒక వీధమ్మట నడవసాగాడు. శ్యామలా లాడ్జి అనే బోర్డు చూసి లోపలకు వెళ్ళాడు.

హాల్లో కౌంటరు వెనక వున్న గుమస్తా ముందుకు నడిచాడు.

"గది కావాలి" అన్నాడు.

"రోజుకి పదిరూపాయిలు" అన్నాడతను.

"కీ యివ్వండి."

"ఎన్ని రోజులుంటావు?"

"రెండు రోజులు."

"ఇరవై అడ్వాన్సు యివ్వు."

అతడు యిరవై రూపాయిలు యిచ్చాడు. గుమస్తా యిచ్చిన తాళంచెవి తీసుకుని 7 నంబరు గదిలో ప్రవేశించాడు.

చిన్న గది. అసహ్యంగా వుంది. లోపలకు వెళ్ళి అతడు తలుపు మూసుకున్నాడు. మంచంమీద కూర్చుని, కవర్ను పైకితీసి నోట్లను లెక్కపెట్టసాగాడు. సరిగ్గా పదివేలు వుంది. తన తల్లి పైసలతో సహా పట్టుకొచ్చి తనకిచ్చింది!

అతడు 5 వందరూపాయిల నోట్లను పర్సు జేబులో

పడేసుకున్నాడు. కవర్ను మళ్ళా నిక్కర్ జేబులో దాచుకొని, బయటకు వెళ్ళి, తలుపు మూసి తాళం వేశాడు.

అతడు బయటకు నడిచాడు. పెద్ద హోటల్లోకి వెళ్ళి కడుపునిండా భోజనం చేశాడు. సిగరెట్ పీలుస్తూ షాపులు చూస్తూ నడవసాగాడు.

ఒక షాపులోకెళ్ళి చిన్న తోలుపెట్టె కొన్నాడు. పెట్టెను తీసుకొని బయటకొచ్చాడు. రెడీమేడ్ బట్టల షాపులోకి మూరాడు. రెండు పాంట్లు, రెండు షర్టులు కొన్నాడు. మరోచోట చక్కటి బెల్టును కొని బయటకు కదిలాడు.

రెండు గంటల తర్వాత రంజన్ తన హోటల్ గదికి చేరుకున్నాడు. తన పాత దుస్తులను తీసేసి పాంటు, షర్టు వేసుకున్నాడు. నడుం చుట్టూ బెల్టును బిగించాడు. గదిలో వున్న అద్దంలో తన రూపాన్ని చూసుకున్నాడు.

"ఫైన్!" అనుకున్నాడు లోలోపల.

నిక్కర్ జేబులోని కవరులోంచి మూడువందలు తీసి తన పాంటు జేబులో పెట్టుకున్నాడు. పాత దుస్తులను తోలు పెట్టెలో పెట్టి, మూసి తాళంవేశాడు.

అప్పుడు చూసుకున్నాడు తన కాళ్ళవైపు. అతడి కాళ్ళకున్న రబ్బరు జోళ్ళు ఎన్నో చోట్ల కుట్టబడి వున్నాయి. తను బూట్లు కొనుక్కోవాలి!

తోలుపెట్టె పట్టుకొని అతడు బయటకు నడిచాడు. కౌంటరు ముందు ఆగి గది తాళంచెవిని యిచ్చేశాడు.

"గది వదిలేసి వెళ్ళిపోతున్నాను" అన్నాడతను.

గుమస్తా అతడికి పదిరూపాయిలు వాపసు చేశాడు. అతను మెల్లిగా బయటకు నడిచాడు.

పేవ్ మెంటమ్మట అతడు నడుస్తున్నాడు. యెవరో కానిస్టేబుల్ ఎదురుగా వస్తున్నాడు. అతడు భయపడ లేదు!

కొంచెం దూరం వెళ్ళి అతడు ఒక బాటా షాపులోకి ప్రవేశించాడు. సాక్స్, షూస్ కొన్నాడు. వాటిని ధరించి పాత రబ్బరు చెప్పులను అక్కడ వదిలేశాడు. బిల్లు చెల్లించి బయటపడ్డాడు.

ఎవరినో టైమ్ అడిగాడు. ఐదయిందని ఆ వ్యక్తి చెప్పాడు. తనకు ఒక వాచ్ కావాలి! అరగంట తిరిగే లోపల అతడు వాచ్ కొని ఎడం చేతికి కట్టుకున్నాడు. వుషారుగా ఆటోలో యెక్కాడు. బాలాజీ నగర్ కి వెళ్ళమని డ్రయివర్ తో చెప్పాడు. ఆటో కదిలింది.

## 6

మార్కెట్ రోడ్డులో అతడు ఆటోను ఆపి దిగాడు. మీటర్ చూసి డబ్బిచ్చాడు. సమీపంలో వున్న హోటల్ బిలాల్ కి వెళ్ళాడు.

చికెన్ బిర్యానీ తిని, హాట్ టీ తాగాడు. క్షణ కాలం అతడు ఆలోచిస్తూ కూర్చున్నాడు. తన జీవితం హాయిగా సాగుతోంది. తనింట్లో వుండే నాన్న, అమ్మ, చెల్లెళ్ళు, తన తమ్ముడు అతడికి గుర్తుకొచ్చారు.

అతడు బిల్లు చెల్లించాడు. బయటకు నడిచాడు. పెద్ద బట్టల షాపులోకి దూరాడు. ఎడం చేతిలో తోలుపెట్టె, కుడిచేతిలో ఎన్నో పాకెట్లు పట్టుకొని అతడు బయట కొచ్చాడు.

అతడు ఆటోలో యిల్లు చేరుకునేసరికి చీకటి పడింది. ఇంట్లో లైట్లు వెల్గుతున్నాయి.

అతడు హాల్లోకి వెళ్ళాడు. తల్లి అతడివైపు ఆశ్చ

ర్యంగా చూసింది. చెల్లెళ్ళు అతడు ధరించిన పాంటును, షర్టును మట్టుకు చూస్తున్నారు.

తల్లి అతడి దగ్గరకొచ్చింది.

"పెళ్ళికొడుకులా వున్నావు ఏమిట్రా?" అంది తల్లి.

"నేను నీ కొడుకునమ్మా! లక్ నన్ను వెంటాడుతూ వచ్చింది. ప్రఖ్యాత సినిమా యాక్టర్ కిషోర్ నాకు ఉద్యోగం యిచ్చారు" అన్నాడతను.

"అతడు నీకెలా తెలుసు?"

"లక్ నన్ను ఆయనకు పరిచయంచేసింది. నా ఫ్రెండు తల్లికి డబ్బంతా యిచ్చేశాను. ఆమె సంతోషించి నా చేతిలో పదిరూపాయిలు పెట్టింది. ఏ సినిమాకేనా వెళ్ళ మంది. బస్సులో పారిస్ కెళ్ళాను. పేవ్ మెంటమ్మట నడుస్తున్నాను. వందలాది ప్రేక్షకులు కిషోర్ ని చుట్టే శారు. ఆయన తిన కారు దగ్గరకు వెళ్ళలేకపోయారు' అప్పుడు నేనేం చేశానో తెలుసా?"

"చెప్పు" అంది తల్లి.

"మనుషులను తోసుకుంటూ ఆయన దగ్గరకు వెళ్లాను. అరుస్తూ, మనుషులను గెంటుతూ ఆయన్ని కారు దగ్గరకు తీసుకెళ్ళాను. ఆయన నన్ను కారులో ఎక్కమన్నారు. ఎక్కాను. ఇంటికెళ్లాక నాతో మాట్లాడారు. ఉద్యోగమిస్తే చేస్తావా అన్నారు—చేస్తానన్నాను."

"ఏం చెయ్యాలి నువ్వు?" అడిగింది తల్లి.

"ఆయనకు బాడీగార్డుగా నేనుండాలి!"

"ఎంత జీతం?"

"నెలకు వెయ్యి రూపాయిలు. ఆయన యింట్లోనే టిఫిన్, భోజనం" అన్నాడతను.

ఆనందంతో ఆమె కొడుకు భుజంమీద చెయ్యి వేసింది

"బూరెల బుట్టలో పడ్డావురా!" అందామె.

తన చేతిలో వున్న పాకెట్లను అతడు తల్లికిచ్చాడు.

"మీ అందరికీ కొత్త బట్టలు కొన్నాను. నా ఖర్చులకు ఆయన రెండువేలు అడ్వాన్స్ యిచ్చారు" అన్నాడతను వుషారుగా.

"ఎందుకు బాబూ యివన్నీ? డబ్బును జాగ్రత్తగా వాడు" అందామె.

"ప్రతి నెలా జీతం వస్తుందమ్మా. ఇటుపైన మనకే లోటూ వుండదు" అన్నాడు రంజన్.

ఇంట్లో వాళ్ళు అతడి విజయాన్ని చూసి ఆనందించారు.

"అమ్మా, ఏమిటి వంట?" అడిగాడతను.

"కూరలు లేవు."

"నీకు ఏం కావాలో చెప్పు! నేను వెళ్ళి తెస్తాను" అన్నాడతను.

ఆమె చెప్పింది. అతడు సంచి పట్టుకుని బయటకు వెళ్ళాడు.

రోడ్డమ్మట నడుస్తున్నాడు. ఎదురుగా వస్తున్న గోపీ అతడిని చూసి ఆగాడు.

"బాగా మారిపోయావురా! ఆ గొలుసుకు బాగా వచ్చినట్టుంది" అన్నాడు గోపీ.

"ఇక నన్ను మర్చిపోతానన్నావు!"

"అదంత సులువా? నాకు రెండువందలు కావాలి. ఇవ్వకపోతే యేమవుతుందో నీకు తెలుసు!"

"వందిస్తే మర్చిపోతానని యిప్పుడు మళ్ళా అడుగుతున్నావు!"

"ఇంకెప్పుడూ అడగను. వల్లికకు మరో చీర

యివ్వాలి!"

"నీ మాట నేను నమ్మను."

"ఈసారి నమ్ము!"

"నువ్వు మల్లికతో రేపు ఒంటి గంటకు మూర్తిగారి తోటకురా. ఆమె ముందు మళ్ళా అడగనని చెప్పు. అప్పుడు నీకు రెండువందలిస్తాను" అన్నాడు రంజన్.

"వస్తాంలే" అని గోపీ వెళ్ళిపోయాడు.

7

ఆనాడు రాత్రి అందరూ కడుపునిండా భోజనం చేశారు.

భోజనాలయ్యాక రాజారామ్ సిగరెట్ పీలుస్తూ తన రెండో కొడుకువైపు చూశాడు.

"ఓరేయ్, నీ మొహం సోడియమ్‌వాపర్ లాంప్‌లా మెరుస్తోంది. ఏదో సాధించావట. ఏమిటది?" అన్నాడు తండ్రి.

"నాకు ఉద్యోగం వచ్చింది, నాన్నగారూ. రెండు వేలు అడ్వాన్స్ యిచ్చారు."

"ఎవరిచ్చారు వుద్యోగం?"

"ఫేమస్ యాక్టర్ కిషోర్ గారు."

"అతడికి నువ్వెలా వుపయోగపడ్తావు?"

"అది ఆయనే కనుక్కున్నారు. తనకు బాడీగార్డుగా నన్ను వుండమన్నారు. నెలకు జీతం వెయ్యిరూపాయిలు. ఆయనింట్లోనే నాకు మీల్స్."

"మైడియర్ బాయ్ కంగ్రాట్సు!" అన్నాడతను. తండ్రి అతడితో కరచాలనం చేశాడు.

ఆనాటి రాత్రి కొత్తచీర కట్టుకొని సాధన భర్త గదిలోకి వెళ్ళింది. ఆమెవైపు రాజారామ్ నవ్వుతూ

చూశాడు.

"ఇప్పుడు మునపటిలా వున్నావు!" అన్నాడతను.

"వాడు మీకోసం కొన్న పంచ, లక్నో జుబ్బా కట్టుకోండి. మీరూ మునపటిలా వుంటారు" అందామె.

"ఇప్పుడెందుకు, వుండనీ. అవి కట్టుకునే అవకాశం రావచ్చు" అన్నాడతను.

మర్నాడు రంజన్ లేచేసరికి తండ్రి, అన్న వాళ్ళు కొట్టుకు వెళ్ళిపోయారు.

తల్లి వుప్మా టిఫిన్ చేసింది. రంజన్ ఆకలితో తిన్నాడు. అతడు తల్లివైపు చూశాడు.

"అమ్మా, నాన్నగారు రోడ్డుపక్క కూర్చుని టీ అమ్మడం మానేయాలి. నువ్వు చెప్పమ్మా!"

"ఎందుకు మానడం?"

"అది చిన్నవాళ్ళు చేసేపని! మర్యాదైన పనికాదు!"

"బాబూ, ప్రతి పనీ మర్యాదైనదే. కష్టపడి ఏ పని చేసి పొట్ట పోషించుకున్నా తప్పులేదు" అందామె.

"ఇప్పుడు నేనున్నానుగా?"

"వున్నావు. నీ పని నువ్వు చెయ్యి. ఆయన తన పని చేసుకుంటారు. రెండూ యింటికి ఉపయోగపడ్తాయి. సంవత్సరం నుంచి టీ అమ్మితే వచ్చిన లాభాలమీదే యీ యిల్లు నడుస్తోంది. అది మానుకోడం మంచిది కాదు" అందామె.

"నీ యిష్టం" అన్నాడతను.

దుస్తులు ధరించి తొమ్మిదింటికి అతను వెళ్ళిపోయాడు. బస్టేండుకు నడిచాడు. ఎక్కడికెళ్ళాలి?

ఏదో బస్సు వస్తే ఎక్కేశాడు. ఎగ్మోర్‌కి టికెట్ కొన్నాడు. సీటులో కూర్చుని తీవ్రంగా ఆలోచిస్తు

న్నాడు. ఇంట్లో వాళ్ళు తను చెప్పిన అబద్ధాలను నమ్మేశారు. తనకేం ఫరవాలేదు. తను యెక్కడెక్కడో తిరిగి రాత్రి యింటికి చేరుకోవచ్చు!

ఒంటి గంటకు గోపీని తను తోటలోకి రమ్మన్నాడు. అది అతడికి గుర్తొచ్చింది. తను ఆ టైమ్‌కి తోటలో వుండాలి!

# 8

ఒంటి గంట లోపల రంజన్ మూర్తిగారి మామిడి తోటకు వెళ్ళాడు.

కాస్సేపట్లో గోపీ ఒంటరిగా వచ్చాడు.

“తెచ్చావా?” అడిగాడు గోపీ.

“మల్లికముందు నువ్వు చెప్పాలన్నాను.”

“మల్లిక అదుగో అక్కడుంది. మొదట డబ్బియ్యి. అప్పుడామె దగ్గరకు వెళ్దాం. ఆమె ముందు చెప్తాను” అన్నాడు గోపీ.

రంజన్ కళ్ళెత్తి ఒక కొనవైపునుంచి చూశాడు. ఎర్ర చీర ధరించిన ఒక యువతి అతడికి దూరంలో కనిపించింది.

“ఇయ్యరా తొందరగా!” అన్నాడు గోపీ.

“ఇదిగో నీ డబ్బు!” అని, జేబులోంచి చెయ్యిని తీసి పైకెత్తాడు రంజన్.

చేతిలో కత్తి మెరుస్తోంది. ఎడంచేత్తో అతడు గోపీ మెడను బిగించి పట్టుకున్నాడు.

“రాస్కెల్, పులితో ఆడ్తావట్రా? నన్ను మోసం చేద్దామనుకున్నావట్రా?” అర్చాడు రంజన్ పళ్ళు పటపట కొరుకుతూ.

అదే క్షణంలో కత్తి గోపీ గుండెలోకి దిగిపోయింది.

అరుస్తూ అతడు వెనక్కి పడ్డాడు.

రంజన్ ఆమె వున్న చోటుకు పరుగెత్తాడు. ఆమె గాభరాగా అతడివైపు చూసింది.

"ఎవరో అరిచారు? ఏమైంది?" అడిగింది మల్లిక.

"అతడిని కోతి రక్కేసింది. కోతి పారిపోయింది. మనిద్దరం అతడిని హాస్పిటల్‌కి చేర్చాలి" అన్నాడతను.

గోపీ వున్న చోటుకు మల్లిక వేగంగా వెళ్ళింది. నేలమీద పడున్న అతడిని చూసి భయంతో రంజన్ వంక చూసింది.

రంజన్ మొహం పిశాచంలా వుంది. అతడామెను పట్టుకున్నాడు. ఆమె కట్టుకున్న గుడ్డలను పీకేశాడు.

కొన వూపిరితో గోపీ వాళ్ళవైపు కన్నీళ్ళతో చూస్తున్నాడు. రంజన్ ఆమెను జంతువులా రేప్ చేస్తున్న దృశ్యం చూడలేక గోపీ కళ్ళు శాశ్వతంగా మూసుకు పోయాయి.

తన ఆకలి తీర్చుకుని అతడు లేచాడు. గోపీ గుండెలోకి దిగిన కత్తిని లాగి పైకెత్తాడు.

"నన్ను చంపకు! నీ గురించి చెప్పను" అందామె భయంతో.

అతడామెవంక చూశాడు. మల్లిక వయసు పదహారు దాటివుండదు. అంత అందమైనది కాకపోయినా యవ్వనంలో వుంది. తన కామాన్ని తీర్చడానికి ఆమె ఉపయోగ పడుంది.

"వాడు నీ మొగుడా?" అడిగాడతను.

"కాదు" అందామె.

"నిన్ను నేను ప్రేమిస్తున్నాను. పెళ్ళాడ్తాను" అన్నాడతను.

"నిజంగా?"

"నన్ను నమ్ము. నీకు ఖరీదైన బట్టలు నేను కొనిస్తాను. నిన్ను బాగా చూస్తాను" అన్నాడతను.

ఆమె చేతులు చాచింది. అతడామెమీద వాలి పోయాడు.

"నన్ను మోసం చేయకు" అందామె.

"ఇక్కడ చూసిందాన్ని గురించి మాట్లాడకు!" అన్నాడతను.

"ఇటువైపు మనం జంట. మొదటసారిగా నా సర్వస్వాన్నీ నీకిచ్చాను. గోపీ నా చుట్టూ తుమ్మెదలా తిరిగాడు కాని తేనెను తాగలేదు. నువ్వు అమాంతంగా గెట్లు పగులగొట్టి నన్ను వశపర్చుకున్నావు. నిన్ను వదలను" అందామె అతడిని కౌగలించుకొని.

గంట తర్వాత యిద్దరూ లేచారు. ఎండు టాకులో కత్తిని తుడిచి రంజన్ కిందపడున్న పాంటు జేబులో వేసుకున్నాడు. ఇద్దరూ నేలమీద పడున్న గోపీ శవం వైపు చూశారు.

ఎర్రచీమలు గోపీ ముఖంమీద, ఛాతీమీద పాకు తున్నాయి.

భయంలో ఆమె అతడిని కౌగలించుకుంది. అతడామె పెదిమలను ముద్దెట్టుకున్నాడు.

"నీ దగ్గర యీ నోటు వుంచు" అని ఒక వంద రూపాయిల నోటును ఆమెకిచ్చాడు. ఆమె నోటును తీసు కుంది.

ఇద్దరూ దుస్తులు ధరించారు.

"నిన్ను ఎక్కడ కలవడం?" అడిగాడతను.

"బస్టేండు దగ్గర పువ్వులమ్ముతూ వుంటాను"

అందామె.

"ఆ వ్యాపారం నువ్వు మానేసి నాతో వుండాలి" అన్నాడతను.

ఆమె నవ్వింది.

"మెల్లిగా అలాగే చేద్దాం" అందామె.

"నిన్ను వదలబుద్ధి కావడంలేదు" అన్నాడు రంజన్.

"మనం యిక్కడ నుంచి పోవాలి, లేకపోతే ఎర్ర చీమలు మనమీద కెక్కుతాయి" అందామె.

"మొదట నువ్వు వెళ్ళిపో! తర్వాత నేనొస్తాను" అన్నాడతను.

ఆమె వెళ్ళిపోయింది. గోపీ శవాన్ని ఏం చెయ్యడం? శవాన్ని ఎత్తి పొదల మధ్యకు విసిరాడతను. శవం కిందకు దిగజారింది. ఇప్పుడు శవం అతడికి కనపడ్డంలేదు!

రంజన్ తన దుస్తులవైపు చూసుకున్నాడు. పాంటు మీద కొద్దిగా రక్తం మరకలు వున్నాయి. అంత పెద్ద మరకలు కావు!

రంజన్ సిగరెట్ వెలిగించాడు. పొగ పీల్చి వదుల్తూ తోటలోంచి కదిలాడు. పదినిమిషాల్లో మెయిన్ రోడ్డు చేరుకున్నాడు.

మెయిన్ రోడ్డుమీద దూరంగా నడిచిపోతున్న ఎర్ర చీర అతడికి కనిపించింది. మల్లిక!

ఇంతవరకూ ఆడవాళ్ళను గురించి అతడు ఫ్రెండ్స్ చెప్తే విన్నాడు. పుస్తకాలు చదివాడు. ఈనాడు ఆడదానిలోని మధువును అతడు స్వయంగా రుచి చూశాడు.

మల్లిక కోసం, ఆమె శరీరం కోసం అతడు పరితపిస్తున్నాడు.

# 9

రంజన్ యింటికొచ్చాడు. తొందరగా తన తోలు పెట్టెను తీసుకున్నాడు.

తల్లి అతడివైపు ప్రశ్నార్థకంగా చూసింది.

"కిషోర్ గారు షూటింగ్ కు ఊటీ వెళుతున్నారు. నేనూ ఆయనతో వెళ్లాలి" అన్నాడతను.

"మళ్లా ఎప్పుడొస్తావు?"

"ఇరవై రోజులదాకా రాను."

అతడు జేబులోంచి వెయ్యి రూపాయిలుతీసి ఆమెకిచ్చాడు.

"ఇది నీ దగ్గర వుంచుకో అమ్మా. ఇంటికి ఖర్చు పెట్టు. తిరిగి వచ్చాక మళ్లా యిస్తాను" అన్నాడతను.

అతను వేగంగా బయటకు కదిలాడు. తిన్నగా బస్టేండుకు నడిచాడు. ఒక స్టూల్ మీద కూర్చుని వుంది మల్లిక. మరో స్టూల్ మీద పువ్వులున్న బుట్ట వుంది.

ఆమె ముందుకు నడిచాడతను. అతడిని చూసి ఆమె తీయగా నవ్వింది.

"బాబా నగర్ లో మంచి ఇల్లు చూశాను. అడ్వాన్స్ యిచ్చాను. అక్కడకు పోదాం రా" అన్నాడతను.

"ఎప్పుడు?"

"ఇప్పుడే."

సమీపంలో ఎవ్వరూ లేరు.

"ఎలా వెళ్దాం?"

"ఆటోలో" అన్నాడతను.

"ఆటోలో ఎక్కి హనుమంతుడి గుడి దగ్గరకు రా. నేనక్కడికొస్తాను. పోదాం" అందామె.

అతడు అక్కడ నుంచి వెళ్ళిపోయాడు. కొంచెం

దూరంలో పువ్వులు అమ్ముతున్న తన స్నేహితురాలికి ఆమె తన పూవుల బుట్టను అప్పగించింది.

"అమ్మి డబ్బు నీ దగ్గర వుంచుకో! తర్వాత వచ్చి తీసుకుంటాను" అందామె.

"ఆ గోపీగాడు నిన్ను ఒకచోట నిలవనివ్వడు" అందామె.

మల్లిక నవ్వుతూ కదిలింది. వేగంగా హనుమంతుడి గుడివైపు నడిచింది. అక్కడ ఆటోలో రంజన్ కూర్చుని వున్నాడు. నవ్వుతూ ఆమె అతడిపక్కనే ఎక్కికూర్చుంది.

"బాబా నగర్" అన్నాడతను డ్రయివర్ తో.

ఒక మేడముందు ఆటో ఆగింది. మీటరు చూసి రంజన్ డ్రయివర్ కు డబ్బిచ్చాడు. ఆటో వెళ్ళిపోయింది.

కింద భాగం తాళం తెర్చి అతడు లోపలకు నడిచాడు. వెనకనే ఆమె వెళ్ళింది. హాలు, పడగ్గది, వంటగది, స్నానాలగది, లెట్రిన్! గదులు నీట్ గా వున్నాయి. గచ్చు నేల.

"ఎలా వుంది మన యిల్లు?"

"బాగుంది" అందామె.

"పైన ఎవరున్నారు?"

"ఇంటి ఓనర్ నరసింహం, భార్య, ఒక్కగా నొక్క కూతురు" అన్నాడతను.

"వాళ్ళతో నా గురించి ఏం చెప్పావు?"

"నా భార్యా, నేనూ వుంటామని చెప్పాను."

ఆమె అతిడివైపు నవ్వుతూ చూసింది.

"నా మెళ్ళో మంగళసూత్రాలు లేవు!"

"దానికేముంది? కొని తెచ్చి రాత్రి కట్టేస్తాను"

అన్నాడతను.

"మంత్రాలు చదవడానికి బ్రాహ్మలు కావాలి" అందామె.

"మంత్రాల్లో నాకు నమ్మకం లేదు."

"నీ యిష్టం. అలాగే చేద్దాం" అందామె.

ఆమె గదులన్నీ మళ్ళా తిరిగి చూసింది.

"పాత్రాలూ అవీ కొనాలి. వంట చెయ్యాలిగా!" అందామె.

"కొందాం. అంతవరకూ హోటల్లో తిందాం" అన్నాడతను.

"హోటల్ కి చాలా దూరం నడవాలి."

"స్కూటర్ కొంటాను. ఇద్దరం దానిమీద పోవచ్చు" అన్నాడతను.

"నీ దగ్గర బాగా డబ్బున్నట్టుంది. ఎలా గడించావు?" అడిగిందామె.

"అదంతా మెల్లిగా నీకు తెలుస్తుందిలే" అన్నాడతను.

ఆమె పడగ్గదిలోకి నడిచింది. అతడు ఆమె వెనకనే నిలబడి కౌగలించుకున్నాడు. ఆమె పెదిమలను కొరుకుతూ, చప్పరిస్తూ ముద్దెట్టుకున్నాడు.

మరుక్షణంలో ఆమె వెల్లకిలా గచ్చు నేలమీద వుంది.

ఆమె అతడివంక నవ్వుతూ చూసింది.

"కాస్త కూడా ఆగలేవు. నీది పులి ప్రేమ" అందామె.

"పులి ఇలాగే ప్రేమిస్తుందా?" అడిగాడతను.

"నీలో ఏదో క్రూరత్వం వుంది" అందామె.

"మల్లికా" అన్నాడతను ఆత్రంగా.

# 10

రంజన్ పేవ్ మెంటు మీద నిలబడి వున్నాడు. పక్కనే ఫియట్ కారు ఆగింది. ఒకతను కారు దిగి మేడ మీదున్న బ్యాంకిలోకి వెళ్ళాడు.

రంజన్ కారు దగ్గరకు వెళ్ళి లోపలకు చూశాడు. ఇగ్నిషన్ కీ కారులోనే వుంది. అతడు డ్రయివర్ సీటులో కూర్చుని కారును పోనిచ్చాడు.

వుషారుగా కారును నడుపుతున్నాడు. ఒకప్పుడు కారు మెకానిక్ దగ్గర అంప్రెన్ టిస్ గా పనిచేయడం యీనాడు తనకు ఉపయోగపడింది.

చింతాద్రి పేటలో ఒక కొట్టుముందు అతడు కారు ఆపాడు. కుప్పస్వామి కారు దగ్గరకొచ్చాడు.

"నువ్వా" అన్నాడు రంజన్ వైపు చూసి.

"నంబరు ప్లేటు మార్చు" అన్నాడు రంజన్.

"ఈ కారు అమ్మవా?"

"కొన్ని రోజులు ఉపయోగించాక యీ కారు నీ దగ్గరకే వస్తుందిలే" అన్నాడు రంజన్.

పదినిమిషాల్లో నంబరు ప్లేటులు మార్చబడ్డాయి. కుప్పస్వామికి అతడు నూరు రూపాయిలు యిచ్చాడు.

కుప్పస్వామి అతనివంక చూశాడు.

"ఈ కారుకు ఐదువేలు యిస్తాను."

"చాలా తక్కువ."

"పదివేలు వేసుకో!"

రంజన్ కార్లోంచి దిగాడు.

"పదివేలియ్యి. కారును యిక్కడే వదిలి పోతాను" అన్నాడు రంజన్.

కుప్పస్వామి యిచ్చిన పదివేలు తీసుకుని రంజన్

రోడ్డమ్మట నడిచి వెళ్ళిపోయాడు.

కాల చక్రం తిరిగిపోతోంది.

అంబాసిడర్ కారు యింటి ముందు ఆగింది. రంజన్ వుషారుగా యింట్లోకి వెళ్ళాడు.

పడగ్గదిలో మల్లిక, ఉష కుర్చీల్లో కూర్చుని మాట్లాడు కుంటున్నారు. అతడిని చూసి ఉష లేచింది.

"ఆమె తల్లీ తండ్రీ కంచీపురం వెళ్ళారు. రాత్రి వస్తారు అందుకని ఆమె యిక్కడుంది" అంది మల్లిక.

"కూర్చో పిల్లా!" అన్నాడతను.

ఉష కేసి అతడు సూటిగా చూశాడు. ఆమె మహా అందంగా వుంది. ఆమె ముందు మల్లిక దిష్టిబొమ్మలా అగు పిస్తోంది.

ఉష వయసు పదహేనుంటుంది. సహజంగా ఎరుపుగా వున్న పెదిమలు. బంగారంలాంటి శరీరచ్ఛాయ.

అతడు అమాంతంగా ఉషను పట్టుకున్నాడు. ఆమె భయంతో మల్లికవైపు చూసింది.

"రంజన్, ఆమెను వదులు!" అర్చిందామె.

మల్లిక చంపమీద అతడు బలంగా కొట్టాడు. ఆమె స్పృహతప్పి కింద పడింది.

ఉష వణుకుతోంది.

"భయపడకు. నిన్ను చంపను" అన్నాడతను.

మరుక్షణంలో ఆమెను రేప్ చేయడం ప్రారం భించాడు. అరవకుండా ఆమె నోరు నొక్కేశాడు. అతడి కామానికి ఉష బలైపోయింది.

అతడిలో రగులుకున్న కామాగ్నిజ్వాలాలు చల్లారేక అతడు లేచాడు. మల్లిక యింకా పడుకునే వుంది. ఉష మూలుగుతోంది.

ఈ యింట్లో వుంటే తనకు ప్రమాదం. అతడు తన తోలుపెట్టెను తీసుకున్నాడు. తన బట్టలను ఏర్ బాగ్ లో పెట్టుకున్నాడు.

ఇంట్లో అద్దెకు తెచ్చిన కుర్చీలు, పాత్రలూ తప్ప మరే వస్తువులూ లేవు.

నేలమీద పడున్న మల్లిక ముందు ఆగి ఆమెవంక చూశాడతను.

"మల్లికా వెళ్ళి బస్టేండులో పువ్వులమ్ముకో! గుడ్ బై" అని అతడు బయటకు నడిచాడు.

# 11

ఒంట్లో బాగోక ఆ రోజు రాజారామ్ యింట్లోనే వున్నాడు. పోలీస్ జీప్ యింటిముందు ఆగింది.

ఇన్ స్పెక్టర్ నాయర్ లోపలకు వచ్చాడు.

"నా పేరు రాజారామ్. మీకేం కావాలి?" అడిగాడతను.

"రంజన్" అన్నాడు యిన్ స్పెక్టర్.

"వాడు నా రెండో కొడుకు. వాడు ఇక్కడ లేడు. ఇక్కడ వుండడంలేదు."

"ఎక్కడున్నాడు?"

"అది నాకు తెలియదు."

ఇన్ స్పెక్టర్ నాయర్ కాన్ స్టేబుల్స్ వైపు చూశాడు.

"ఇల్లు సోదా చేయండి!" అర్చాడు యిన్ స్పెక్టర్. రాజారామ్ గాభరాగా ఇన్ స్పెక్టర్ వంక చూశాడు.

"రంజన్ ఏం చేశాడు?" అడిగాడు తండ్రి.

అతడివైపు ఇన్ స్పెక్టర్ నాయర్ జాలిగా చూశాడు.

"అతడి నేరాలను గురించి మీరు పత్రికల్లో చదవలేదూ?" అడిగాడు ఇన్ స్పెక్టర్.

"పెద్ద ఉద్యోగం పోయాక, రోడ్డు పక్క కూర్చుని టీ అమ్మి మేం బతుకుతున్నాం. నేను దినపత్రిక చదవడం మానేసి కొన్ని సంవత్సరాలైంది" అన్నాడు రాజారామ్.

"రంజన్ కోసం పట్నమంతటా గాలిస్తున్నాం. అతడు మాకెక్కడా దొరకలేదు. పువ్వులమ్మే ఒకామె మూలంగా ఇక్కడకు వచ్చాం" అన్నాడు ఇన్స్పెక్టర్.

ఒక కానిస్టేబుల్ పరుగెత్తుకొచ్చాడు.

"సార్, పెద్ద ట్రంక్ పెట్టెలో నోట్లు కుప్పలుగా పడున్నాయి" అన్నాడతను.

"ఎంతుందో లెక్కెట్టండి!"

ఇన్స్పెక్టర్ అనుమానంతో రాజారామ్ వంక చూశాడు. రంజన్ తల్లి ఇన్స్పెక్టర్ ముందుకొచ్చింది.

"ఆ డబ్బు ఆ పెట్టెలో వున్నట్లు నా భర్తకు తెలియను. వాడు అప్పుడప్పుడొచ్చి నాతో మాట్లాడి వెళ్ళిపోయేవాడు. ఆ పెట్టెలో డబ్బు పడేసేవాడు. అదెలా వాడికొచ్చిందో నాకు తెలియదు" అందామె.

రాజారామ్ కోపంగా భార్యవంక చూశాడు.

"అప్రాచ్యురాలా, ఇంత కాలం నాతో చెప్పకుండా ఆ డబ్బు నిక్కడుంచావా?" అర్చాడతను.

ఇన్స్పెక్టర్ నాయర్ అతడివైపు చూశాడు.

"ఈ పట్నంలోని ప్రజలను రంజన్ హడలగొట్టేస్తున్నాడు. కార్లు, స్కూటర్లు, మోపెడ్లు మాయమవుతున్నాయి. కనీసం యాభై రేపు కేసుల్లో వుందతని పేరు. ఎన్నో దోపిడీలు సాగించి అతడు లక్షలకు లక్షలు యెత్తుకుపోయాడు. యెందర్నో చంపాడు. యింకా చెప్పాలా?" అన్నాడు ఇన్స్పెక్టర్.

రాజారామ్ మొహాన్ని కప్పేసుకున్నాడు.

"ఇన్‌స్పెక్టర్, వాడెక్కడేనా కనిపిస్తే యీ చేతుల్తో వాడి పీక పిసికి చంపేస్తాను" అన్నాడు రాజారామ్.

ఇన్‌స్పెక్టర్ నాయర్ నవ్వాడు.

"రంజన్ బాగా ఒలిసిపోయాడు. మీరు దగ్గరకెళ్తే మిమ్మల్ని కూడా చంపేస్తాడతను! అరడజను పోలీసులను అతడు షూట్ చేసి చంపేసి, కారులో పారిపోయాడు ఒకసారి" అన్నాడు యిన్‌స్పెక్టర్.

"అంతవరకూ వాడిని అందుకు ఎదగనిచ్చారు? మొదట్లోనే వాడిని చీల్చి పారేయవల్సింది" అన్నాడు రాజారామ్.

"ఆ డబ్బు లెక్కపెట్టడం మావల్లకాదు సార్" అన్నాడు కానిస్టేబుల్.

"పెట్టెకు లాక్ చేసి సీల్ చెయ్యండి!" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

పక్క గదిలో సాధన ఏడుస్తోంది. యిన్‌స్పెక్టర్ నాయర్, రాజారామ్ ఆ గదిలోకి కెళ్ళారు.

"నీ కన్నీళ్ళు వాడి నేరాలను కరిగించలేవే" అన్నాడు రాజారామ్.

"అటువంటి రాక్షసుడిని యెందుకు కన్నానో!" అని ఆమె వెక్కి వెక్కి యేడ్చింది.

"రాక్షసుడిని కూడా ఎవరో కనాలిగా!" అన్నాడు ఇన్‌స్పెక్టర్ నాయర్.

## 12

చీకటి పడింది. రోడ్ల లైట్లు వెల్గుతున్నాయి. ఆరతి పేవ్ మెంటమ్మట నడుస్తోంది.

తనకోసం నాన్న కారెందుకు పంపలేదో? ఆమె

ఆలోచిస్తూ అడుగులేస్తోంది.

పక్కనే ఒక డాడ్జికారు ఆగింది. ఆమె ఆత్రంగా కారు దగ్గరకు వెళ్ళింది. ఆ కారు నాన్నదే.

కిటికీలోంచి ఆమె లోపలకు చూసింది. తన డ్రయివర్ కాడు. నాన్న కారులో వచ్చిన యితనెవరు?

"మీకోసం కాలేజికెళ్ళి యిలా చూస్తూ వస్తున్నా" అన్నాడతను.

"నిన్నెప్పుడూ చూడలేదు" అందామె.

"నేను డ్రయివర్ని కాను. మీ తండ్రిగారి ఆఫీసులో పనిచేస్తున్న టైపిస్టుని. డ్రయివర్ ఆరోగ్యం బాగా లేదు. మీకోసం నాన్నగారు నన్ను పంపారు" అన్నాడతను.

"మీరు నన్నెలా పోల్చగలారు?"

"నాన్నగారితో మీరు ఆఫీసుకొచ్చినపుడు చాలా సార్లు చూశాను."

నిస్సందేహంగా ఆమె వెనుక సీటుమీద కూర్చుంది. తలుపు మూసింది. మౌనంగా అతడు కారును పోనిచ్చాడు.

అతడి మెదడులో ఆలోచనలు సాగుతున్నాయి. నాలుగైదుసార్లు కాలేజి ప్రాంతంలో అతడు ఆరతిని చూశాడు.

అతడిలో కోర్కె రగుల్కొంది. ఎలాగైనా ఆమెను పొందాలి!

ఆ రోజు కాలేజికి వెళ్తూన్న కారును అతడు ఆపాడు.

"నేను సి.ఐ.డి. ఆఫీసర్ని. నీ లైసెన్సు ఎక్కడ?" అడిగాడు డ్రయివర్ని.

అదే సమయంలో డ్రయివర్ క్లోరోఫామ్ తనకు తెలియకుండా పీల్చాడు. ముందు సీటుమీద వాలి

పోయాడు. అటుపైన అతడు కారును పోనిచ్చాడు. ఎవ్వరూ లేనిచోట డ్రయివర్ని దింపి, పేవ్ మెంట్ వారగా పడుకోబెట్టాడు. నాటుసారా తాగి పడుకున్నాడని అందరూ అనుకుంటారు. అతడు కారును కాలేజికి తీసుకుపోయాడు. ఆమె వెళ్ళిపోయిందని ఎవరో చెప్పే యిటు కారులో వస్తూంటే నక్షత్రంలా ఆరతి కనిపించింది!

అతడు కారును పోనిస్తున్నాడు. ఆమె బయటకు చూస్తోంది. పువ్వులంటే ఆమెకు పిచ్చి.

"కాస్సేపు ఆపండి. పువ్వులు కొనాలి" అందామె.

పువ్వుల మ్మేచోట అతడు కారు ఆపాడు. ఆరతికి మల్లెపూలిస్తూ మల్లిక ముందు సీటులో వున్న డ్రయివర్ని చూసి తృళ్ళిపడింది.

మెల్లోంచి ఏదో తీసింది. తలుపు తెర్చింది. అమాంతంగా వెనుక నుంచి డ్రయివర్ని అనేకచోట్ల కసితో పొడిచేసింది.

ఇంకా పొడుస్తూనే వుంది!

ఆరతి అరుస్తూ కిందకు దూకింది. అనేకమంది గుమిగూడారు కారుచుట్టూ.

పువ్వులమ్మే మల్లిక ఆరతి ముందుకు దిగింది.

"వాడు పిశాచం అమ్మా. నిన్ను ఎక్కడికో తీసుకుపోయి బలాత్కరించేవాడు. నువ్వు రోజూ కొనే పువ్వులు నీ శీలాన్ని కాపాడాయి" అంది మల్లిక.

"అతడు నీకెలా తెలుసు?" అడిగింది ఆరతి.

మల్లిక కళ్ళు మూసుకుంది.

"నా ప్రియుడిని చంపి, ఆ శవం ముందు యీ దుర్మార్గుడు నన్ను రేప్ చేశాడు" అంది మల్లిక.

"ఎవరేనా మా నాన్నకు ఫోన్ చేయండి. నేనిక్కడున్నానని చెప్పండి" అర్చింది ఆరతి.

పోలీస్ జీప్ కారు పక్కనే ఆగింది.

"ఏమైంది?" అడిగాడు ఇన్‌స్పెక్టర్ నాయర్.

లోపల లైటు వేసి కార్లోకి చూశాడు ఇన్‌స్పెక్టర్.

రంజన్ రక్తం మడుగులో సీటుమీద పడున్నాడు!

"ఎవరు చంపారతడిని?" అడిగాడు నాయర్.

"నేను సార్! నా పేరు మల్లిక!" అందామె.

ఇన్‌స్పెక్టర్ ఆమెవైపు ఆశ్చర్యంగా చూశాడు.

"మల్లికా, ఆ దుర్మార్గుడు నీకే దొరికాడా? విధి నీ దగ్గరకే అతడిని పంపిందా?" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"ఈ అమ్మాయి శీలాన్ని కాపాడగల్గినందుకు నేను సంతోషిస్తున్నాను" అంది మల్లిక.

"ఈమె ఎవరు?" ఇన్‌స్పెక్టర్ అడిగాడు.

"నా పేరు ఆరతి ఇన్‌స్పెక్టర్. లేబర్ మంత్రి మంగరాజుగారి కూతుర్ని" అందామె.

"పట్నం ప్రజలను హడలగొట్టేసిన రంజన్ జీవితం ఆఖరికిలా అంతరించింది" అన్నాడు ఇన్‌స్పెక్టర్ నాయర్.

—:అయిపోయింది:—

సీరియల్



ప్రతాప రవిశంకర్

(గత సంచిక తరువాయి)

భారత్ కు ఆ ఆర్తనాదం వినపడింది.

బాధ కలిగింది. అప్పుడే యిద్దరు మనుషులను టకారాలు చంపేశారు.

ఆ ఆక్రందన వినగానే ఇక ఒక్క సెకనుకూడా స్టెల్లా ఆలస్యం చెయ్యలేదు. చెవిదాకా లాగి వదిలిపెట్టిన బాణంలా ఒక్కసారి ముందుకు పరుగెత్తింది.

పరుగుదీయటంలో చదువుకునేటప్పుడు స్టెల్లా యెన్నో బహుమతులు గెల్చుకుంది.

ఆ స్త్రీ ఏమైపోయినా తనకు పనిలేదు. అంతా ఆమె దురదృష్టం. ఆమె ప్రాణాలు కాపాడటానికే తను యెంతో రిస్కు తీసుకుంది. కాని అందువల్ల ఉపయోగం లేకుండా పోయింది. ఆమెతో ముడిపెట్టుకుంటే తన ప్రాణాలు కూడా యెగిరిపోతాయి.

కొన్ని క్షణాల్లోనే ముందు వెళుతున్న మనుషులను కలుసుకుంది. కలుసుకుంటూనే అరిచింది. "ఇంకా వేగంగా పరిగెత్తండి. టకారాలు దగ్గరకు వస్తున్నారు. అప్పుడే ఇద్దరి ప్రాణాలు తీసేశారు."

స్టెల్లా అలా అనేసరికి ఆయాసంతో — అలసటతో రొప్పుతున్న వాళ్ళు కూడా పరుగు వేగాన్ని యింకా పెంచారు.

ఆ చెట్లకింద చీకట్లో కొంచెం కూడా అస్పష్టంగా ఐనా యేదీ కనిపించటంలేదు. చెట్లమధ్యనించి జాగ్రత్తగా పరిగెత్తుతున్నాడు భారత్. అతను వెనక్కి తిరిగి చూడకుండానే అందర్నీ త్వరగా రమ్మని పరుగుతీస్తున్నాడు.

స్టెల్లా సగం మందిని దాటింది.

ఇంతలోనే యెవరో చీకట్లో ఒక చెట్టును ఢీకొని బాధగా అరిచారు. తర్వాత దబ్ మన్న చప్పుడు వినపడింది. ఆయనే ముసలాయన. మొహం చెట్టుకు కొట్టుకోవటంతో కళ్ళు తిరిగాయి. కిందపడిపోయాడు అరుస్తూ. వెంటనే లేవలేకపోయాడు. అప్పటికే మిగిలిన వాళ్ళు ముందుకు వెళ్ళిపోయాడు.

వెనుకనించి టకారాల అరుపులు, అడుగుల చప్పుళ్ళు వినపడుతున్నాయి. గబగబా లేచే ప్రయత్నం చేశాడు. కాని సాధ్యం కాలేదు. అవయవాలు స్వాధీనంలోకి రాలేదు.

దగ్గరికి వస్తున్నారు టకారాజాతి మనుషులు. లేవాలి, పరుగుతీయాలి. ప్రాణాన్ని కాపాడుకోవాలి. ఎంతగా అనుకున్నా కొంచెంకూడా లేవలేకపోయాడు ఆయన.

సెకన్లలో టకారాలు దగ్గరకు వచ్చేశారు.

చీకట్లో వున్న ముసలాయన ఊపిరి తీస్తున్న శబ్దం

# "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 6 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాదిపాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగా పంపుతాము

# "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల ... పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. పూర్తి వివరాలకు పత్రిక చూడండి.

అయితే, ఈ స్కీము అసలు ఏజంట్లు వున్న ప్రాంతాలకు వర్తించదు. మీరు హోమ్ డెలివరీ సభ్యత్వము పంపే ముందు మీ వూరిలో మా ఏజంటు లేడనే విషయం నిర్ధారణ చేసకోండి.

నేడే మీరూ 'హోమ్ డెలివరీ'లో చేరండి!

వినపడింది. అంతే—బల్లెం పైకి లేచింది. వెనువెంటనే ముసలాయన చావుకేక ఆ దీవినంతటినీ కలచివేసింది.

ముందు పరిగెత్తుతున్న వాళ్ళంతా బిగుసుకుపోయారు. టకారాలు తమని కూడా ప్రాణాలతో వదలరనే నమ్మకం వాళ్ళకు బలంగా కలిగింది.

సరిగ్గా అప్పుడే పులిగాండ్రింపు వినిపించింది.

పరిగెత్తుతున్న వాళ్ళంతా ఒక్కసారి ఎవరో పట్టి ఆపినట్టుగా ఆగిపోయారు.

అంతా చీకటి. ఆ చీకట్లో పులి యెక్కడ వుందో తెలీదు. ఎక్కడ? ఎదురుగా వుందా?

భారత్ కూడా ఆగిపోయాడు. పరిగెడుతూనే స్టెల్లా "భారత్" అంటూ అరిచింది.

"స్టెల్లా.... క్విక్.... ఎక్కడో దగ్గర్లోనే పులి పొంచి వుంది."

మళ్ళీ పులి గాండ్రించింది-ఈసారి ఇంకొంచెం దగ్గరిన్నుంచి వినపడింది.

ఒక్క అడుగుకూడా ముందుకు వెయ్యలేకపోయారు. ఎక్కడ నిల్చున్నవాళ్ళు అక్కడనే.

ఎండుటాకుల మీద జంతువేదో పరుగెత్తుతున్న చప్పుడు వినపడింది. పులి దగ్గరకు వస్తోంది—ఈ ఆలోచన రాగానే మళ్ళీ ముందుకు పరుగుతీయబోయారు.

అప్పటికే వెనకనించి టకారాలు బాగా దగ్గరకు వచ్చేశారు.

నాగరికులు పులి గాండ్రింపు విని ఆగిపోవటం టకారాలకు తెలిసిపోయింది.

ఒకడు బల్లెం విసిరాడు.

సూటిగా వచ్చి పరుగుదీయబోతున్న మనిషి తలలో

దిగబడింది. ఆయుధం కూడా బయటకు రాలేదు. తలను చీల్చుకొని బయటకు వచ్చింది. అక్కడికక్కడే కూలి పోయాడతను మొదలు నరికిన చెట్టులా.

తమ పక్కనే ఓ మనిషి కూలిపోవటం వాళ్ళకు తెలిసింది. పులి పక్కనే చెట్ల మధ్యనించి వస్తోందని ఆకుల చప్పుడుతో తెలుసుకుని ముందుకు పరుగుతీశారు.

అప్పటికే ఆలస్యమయ్యింది. పులి చీకట్లోనే వచ్చి ఒక్కసారి పైకెగిరి వాళ్ళమీదకు దూకింది.

కింద పడిపోయారు అరుస్తూ. వాళ్ళ చేతిలో ఆయుధాలు చీకట్లో దూరంగా పడిపోయాయి. ఆయుధాలు వున్నా వాటితో పులిని యెదిరించి దాన్ని చంపగలిగే ధైర్యసాహసాలు ఎవ్వరికీ లేవు వారిలో.

కిందపడకుండా మిగిలిన వాళ్ళు చెల్లాచెదురైనారు. దిక్కుతోచక యెవరికి తోచినట్టుగా వాళ్ళు పరుగెత్తిపోయారు.

చెట్లకు తగులుకుని పడిపోయారు.

పులి అప్పటికే కిందపడిన వ్యక్తిని గాయపరిచింది. అతను మృత్యు భయంతో పిచ్చిపట్టినట్టు కేకలు పెడుతున్నాడు.

టకారాలు పూర్తిగా దగ్గరకు వచ్చేశారు. రావడంతోనే ఒక్క నిమిషంకూడా ఆలస్యం చెయ్యకుండా కిచకిచల భాషలో ఏదో అంటూ చేతికి దొరికిన మనుషులను దొరికినట్టు వంకీ కత్తులతో నరికేశారు. కొంతమందికి చేతులు తెగిపోయాయి. మరికొంతమందికి తలలు పగిలిపోయి కత్తులు మెడవరకూ దిగబడిపోయాయి.

వాళ్ళకు దగ్గర్లోనే పులి అతడి పీకనూ కొరికేసింది. ఘోరంగా వుంది పరిస్థితి. (సశేషం)

